# ఈ నాటకమందలి పాత్రలు

—— :o: ——

## పురుషులు

అశ్వినేయుఁడు [అమరావతి ప్రభువు; భిషఙ్మణి]
ధన్వంతరి
ఆత్రేయుఁడు } కల్యాణపురి రాజులు; శుచి మత నిర్మాతలు
విశారదుఁడు [ధన్వంతర్యాత్రేయ శిష్యుఁడు; శుచి మతాధిపతి]
ప్రభావుఁడు [విశారద శిష్యుఁడు]
మన్నెజ్వరము
సన్నిపాతము
వసకుఁడు
తుపానుజ్వరము
కోడెలరెడ్డి
జోగులు
కల్యాణపురి ద్వారపాలకుఁడ
గ్రామస్థులు—ఆర్గురు
బైనేనివాఁడు
శెట్టి
విశారద శిష్యుఁడు
సర్దారుసింగు
నాగన్న
వెంకయ్య
సుబ్బయ్య
ప్రథముఁడు
ద్వితీయుఁడు
బాలభటులు
చయనుల వారు

సెట్టి
జినులు
కుష్ఠరోగి
ఉన్మాద వైద్యశాల కాఁపరి
,, భటుఁడు



స్త్రీలు

—

శ్రీశుచి పరాశక్తి
లక్ష్మి
సరస్వతి
శుచి } అశ్వని పుత్త్రికలు
సుధ }
బాలిక—గణాచారిణి
వనపాలిక
రత్నము
మృత్యువు
మహామారి
విషూచి
పోలేరమ్మ
కుసుంభిణి
ఫిరంగిణి



# విన్నపము

ఉపోద్ఘాతము చెప్పుటకు తీరిక లేనిది. అదియు సర్వదా లోకక్షేమ పరామర్శ కర్తవ్యమయినది. అయినను లోక సంగ్రహార్థము స్వాస్థ్యము అలక్ష్యముగ నిడినను పురాణశక్తి ప్రచారమే సోదరులగు భారత పుత్త్రులకు హితమును జయప్రదమును నగునని నమ్మి ప్రకృత నాటకయుగమున కనువగు ఇతివృత్తమును దైవికముగా సంకల్పించి దేశాభ్యుదయమునకయి సేవామాత్రముగ నిరూపకము 1920వ సంవత్సరములో నెల్లూరులో రచించితిని. ప్రప్రథమమున ఆ సంవత్సరముననే సెప్టెంబరు నెల నాల్గవ తేదీన నెల్లూరులోను తదుపరి నంద్యాలలో 1921 వ సంవత్సరములో విద్యా ప్రదర్శన సమయమునను, ఒంగోలు నెల్లూరు కడప పట్టణములలో 1924 వ సంవత్సరమునను, ఛత్రపుర బరంపురములలో 1925 వ సంవత్సరమున నాయా జనవరి నెలలలో నారోగ్యవారములందు శుచిమండలివారిచే నీనాటకము ప్రదర్శింపఁబడెను.

పోషకత్వము ప్రసాదించి యాంధ్ర రంగస్థలిక పూర్వముగ సతీ సమేతులయి విచ్చేసి గంజాము మండలసామంతరాజులు మొదలుగాఁగల ప్రజా పరివేష్టితమగు నిండోలగమున బరంపురమున జరిగిన శుచి నాటకముఁ దిలకించి సాదరముగా నన్నురాఁబిలిచి తద్రంగస్థలి సమ్మోద సంభాషణ సంభావమున గౌరవించిన చెన్నపురి రాజధాని గవర్నరు శ్రీగోషన్ ప్రభువుగారికిని,

నెల్లూరులో కలెక్టరు భవనమున విందయి వచ్చి విడిది దిగినప్పుడు తద్వినోదార్థ శుచి ప్రదర్శన సందర్భమున ప్రశంసించుచు నన్ను సత్కరించుటయేగాక, లాహూరు గవర్నరుగారి సౌధమునుండి నేను మరలివచ్చి దర్శించి వ్రాయు హిందూదేశవిశేషాంశములలో యీనాటక విషయమయి ప్రకటింపనున్నాను. హిందూదేశప్రజాక్షేమ ప్రచారార్థము మీరు నూత్నశక్తి నత్యంత ఫలప్రదమగు గానము చేసితిరని యుత్తరము వ్రాసిన దిగంత విశ్రాంతకీర్తి "లండన్ టైమ్స్" విలేఖరియు లోక ప్రసిద్ధ రాజకీయవేత్తయు నగు సర్ వ్యాలంటైను షిరోలుగారికిని,

ప్రదర్శన సమయములందు శ్లోక పద్యములతో బ్రస్తుతించిన పండిత కవివర్యులకును,

నెల్లూరు నంద్యాల కడప బరంపురములందు శుచి ప్రదర్శనముల నుద్ధరింపఁ గంకణ బద్ధులయి నిలిచి నామర్యాదలఁ గారణభూతులయి నన్ను ధన్యునిఁ జేసిన యాంధ్రాంగ్లేయాది భాషాకోవిదులును కలెక్టరు గారునగు ఎ. యం. ఎ. సి. గెలటీ ఐ. సి. యస్. దొరగారికిని,

నన్నుఁ బ్రోత్సాహపఱిచి యీనాటకము ముద్రింపించుటకు నిర్బంధపెట్టినమిత్త్ర బృందమునకును, తమ సహజౌదార్య భాషాపోషకత్వమును నాపట్లఁ గుమ్మరించి వేయినూట పదునార్లు నాకుఁ బారితోషిక మొసంగిన మా నెల్లూరుమండలరెడ్డికులావతంసులగు భ్రాతృవర్గమునకును కృతజ్ఞతా పూర్వకవందనము లర్పించుచున్నాను.

శ్రీ శుచినాటకము ముద్రింపించుట కాలస్యమగుటయు ప్రదర్శింప కోరినప్పుడు వ్రాతప్రతులైన సమర్పింప లేకుండుటయు వ్యాధి విరామము లేమిచేనని విన్నవించుచు మిత్త్రులను క్షమాపణ వేఁడుచున్నాఁడను.

గుంటూరు
11-2-27.

విధేయుఁడు,
రావుసాహెబు, మన్నెము శేషాద్రిరెడ్డి.

శ్రీ

# శుచి నాటక కథా సంగ్రహము.

---

లక్ష్మీసరస్వతులు ఒకానొకప్పుడు వ్యాధిబాధితలయి ప్రళయము శంకించి శ్రీ శుచి పరాశక్తిని గూర్చి తపస్సుచేసిరి. ఆభగవతి ప్రత్యక్షమయి వారికి ప్రళయభయము లేదని అభయ మొసఁగి, వారితాపములకు కారణము వారిభక్తుల శీలరాహిత్యమే అని నిరూపించి, మానవజాతికి వ్యాధులచే రానున్న ప్రళయమునకు అడ్డుపడుటకు శుచి మతము నిర్మాణము చేయ విష్ణు బ్రహ్మలు, ధన్వంతర్యాత్రేయులయి కల్యాణపురమున అవతరింతురనియు, స్వాస్థ్యము నెలకొల్పుటకై ధాత్రేయి లోకోద్ధారణముచేయు వారికుపుర శుచిసుధలై అమరావతిలో అశ్వినీసుతుల పుత్రికలుగా జనింపుఁడనియు ఆజ్ఞాపించి అంతర్ధానమాయెను.

అపుడు మృత్యువు ప్రళయ కంకణముదాల్చినదై తన కన్నులజనించిన మారణరోగములను మానవజాలము నల్లకల్లోలముచేయ బంపుచో వానికి ప్రాఁపగు గృహవాసక క్షుద్రజంతువుల హారములను ప్రాణాధార పరికరములను పారితోషికము మొసఁగెను. ఇట్లు మహామారి యెలుకల హారము, విషూచి యీఁగలహారమును జలకలశమును, మన్నెజ్వరము దోమలహారమును, సన్నిపాతము జలకలశమును, తుపాను జ్వరము పేలహారమును, మసుంభిణీ ఫిరంగిణులు (సుఖవ్యాధులు) అవికలమ పొందిరి. (చీములోని సూక్ష్మక్రిమి) వసమఁడు, వ్యాధులకు హేతుఁడుగ నియమింపఁబడెను. వివిధములగు వ్యాధుల భయముచే వలస వచ్చినవారు చింతగుంట గ్రామస్థులతో కలిసి రక్షకై ధన్వంతర్యాత్రేయుల సన్నిధికి కల్యాణపురమునకుఁ బోవుదురు.

కల్యాణపురమునకు ధన్వంతర్యాత్రేయులు ప్రభువులు. వారికి వైద్యము ఇష్టకళ. ధన్వంతరి శస్త్రచికిత్సయందును ఆత్రేయుఁడు కాయరక్షణమందును నిరుపమానమయిన కౌశలము గలవారు. లోకమును వ్యాధుల ప్రళయమునుండి రక్షింప శుచిమతమును వారు సృష్టించిరి. శుచిమతమునకు గురువుగా విశారదుఁడును, ఆయనశిష్యుఁడు ప్రభావుఁడు హరిదాసుగను, శుచిమతప్రచారార్థము ప్రయాణమగుదురు. ప్రభావుఁడు విషూచీభీతిచే భజనలుచేయు కల్యాణపురము పరిసరమందలి పల్లెటూళ్లవారిని ప్రబోధించును. నిజమంత్రప్రభావమున శుచిదేవతను ఒకబాలపై నావహింపఁజేసి చాతుర్వర్ణ్యముల వారి అనారోగ్యములు నిరూపించును. కల్యాణపురమునుండి ఆఱుమాసములకు ముందు కోడెలవ్యాపారమునకు పోయియుండిన ఒక రెడ్డి, భోగముసానితో నచటనుండెను. తనయూరు కల్యాణపురము పడఁగొట్టఁబడి యెలుక, యీఁగ, దోమలు చొరరానియట్లు పునర్నిర్మాణము సేయఁబడుచున్నదని రెడ్డి ప్రభావునివలన విని తా నూరువెడలు నపుడు చూపులోదాఁచివచ్చిన అప్పుపత్రములను గూర్చి పరితపించి కల్యాణపురమునకుఁ బ్రయాణమగును. కల్యాణపురమందలి నిజకార్యస్థానములో శుచి విద్యావాస్తు శాఖా సర్వాధికా

యలు కార్యనివేదిక ముఖముల శుచిమత ప్రచార ప్రకారము ముచ్చటింతురు. కోడెలరెడ్డి, భోగముసాని, జోగులు, కల్యాణనగరము దరియుదురు. పట్టణముఖద్వారపాలకుఁడు వారిని నిల్వరించును. ధన్వంతరిదేవుని చండశాసనములు:—క్రొత్తగా నగరములో ప్రవేశించువారందఱు ఊరివెలుపలి మిట్టమీఁది వైద్యశాలలో తనికీపొంది యేవైన రోగములుండిన స్వస్థముచేయించుకొనియే నగరములోఁ బ్రవేశింపవలసియుండెను. భోగముసాని అందులకు ఇష్టపడలేదు. ఈ మిషమాత్రమున కోడెలగుంపు సర్దారు విటుఁడునగు సింగనతోడ నది పాటిపోఁదలఁచెను. కాని యిద్దరును న్యాయభటులచే పట్టువడిరి. కోడెలరెడ్డి పశ్చాత్తాపపడి విశారదగురువున్నొద్ద శుచిమతోపదేశము నొందుటకై బయలుదేరెను. శుచిమతమున విశారదుఁడు సంఘసేవామాత్రమును ప్రజలకు వివరించును. కుసుంభిణీ ఫిరంగిణులు మాయావినులై విశారదగురువు సన్నిధి శుచిమత ప్రచారార్థము సన్యసించెదమని శపథముచేసి, శిశు ప్రసూతిపోషణ విషయములు లోకమున బోధింప నియోగింపఁబడుదురు. శుచిమత ప్రచారమువలన నేమి, కట్టడములయందేమి, ఆచారములందేమి, పావనజల సౌకర్యములందేమి, కలిగిన మార్పులచే కల్యాణపురికెల్లవైపుల నూరుమైళ్ళ పర్యంతము ఎలుక, యీఁగ, దోమలకు, గృహములందు ఉనికికి వసతిలేమిచే మహామారి మశూచి విషూచీ మన్నెజ్వర సన్నిపాతాదులు వలసలు వోవుచు ఒక వనమందు "వసవని" గాంచి తమకుఁ గలిగిన దుస్థితులకుఁ దమ ప్రాణాధార పరికరవినాశమే కారణమనియు శుచిమతముచే మానవులేమే పద్ధతులు సాధించినదియు మొఱవెట్టి జనసంఘమందేమాత్రము కలవరము పుట్టింపక గృహజంతువుల ఆశ్రయమును కోరక మానవజాతికి వ్యాధులచేమరణములు ఘటించుశక్తి కుసుంభిణికిని ఫిరంగిణికిని నిజము దక్క మాకులేవని, శుచిమతమును భేదింప మీరు యుక్తులను యోజించి కార్యసాధన మొనర్పవలయు ననియుఁ జెప్పి దీనాలాపములతో వలసలువోవుదురు. వసవఁడు కుసుంభిణీ ఫిరంగిణులతో ఈవార్త దెలిపి కర్తవ్యమునకు అనుజ్ఞాతుఁడయి ధన్వంతర్యాత్రేయులొద్ద బంటుగా కుదిరెను.

ధన్వంతర్యాత్రేయులయొద్ద వసవఁడు అత్యంత విశ్వాసపాత్రుఁడుగా నుండెను. ఒకనాఁడు శస్త్రచికిత్సాశాలలో మోసముగా కోఁతబల్లక్రింద ఒకగడ్డముగా వసవఁడు ఇటుకఱాతిపెళ్లనుంచును. ధన్వంతరిదేవుఁడు రాచపుంటిశస్త్రముచేయునపుడు ఏదోమిషతో శస్త్రగృహమునుండిబయలువెడలిపోయి శస్త్రచికిత్సాశాలయందు మహోత్పాత శబ్దమొకటి బుట్టింప ఆ ప్రమోతమబల్ల అదరుపుచే ధన్వంతరి చేనేత తనప్రేలినే కత్తితో కాటొనరించుకొనఁగా వసవనియొక్క విషక్రిములు అందుఁజొచ్చి అతనికి విషపుజబ్బు గల్పించును. ధన్వంతరి బాధపడుచుండును. ఈసంగతి విషజీవ శోధనశాల మందిరమందు తులసీక్షారముచేత గాజుగొట్టమందలి మహామారి క్రిములను పరిశీలించు నాత్రేయులకగ్గతికి వసవఁడు పరుగునపోయి ధన్వంతరి ప్రాణసంశయావస్థ దెలుపును. ఆత్రేయుఁడు, ధన్వంతరికి చికిత్సచేయుటకై సూదిమందులు వెదకు తొట్రుపాటున, గాజుగొట్టములోని మహామారిక్రిములను తనముంజేతికి వేసికొనియుండిన స్ఫోటకనివారకక్షతములలో నేమఱుపాటున తోనికించుకొనును. బొబ్బలవ్యాధిచే ఆత్రేయుఁడు పీడితుఁడగును. విశారదుఁడు, శుచిమతమందు కుసుంభిణీ ఫిరంగిణుల కపటశుశ్రూషలచే బేలుపోయి, కుసుమవ్యాధి, ఫిరంగివ్యాధి పొందును. వెంటనే కుసుంభిణీ ఫిరంగిణులు శుచిమతము విడిచి అదృశ్యులగుదురు. విశారదుఁడు రోగదుర్వృత్తికిని వేదనకును పై హెచ్చు అపకీర్తికిని జడిసి, ఆత్మహత్య గావించుకొనునంతటి విషాదమున మునుఁగును. అట్టి సమయమున వసవఁడతనికడ ప్రవేశించి ఆత్రేయ

ధన్వంతరుల చరమస్థితులు తెలియఁజేయును. అదివఱకే విషణ్ణహృదయుఁడై శాంతిలేకయుండిన విశారదుఁడు ఈ పిడుగువంటి వార్తవినియున్మత్తుఁడగును. చికిత్సార్థము ధన్వంతరి ఆత్రేయులను ఒకవిశ్రాంతిరథముపై అమరావతికిఁ గొనిపోయిరని యెఱిఁగి విశారదుని శిష్యుఁడొకఁడు విశారదునిగూడ నచటికే కొనిపోవును. శుచి మఱొప్రాంతమున శుచి కొల్వుచేసికొనుచు పల్లెటూరు ప్రజలు ప్రవేశింతురు. ధన్వంతర్యాత్రేయ విశారదులకు వాటిల్లిన ఆపదలఁగూర్చి ఆప్రజలు దుఃఖించుచు వారి ఆరోగ్యసిద్ధికిగాను శుచిదేవిని స్తోత్రము చేయుచు వారిని జూచుటకై అమరావతికే వారును తరలుదురు.

అమరావతికి ఆశ్వినేయుఁడను భిషఙ్మణి ప్రభువు. ధన్వంతరి ఆత్రేయులవలెనే శ్రీశుచిపరాశక్తి ఆవైద్యశిఖామణికిని ఇష్టదేవత. ఆయమ ప్రసాదమున ఆయనకు శుచి సుధలు అను నిరువురు పుత్త్రికలు పుట్టిరి. వారికి రూపరేఖాలావణ్యములవలెనే సౌశీల్యమును ధాత్రేయీ కళాకౌశలమును పెట్టని భూషణములై తనరారుచుండును. ధన్వంతరికి శుచియు, ఆత్రేయునకు సుధయు పథ్యపానాది సపర్యలుసలుపుచు ఒకమాసములో వారిని రోగవిముక్తులఁజేయుదురు. అమరావతి ఉన్మాదవైద్యశాలలోనుండు విశారదునకు ఫిరంగి కుసుంభ వ్యాధులు నెమ్మదించినను ఉన్మాదము మాత్రము కుదురలేదు. ధన్వంతర్యాత్రేయుల పునరారోగ్యప్రాప్తికి భంగము కలుగునను తలంపుతో విశారదుని యున్మాదావస్థను ఆత్రేయ ధన్వంతరుల కెంతమాత్రము తెలియఁగూడదని ఆశ్వినేయుఁడు శుచి సుధలతో పరిచారులతో కట్టుదిట్టము చేసియుంచి యుండును. కుసుంభుఁడు పన్నిన మోసపు వ్యూహములన్నియు శుచి సుధలవలన వ్యర్థములు కాఁబడి ఆత్రేయధన్వంతరులు పునరుజ్జీవింపఁబడుటకు చింతిల్లుచు కుసుంభిణీ ఫిరంగిణులు శుచిసుధలను చంపి కసిదీర్చుకొనదలంతురు. ఆత్రేయధన్వంతరులకు ఆరోగ్యస్నానమగును. అంత నొకనాఁటి సాయంతనమందు శుచి సుధలు జనకునాజ్ఞఁబడసి ఆవిశ్రాంతగృహ మగు వైద్యాలయమునకు వెనుకనుండు ప్రమదవనమున విహరింపఁబోయి అందొక కోనేటియొడ్డునఁ గూర్చుండి మంతనము లాడుచుందురు. ధన్వంతర్యాత్రేయులును ఆవనమునకె విహరింపఁబోవుదురు. శుచి సుధలు వారిరాకను జూచి యెదుర్కొని వచ్చి తోడ్కొనిపోయి అందలి చంద్రకాంతశిలావేదికలపయిఁ గూర్చుండుఁడని వేడిరి. వారటు లొనర్తురు. సుధయు ఆత్రేయుఁడు ప్రసంగించుచు ప్రకృతివర్ణనసలుపుచు బృందావనమున విహరింతురు. శుచి ధన్వంతరులు ఆవర్ణనాతీతమగు పూర్ణిమాసాయంకాలమునఁ బ్రకాశించుపుష్పములనువర్ణించుచు సరససల్లాపము లాడుచుందురు. కుసుంభిణీ ఫిరంగిణులు అందొకచోట పొంచికొనియుండి శుచిధన్వంతరుల యొక్కయు సుధాత్రేయులయొక్కయు ప్రణయసంభాషణలు విందురు. కుసుంభిణీ ఫిరంగిణులు మాయచేసి కనపాలికను లంచమిచ్చి విశారదు నున్మాదవిషయమై ధన్వంతర్యాత్రేయులకు తెలుపఁగూడదని ఆశ్వినేయులు చేసియుంచిన కట్టుదిట్టములు తెలిసికొనియుందురు. మఱియు నొకయుక్తిఁ బన్ని విశారదు నున్మాదవిషయము నెఱిఁగించి ధన్వంతర్యాత్రేయులను ఉద్యానవనము వెలుపలికి పంపివేసి శుచిసుధల నొంటరిపాటున చంపనెంచి కుసుంభిణీ ఫిరంగిణులు ప్రమదవన ముఖద్వారమునకుఁ బోయి యుపద్రవముగా ఆర్తధ్వానము చేయుదురు. అది విని ధన్వంతర్యాత్రేయులు శుచిసుధలను ప్రమదవనమున సరోవరతీరమున నుండుఁడని నుడివి ఆయార్తనాదము చోటికి వెళ్లుదురు. అచట కుసుంభిణీ ఫిరంగిణులు విశారద గురువర్యా! విశారద గురువర్యా! అని రోదనము సేయుచుందురు. ధన్వంతర్యాత్రేయులు ఇదేమని యడుగఁగా మావిశారద గురువులవారికి ఆశ్వినేయులు ఎంతచికిత్స జేసినను

వారికిసంభవించిన ఉన్మాదము కుదురలేదు అని చెప్పుదురు. ఆశ్చర్యపడి ధన్వంతర్యాత్రేయులు విశారదుని సంగతి కనుఁగొన నున్మాదవైద్యశాలకుఁ దరలుదురు. ఈ సమాచారము శుచి సుధలకు తెలుపుఁడనియు, తా మిప్పుడె వత్తుమనియు అంతవఱకు సరోవరప్రాంతముననె వారుండ వలసిన దనియు ఉదంతంబు కుసుంభిణీ ఫిరంగిణులచే వారికి పంపుదురు. కుట్రనెఱవేఱినందులకు సంతసించుచు వనమాలిక నే వటిచి శుచిసుధలను కోనేటిలోనికి ద్రోసి కుసుంభిణీ ఫిరంగిణులు పలాయితులగుదురు. ఉన్మాద వైద్యశాలా ప్రాంగణమునకుఁ జనుటకు ముందే శుచిసుధల దీనకంఠస్వరములు స్పష్టముగ వినవచ్చినందునను వనపాలిక రొప్పుచవచ్చి ఆశ్వినేయుని కఠిన శాసనముదీనాలాపముల నగ్గడించుచు మొఱపెట్టు కొన్నందునను ధన్వంతర్యాత్రేయులు వడిగొని మరలి పుష్కరిణియొద్దకువచ్చి జలములందుమికి శుచిసుధల వెల్వడించి శ్వాసపునరుద్ధరణమొనరించి వారిని బ్రదికింతురు. కుసుంభిణీఫిరంగిణుల బాకులు చేజారిక్రిందఁ బడినవి వనపాలికకు దొరకెను.

విశారదశిష్యుఁడు ప్రభావుఁడు తనగురుజనుల మహావిపత్తులు విని అమరావతికివచ్చును. విశారదునకు జ్ఞానయుక్తమైన యున్మాదమని ఆశ్వినేయులు గుర్తెఱిఁగి, శ్రీశుచి భగవతి ఆలయ నిర్మాణమునఁగాని తదున్మాద విమోచనము గాదని తలంతురు. భక్త్యావేశమున నగు విశారద సర్వచేష్టితములను, వచించుసకల వాక్యములను, పూర్ణముగా రేయుంబవల్లు శిష్యులతోను ప్రభావునితోను వంతులప్రకారము ఒకయిరువదిదినములు వ్రాయింతురు. ప్రభావుఁడు ఆవ్రాఁతలను రెండు సంపుటములుగా నొనర్చి, ఆశ్వినేయునకప్పగించును. ఈ వ్రాఁతలె అగమ్యబంధనలుగాఁ గొని ఆశ్వుఁడు ఆలయ మందు చిత్తరువులను మలిపించిఆలయసమాప్తిచేయును. శుచి సుధలకు విపత్తు సంభవించిన మఱునాటి దినము ఆత్రేయ ధన్వంతరులు ఆశ్వినేయు నాజ్ఞబొంది ఉన్మాద వైద్యశాలకుఁబోయి అచటి మధూన్మత్తులను పిచ్చి బాలెంతలను గని త్రావుడుచేఁ గల్గు విపత్తులకును, శిక్షపొందని మంత్రసానులు బాలెంతల కొనర్చు దుండగములనుగూర్చి దుఃఖిల్లుదురు. తన ప్రియశిష్యుఁడగు విశారదునిభక్తి నిశ్చలత్వమునకును, ఉన్మాద తీవ్రతకును సంభ్రమ కారుణ్యంబుల పాలయ్యు, ఆశ్వినేయుల అప్రతీప ప్రభావంబున అతఁడు మేలొందఁ గలఁడని యుపశమిల్లుదురు. పిదప ఆశ్వినేయుఁడు శుచిసుధాధన్వంతర్యాత్రేయ ప్రభావ వనపాలికలను విచారించినపుడు వసక కుసుంభిణీ ఫిరంగిణుల ద్రోహచింతనములు స్పష్టమగును. మహామర్యాదల ముట్టుబెట్టి ద్రోహులఁ బట్టి కట్టితెచ్చుటకు కల్యాణప్రియుఁడు ప్రథమచికిత్స ధన్వంతరియొద్ద నభ్యసించు బాలభటవర్గము వారికినాయకుఁడుగా ప్రభావుఁడును వారిపోషణమునకు శుచి సుధలతో దండయాత్రకు వెడలుదురు. విషూచ్యాదులతో మార్కొనుచో సర్వరోగ ప్రతీకారచర్మవస్త్రి చికిత్సలుచేసికొనుట కర్తవ్యమని ప్రభావునివలన నెఱిఁగి బాలభటులు అట్లొనర్చికొని సమరరంగము ప్రవేశింతురు.

మృత్యుదేవత సభలో ప్రగల్భములు పలికిన సన్నిపాతాదులు బాలభటులధాటకు తట్టుకొనఁజాలరు. దాఁటరానినది వఱద పాఱుచుండెను. ఆనదియొడ్డున సత్తుకార్మికశాల యొకటియుండెను. దానిపరిసరమే యుద్ధరంగము. మృత్యువొసఁగినప్రాణాధార పరికరములు తెమల్పఁబడుటచే మహామారి విషూచి మన్నెజ్వరము తుపానుజ్వరము సన్నిపాతము సమసిపోవును. మశూచి పలాయితమగును. వనపుఁడు బాలభటుల శిబిరముక్రింద మందువెదజల్లి జానకి త్రాళ్ల వత్తులుంచియుండెను. ఫిరంగిణీ కుసుంభిణులకు

నదియొద్దకు పరువిడుఁడని చెప్పెను వాఁడు చిక్కినట్లు దక్కినట్లు పరుగిడును. బాలభటులు ప్రభావుఁడు వానిని బొదివిరి. వాఁడు శిబిరమునకు మందుపత్తినంటించి సత్తుకార్మిక శాల పైకప్పుమీఁదికి ఎగబ్రాకును. వాఁడు నిండునదిలోనికి దుమికి యీఁది పడవలపై వసుంభిణీ ఫిరంగిణులను అసలియొద్దకు చేర్చెదనని చెప్పి యుండెను. కార్మిక శాలనుండి దుముకఁ నుంకింపఁగా అందలి గూఢ వాయురంధ్రములలో వసువుని పాదములు చిక్కుకొని బంధింపఁబడును. బాలభటశిబిరమునుండి మంటలు సోకుటచే కార్మిక శాలకు చిచ్చంటుకొనును. వసువుఁడు సత్తుచిచ్చులో దగ్ధుఁడగును. ( వంగభస్మము చీము క్రిములకు విఱుగు. ) బాలభటులు అగ్ని నిరోధక వాయువులను ప్రసరింపఁజేసి మంటజ్వాలలనుండి తప్పించుకొందురు. శుచిసుధలు వసుంభిణీ ఫిరంగిణులకుగల సమ్మోహన కంచుకములను ఒలుతురు. అందఱు జయలాంఛనములగు మృత్యుసైన్యముయొక్క కిరీట పతాకాదులను పరిగ్రహించి అమరావతికి వెళ్లుదురు. మృత్యువు, శుచివతోపాసకులకు అకాలమరణ భయములేదని వరమొసఁగును.

శ్రీ శుచిదేవాలయమున జయశీల లాంఛనములగు ఈఁగ దోమ! యెలుక పేలహారములతో శుచి సుధా ధన్వంతర్యాత్రేయ విశారద ప్రభావబాలభటులు ప్రవేశింతురు. ఆశ్వినేయుఁడు శ్రీశుచ్యాలయమందు భగవతి సాన్నిధ్యమున తన మంత్రోదకము విశారదునిపై ప్రోక్షింప నతనికి ఉన్మాదవిమోచనము ప్రాప్తించును. శుచి ధన్వంతరులకు సుధాత్రేయులకు పాణిగ్రహణములు జరుగును. (శుచిత్వమునకును శస్త్రచికిత్సకు అమృతమునకును కాయచికిత్సకు పొందిక.) శ్రీశుచి పరాశక్తి సాక్షాత్కరించి, అభినందించి, వ్యాధిగ్రస్తులకుఁ చేయఁబడు సపర్యాదులకును తనకై చేయఁబడు అర్చనాది కైంకర్యములకును భేదములేదనియు, ఈరెండును తనకే చెందుననియు, రెండును సమానఫలప్రదములనియు, తనకై నిర్మింపఁబడిన సప్తప్రాకారపరివేష్టితమైన దేవాలయమును వైద్యాలయము గావించి రోగుల సమార్చనమునకు నుపయోగింపవలయుననియు, ప్రాకారములందలి భవనములను స్వాస్థ్యశిక్షాపరిశోధనమునకై వినియోగింపవలయుననియు తెలిపి అంతర్ధానమగును.

మంగళము.

---

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 20 | శ్రెయ | శ్రేయ |
| 3 | 12 | భాననా | భావనా |
| 8 | 13 | పసువు | పసవు |
| 9 | 18 | లఘించు | లంఘించు |
| 11 | 4 | ధన్వంతిరి | ధన్వంతరి |
| 12 | 8 | గజ్జబిళ్ల | గజ్జబిళ్ల |
| 13 | 14 | ప్రభువునితో | ప్రభావునితో |
| 13 | 16 | అర్తనాదము | ఆర్తనాదము |
| 15 | 8 | నారు | నాలు |
| 16 | 1 | సార్ధకా | సార్థకా |
| 16 | 6 | రోగసంఖ్య | రోగులసంఖ్య |
| 16 | 8 | తెలపిలేను | తెలపితేను |
| 16 | 18 | కోకిల | కోయిల |
| 16 | 31 | దేశయాత్రి | దేశయాత్రా |
| 17 | 10 | జోత్స్న | జ్యోత్స్న |
| 17 | 28 | ప్రణము | ప్రణవము |
| 18 | 9 | లక్షమ్మ | లక్ష్మమ్మ |
| 18 | 14 | శుద్ధంబా | శుద్ధంబా |
| 18 | 25 | బాధితు | బాధితు |
| 19 | 1 | వర్ధిల్లు | వర్ధిల్లు |
| 21 | 14 | భూయిష్ట | భూయిష్ఠ |
| 22 | 12 | ముగ్ధరగు | ముగ్ధరగు |
| 22 | 13 | కసర్ధ | కసగ్ధ |
| 22 | 19 | కనర్ధకములు | కనర్ధకముల |
| 22 | 27 | చిన్నా | బిన్నా |
| 24 | 7 | ఊరూపు | ఊరూరి |
| 24 | 28 | ధళ్ళని | తళ్ళని |
| 30 | 26 | సుగణా | సగుణా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 34 | 10 | నున్నవి | నున్నని |
| 37 | 1 | జేసితిరా? | జేసిరా? |
| 38 | 4 | వృద్ధిబొంద | వృద్ధిఁబొందు |
| 38 | 6 | ప్రజల | ప్రజలు |
| 41 | 27 | ప్రావముఅను | ప్రావకముల |
| 43 | 18 | ఆదరి | ఆదరి |
| 44 | 29 | జోత్స్న | జ్యోత్స్న |
| 46 | 4 | బిల్చి | పిల్చి |
| 46 | 14 | ఐలసినని | ఐలసినది |
| 50 | 26 | దుర్గితము | దుర్దినము |
| 50 | 27 | తోసఁకించు | తోసఁకించు. |
| 51 | 14 | పెసఁగనో | మెసఁగనో |
| 52 | 12 | ముగ్గురుమూఁడు | నల్గురునాల్గు |
| 53 | 1 | అట్లయిన | అట్లయిన |
| 54 | 2 | రుజానిధాన | [illegible] |
| 55 | 13 | ప్రావవ్యపుట | ప్రావకపుట |
| 55 | 23 | యుఖితరీతి | యుచితనీతి |
| 57 | 7 | ఈవలకి | ఈవలికి |
| 57 | 7 | మెఱుఁగనఁ | పెఱుఁగునఁ |
| 58 | 27 | గురువుగారి | గురువుగారికి |
| 60 | 3 | మునలివాఁడు | ముసలివాఁడు |
| 60 | 24 | ఊరడిల్లు | ఊఱడిల్లు |
| 63 | 11 | నిద్రవోర | నిద్రావోర |
| 65 | 27 | ఆగమనియు | ఆగమమనియు |
| 66 | 23 | జాణతము | జాణతనము |
| 66 | 24 | సెబ్బర | సెబ్బర |
| 67 | 2 | ముందుపోవు | ముందుమపోవు |
| 67 | 12 | వేరై | వేఱై |
| 68 | 6 | వచుః | వచ్చు |
| 69 | 25 | సాయంసమొందు | సాయంసమయమందు |
| 70 | 13 | ధనస్సు | ధనుస్సు |
| 70 | 24 | దాది; ప్రాణు | దాది ప్రాణు |
| 71 | 11 | శాలలలో | శాలలో |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 71 | 20 | ఎంపరిపూర్ణము | ఎంతపరిపూర్ణము |
| 72 | 1 | భగవతి | భగవతీ |
| 75 | 18 | విషయము | నిమిషము |
| 76 | 5 | సుధన | సుధల |
| 76 | 12 | నదుము | నడిమి |
| 76 | 15 | బోనుపు | జోడిపి |
| 76 | 17 | జేయునపుడు | జేసినపుడు |
| 76 | 19 | వదలు | వదలి |
| 76 | 21 | సలుపు | సల్పి |
| 77 | 8 | శుధల | సుధల |
| 78 | 10 | దను | దము |
| 78 | 26 | వెత్తురు | వెల్తురు |
| 79 | 6 | చూ తాగ | చూస్త్రతాగ |
| 79 | 28 | పదా | పనా |
| 79 | 29 | మూసికొను | మూసికో |
| 80 | 11 | బంపము | బహుం |
| 82 | 1 | టిచక్ర | టీచక్ర |
| 82 | 18 | లందు | నందు |
| 82 | 27 | ॥ అత్రే | ధన్వం ॥ అత్రే |
| 84 | 8 | ఫీరంగియని | ఫిరంగిణియని |
| 85 | 8 | అయ్యాలారా | అయ్యలారా |
| 85 | 27 | యుత్తమును | యుత్తమమును |
| 86 | 8 | సస్యప్రోషి | సస్యత్రాత |
| 88 | 32 | వ్యాఖులు | వ్యాధులు |
| 89 | 17 | ధన్వంతరా | ధన్వంతర్యా |
| 91 | 10 | ప్రప్రత్తి | ప్రపత్తి |



══ రావుసాహేబు ══

మన్నెము శేషాద్రి రెడ్డి.



# శుచి

## నాంది



ఉ॥ ఎయ్యది వాణికిన్ సిరికి • నిమ్మనుగూరిచి నమ్మఁ బుచ్చెడిన్
ఎయ్యది మృత్యువున్ గలఁచు • నీతుల నాటకసూత్రధారతన్
ఎయ్యది స్వాస్థ్యబీజమయి • యేఁపున వ్యాధుల నుక్కడంచెడిన్
అయ్యది శ్రీశుచీశ్వరి ష • డక్షరమంత్రము మిమ్ముఁ బ్రోచుతన్ ॥

సీ॥ శారద మేఘంపుఁ • జలువ తెరల, నరు
దెంచు క్రొమ్మించు నాఁ • తేజ మొప్ప
లేయూద చాయతో • లీనమౌ ముఖబింబ
మారోగ్య కౌముది • నవని నింప
నీలంపు ముంగురుల్ • నేత్రంబు లాడంగ
జిగిరవల తురాయి సొగసు గుల్క
సత్త్వపూరితములున్ • శాంతికీలితములౌ
వీక్షలు భువనైక • రక్షగాఁగ
గీ॥ నలరి, యభయ హస్తంబెత్తి • "యూర్తినుడుఁగు
లక్ష్మి! యడలకు మో వాణి! లయ భయంబు
లేదు! లేదు! మీక"ని ధైర్యమూఁదు నాది
శక్తి, శ్రీశుచి సభ్యుల సాకుఁగాత! ॥

గేయము॥ ఆరోగ్యవరదాత్రీ! సభ బ్రోవుము దేవీ
ఇంద్రనీలలోహితాస్య ప్రభన్ రాగదే
అమృతార్ద్రవీక్షణీ! శ్రీ సరస్వతీ తప
శ్శీలఫలమ శ్రీశుచీ! సర్వశ్రేయస్కారిణీ!

## శుద్ధవిష్కంభము.

### వైకుంఠము.

లక్ష్మి—(ఆత్మగతము) వాణిని దోడ్కొని రాఁబోయిన చెలికత్తె యింకను రాలేదు. కారణమేమై యుండనోఁపు? సరస్వతి మూఁడుదినములనుండి యుపవసించుచున్నదని కర్ణాకర్ణిగ వినియుంటిని. ఆమె సహజారోగ్యము సడలి, యిచటికి రాఁజాలనంతటి దుర్బలగా నుండునాయేమి! అటులైన నాకోడలి కుశలమరయ నేనే చనవలదా! చనుటెట్టు? నాకాయాసము మెండైనది. కీళ్ళు గదల్పఁజాలకున్నాను. స్థౌల్యమినునడించిన భారముగలిగినట్లు ప్రత్యవయవముఁ జూపట్టుచున్నది. అయినను బరస్పర దేహక్లేశంబుల మూలంబున నేని నెడతెంపులేని పోరుగలిగి యుండినమాప మరల కూర్మి గలుగఁగలదుగదా! యను నూఁటమాత్ర మిప్పుడించుక తృప్తిఁ గలిగించుచున్నది. అదిగో! సనేవమరాలై విన్నవగుమోముతోఁ దలవాంచి సరస్వతి యిచ్చటికి వచ్చుచున్నది.

సరస్వతి—జగజ్జనని పాదారవిందములకుఁ గోడలు సరస్వతిని నమస్కరించుచున్నదానను.

లక్ష్మి—కల్యాణమస్తు! వాణీ! వచ్చితివా! నాతనయునకుఁ గుశలమా? నీసహజారోగ్యమునకు భంగముగలిగినదని విని నేనటకు రాఁజాలక నిన్నుఁజూడఁ బిలిపించితిని.

సర—(క్రిందుఁ జూచుచు వటవటలాడుచు ఎత్తిపొడుపుగా) తల్లీ! యిందిరా! తమకటాక్షము నేఁడు గలిగె. ఇఁకఁ గొదవలేదు.

లక్ష్మి—(తెల్లవోయి) జాలితో

అయ్యో! యిదియేమి యీ వైఖరి! తనయా!

సీ॥ తేజస్సముత్కర • దీధితుల్ వెదజల్లుఁ
 గళలూరు మోమేల కందువాఱె
తేఱి చూడఁగరాని • తెలివి మెఱుఁగు గుబ్బ
 వెడఁదలౌ కనులేల • వెడఁగులయ్యె
పూసిన యపరంజి • పొంకంబు జిగిజిల్కు
 మేవి నెమ్మేనేల • డీలు వడియె
శింజినీపటిమతో • మంజులధ్వనులీను
 మృదువైన పలుకేల • మెత్తగిల్లె
ఆ॥ నాదు కూర్మిచిలుక! నాముద్దు కోడలా!
 యలిగి యుపవసించి • హారముఁ బూన
 నీదు దయితుఁ డెట్లు • నెమ్మది విధిఁదీర్చు
 స్రష్టయూరకున్న • సృష్టియెట్లు? ॥

అమ్మా—యిఁక సృష్టి పూజ్యమైనఁ గ్రమముగాఁ బ్రళయము రాదా?

# నాంది.

సరస్వతి— (కోపముతో) ప్రళయము రాని! సర్వము దగ్ధము గాని! నాయాత్మజులు, ప్రచండమేధాసంపన్నులు, పస్తులుపడి, మాఁడి, జీవచ్ఛవములై లక్ష్మీపుత్రుల పంచలఁ గసటులఁ దినుచుండ వారి యుసురు నాకుఁ దగులకున్నె? అందుచే నేఁగతికి లోనై, నేఁటికిఁ గవిచే నిట్లు వర్ణింపఁబడితి.

చం॥ కనమును లేని భావరుచి • కావ్యవిపాక కవీంద్రపాళి, శో
ధన కృషిసేవచే భువికి • ధన్యతఁ గూర్చెడు వస్తుశోధకుల్
దన పొరపాట్లు దిద్దుకొన • ధాత్రికె నాఁగెము సెప్పు శిల్పులున్
వనటల గ్రుమ్మఁబోరె ధన • వంతుల పంచలకడ్డుఁగూటికై॥

లక్ష్మి— (ఆత్మగతము) ఇప్పటికిఁ బెద్దలయందు భయభక్తులు లేక పోతరించి మీఁదు మిక్కిలి రొప్పి పొడుచుచున్నది. అయిననేమి! పసిది. పస్తులమాఁడియున్నది. కారణము లేని కోపము వహింపలేదు. దీనిఁజూచి జాలిగల్గెడిని. ఈమె నీ ప్రసంగమునుండి మరలించెదఁగాక. (ప్రకాశము) అమ్మా! నాకుఁ గల్గిన మహాయాసము, దగుర్పు, కీళ్ళబాధ అధికమాంద్యముగూడఁ బ్రళయసూచకములుగనే యున్నవి. భావనాశక్తుల మగు మన కీవిపత్తులు సంభవించుట మనసాక్షాత్కారము గాంచిన భక్తుల కిట్టి రుగ్ణతలుండవోఁపు నని తోఁచుచున్నది.

సర— మాతా! కమలా! బాధతోనుండు మిమ్ము విచారించి యుపచారములు సేయక మిన్నకుంటయే గాక మీఁదుమిక్కిలి మీమనసునకు నాయాసము గల్గించినందులకుఁ గోడలి తప్పు క్షమింపుఁడు.

(అని పాదము లొత్తును.)

అమ్మా! మన యీప్రకృతపరిస్థితులకు హితమైన ప్రతిక్రియ యేమైనఁ గలదా? లేక ప్రళయమే సిద్ధమా!

లక్ష్మి— నాకీబాధలు మెండైనవి. బుద్ధిపలుచఁబడినది. నీవు సూక్ష్మబుద్ధివి. తగునుపాయము నీవే యోజింపవలయును.

సర— నిద్రాహారములు లేక వాసిచెడి క్రోధానలమున మాఁడిన నాకు నింక నాలోచనశక్తియుఁ గలదా! అయినను నిట్టి తరుణములందు భక్తియే శరణ్యము.

లక్ష్మి— మంచిమాట, మనకుఁ గర్తవ్యము నియోగింప సమర్థయగు నా పరాశక్తి శ్రీశుచి భగవతినే భజించెదము గాక.

లక్ష్మి— మత్తకోకిల.

తల్లి రాగదె యాది శక్తిరో • ధర్మరక్షకు మాతనూ
వల్లరుల్ బలురోగ ఘాత్రల • వాసిపీడెడి నోదయా
వల్లి బ్రోవు లయంపుఁ జిన్నెలు • వచ్చె మాజవసత్త్వముల్
ఒల్లవే మము! వృద్ధలైతిమె! • యో మహాశుచిశక్తిరో॥

సర— ఆ॥ కాంచి, మంచి, పంతు • కనుసైగలన్ మముఁ
బోంట్ల శతశతంబు • పూర్ణసత్త్వ

శుచి.

చిత్రలీల తల్లి ! శ్రీయాదిశక్తి! యో
శుచి భగవతి! రమ్మ! శుభము లిమ్మ॥

శ్రీశుచిదేవత సాక్షాత్కారము

శ్రీశుచి— గేయము.

శ్రీవాణులారా! వలదు వలదు భయ మింకన్
ప్రళయభయము వలదింకన్ విషణ్ణహృదయులై
విలయము శంకించెద నో ముద్దు తనయలారా! వలదు॥
దేహస్వస్థత నుపేక్షసేయుచు డీలువడిరి మీప్రజల్ శ్రీవాణులారా!
శీలరహితులై మలినంబులోన బ్రుంగి బ్రుంగి
ఛిద్రములను బిలిచినారు మీప్రజల్
వ్యాధుల భయమ్ము తప్పదుర్విన్ ఆయవలక్షణములు
మీకుం బ్రాంకెనైన నుంతలేదు భయము శ్రీవాణులారా॥

సీ॥ వ్యాధి లయము వచ్చె • వలదింకస్పర్ధలు
మైత్రియే దీనికి • మంచిమందు
అత్తా! నవనిధుల • నర్పింపు! కోడలా!
విజ్ఞాన శోధనల్ • వెంపవమ్మ
మా మతసృష్టికై • మీ మనోనాయకు
లవతరింతు రిలం గ • ల్యాణ పురిని
స్వాస్థ్యంబు నెలకొల్ప • వ్యాధుల సమయింప
ధాత్రీవ్రతంబునం • దరలుడమ్మ
గీ॥ ప్రజల క్షేమంబె సతము నా • ప్రణవజపము
మానవారోగ్యమే నాదు • మననమూర్తి
సంఘ కుశలమే నాకెడ్డు • స్మరణ ముద్ర
భ్రాతృసౌహార్దమే నాకు • భక్తియాత్ర॥

మఱువసుండు

అతిభోగములచేత లక్ష్మీపుత్త్రులకును, విధిలేని యతిజాగరణోపవాసములచేత సరస్వతీ తనయులకును సర్వదార్ఢ్యములు సన్నగిల్లినవి. ఇట్టి యవకాశము లాధారముసేసికొని మృత్యుదేవత ప్రళయకంకణము గట్టుకొనినది.

హెచ్చరిక.

(యవనిక పడును.)

# శాంతి

## ప్రథమాంకము.

హిమవత్పర్వత కందరము.

మృత్యుదేవత సభ.

(మహామారి, విషూచి, మన్నెజ్వరము, సన్నిపాతము, తుపానుజ్వరము, కుసుంభిణి, ఫిరంగిణి, పోలేరమ్మ, పసరుఁడు – నిజరూప చిత్రితము లైన దుస్తులతో పతాకాదులతో యథోచితలీల వైతాళికుని తోడఁ దదాస్థానమునఁ దమతమ నెలవుల సింహాసనమునకు నిరుప్రక్కల బారులు దీఱియుందురు. మూషికాదిహారములు బల్లపై నమర్పఁబడియుండును.)

వైతాళికుఁడు—చరాచర రూప సమస్త ప్రపంచ సంచాలన సమర్థానర్ఘ భీత్యాపహా! పరాక్

ఆత్మ ప్రభావ ప్రభూత భయ భావాపనోదార్థి సంజనిత త్రయస్త్రింశత్కోటి దేవతా సమూహా! పరాక్

ధర్మరక్షిణీ! పరాక్! లోకశిక్షిణీ! పరాక్! అల్లదే షడృతుసూచక ఛత్త్రంబుతోడఁ దన కన్నిట జనించిన యీ మారణరోగముల నాజ్ఞాపింప సభామంటపమునకు వచ్చుచున్నది మా చక్రవర్తిని. (ప్రక్కకొదిగి లోనికి నిష్క్రమించును.)

మృత్యువు—ప్రవేశము (స్వగతము)

శిక్షయే విజ్ఞానమునకుఁ దల్లి. ఈ మనుజుల కేదేని ప్రళయము సంభవింప కున్న కాలము వృథా చేసెదరు. సర్వమత సమ్మత నీతి విధు లడుగంట, దుష్ట సాంప్రదాయములతో నీజగత్తు మూల్గుచుండినపుడు, మత మిషచేత నేనొక జగత్ప్రళయ భండనాధిపత్యమునఁ బీనుఁగుపెంటఁజేసినఁ గాదె నిద్రమేల్కొని, నడుముగట్టి నీతి నుద్ధరింప భాష్యములపై భాష్యములు వ్రాసి వేదాంత శాస్త్రజ్ఞానములను సాధించిరి.

ప్రకృత మీ రోగములను జగముపై దాడివెడలించెద. పరతంత్రులై పురుషకారమును మాని, ప్రకృతిశాస్త్రములందుఁ గృషిసేయక యసౌఖ్యములన్నిటిని దైవమాయలని సోమరితనపుఁ బుట్టినిండ్లై, విషాదపుఁ దృప్తిఁగొను నీ మానవజాతికి రోగముల సత్యతత్త్వమెఱుఁగ నీప్రయోగ మహామోఘాస్త్రమై వెలయుఁగాక.

(సింహాసనమునఁ గూర్చుండును.)

(ప్రకాశము)

నాయకులారా! సనాతన శుచిపదవీచ్యుతంబై, వర్తమానంబున ననారోగ్య భూయిష్ఠంబై, పటిమ సడలి, నీడలం జూచి బెదరుచుండు నార్యావర్తంబునకుం జని, మీ మీ పరమాణు స్వరూపంబులతో తగు గృహావాసకములయిన క్షుద్రజంతువుల ప్రాపున, మానవజాతిని సోఁకి, మీ మీ నేర్పులను జూపి, ప్రజారిష్టము సలుప మిమ్ముఁ బుత్తెంచితి. మీ రీ ప్రాణాధార పరికరంబులను గొనుఁడు.

శివలింగ స్వరూపిణీ! మహామారీ! ఇల్లిదే మూషికహారము.

ఇయ్యది నీకుఁ బ్రాణాధారహారము.

(మహామారి సింహాసనము కడ మోకరింప సేవకుఁ డందిచ్చు మూషికహారమును మహామారి కంఠమున మృత్యు వేయును)

మహామారి—మహాప్రసాదము! (లేచి ముందునకువచ్చి)

సీ॥ గణపతి మారొక్కన • గజముఖదైత్యుండు
కడసారి యేరూపు • గాంచెనమ్మ
పొంచుండుపగతుల • వంచించినేర్పుతో
నీప్సితంబందెడు • నెద్దియమ్మ
అతి పుష్కలంబుగ • నచిరకాలంబున
బలగంబులే కుక్షిఁ • బ్రబలునమ్మ
కుడుముల నుండ్రాళ్ళ • గ్రుక్కంగ మ్రెక్కుకల్క
భూజనుల్ దేనిని • బ్రోతురమ్మ
ఆ॥ అట్టి యెలుక యూఁతఁ • బుట్టింతు బొబ్బల
జ్వరముఁ, జన్నినింతు • జంకుఁ బెంతు
వర్తకం బడంతు • వలసలఁ బురాల్గింతు
మట్టిసింతు నమ్మ! • మానవాళి॥

((స్వస్థానమునకుఁ జనుచు)

మృత్యు — గాలివుముండ్ల ముద్దులరాశీ! విషూచీ! ఇదే యీఁగలహారము. జలమే నీ ప్రాణములకుఁ దావలము. కావున నీ జలకలశము నొసఁగెద.

(మహామారివలెనే విషూచియు సన్మానింపఁ బడును.)

విషూచి—మహాప్రసాదము. (ముందునకువచ్చి)

సీ॥ దేహసత్త్వంబెల్ల • డించెద గంజిగా
నీడ్పులుగల్పించి • యేడ్పుఁ బెంతు
నాడిమీఁదికిలాగి • నాల్క బెండుగఁ జేసి
కనుల లోనికినీడ్తుఁ • గాంతి బీల్తు

# ప్రథమాంకము.

అతివిదాహముం గూర్చు • నారాటముం జేర్చుఁ
గాయంబు నెండింతుఁ • గట్టిగాఁగ
కడుపును బిగియింతు • నుడుకును జల్లార్చుఁ
దలఁగునంతకుఁ దెల్పి • దప్పినీక
ఆ॥ ఆలుబిడ్డలైన • నన్నదమ్ములైన
నాప్తబంధులైన • నమ్మయైన
రోగిపీడి వలన • లేగంగ వెలిపింతు
నీ దురీక్ష్యమహార్తిఁ • బాదుకొల్పి॥

మృత్యు—రావోయీ! ముద్దుటుంగరపు జెట్టి! మన్నెజ్వరపుఁబట్టి! నీవీదోషల హారమును గొనుము.
(పైవారివలె నీ మన్నెజ్వర మొనర్చును. మృత్యువు దోషల హారము నొసఁగును)

మన్నె—మహాప్రసాదము! (ముందుకువచ్చి) ఏయన జ్వరపుతో,
సీ॥ వడకింతుదంతముల్, పటపటలాడంగ
నోర్వఁగూడని చలి • నొక్కమాటు
తంపట తాపంబుఁ • దలనొప్పిగల్పించి
యూఁదుదుమంటల • నొక్కమాటు
పిండెదఁ జెమ్మటల్ • పీల్చిపిప్పిగఁ జేసి
సొక్కింతు జడివాంతి • నొక్కమాటు
పెంచెద జ్వరబిళ్ళఁ • గొంచెద నెత్తురు
లూఁదుపాండువుగూర్తు • నొక్కమాటు
గీ॥ చివురుఁజాయల బిగిఁజిమ్ముఁ • జేవదుల్చి
బూదిగాలు దేబెమొగము • బొల్లుకురులు
రోఁత ముడుతల ముసలిగ • రూపుమార్చి
నరుని ధృతిఁదూల్చి కాల • మందిరముఁ జేర్తు॥
(స్వస్థానమునకుఁ జనును.)

మృత్యు—ఓయీ! తుంగగడ్డల స్వరూపమున వెలుఁగు ముద్దులబిడ్డా! సన్నిపాతమా! జలమే నీ ప్రోదికిఁ గారణము. నీవీజలకలశముఁ గొనుము.
(స్వీకరించును.)

సన్ని—మహాప్రసాదము! (ముందుకు వచ్చి)
కం॥ చీల్తున్ శిరమున్ బాధన్
వ్రేల్తున్ దేహము జ్వరంపు • వేదుఱు జన్నిన్
బ్రేల్తున్ బ్రేవుల నరులన్
గూల్తున్ వారత్రయమునఁ • గుప్పలుగాఁగన్॥
(స్థానమునకుఁ జనును.)

మృత్యు—నాయనా! కాలసర్పాకృతీ! తుపాను జ్వరమహారాజా! నవీపేలహారముఁ గొనుము.

(స్వీకరించును)

తుపాను—మహాప్రసాదము! (ముందుకువచ్చి)

సీ॥ గొడ్డంటఁ ఛేదించి • యడ్డంబుగా వైచుఁ
గట్టెమోపులరీతిఁ • గండఁజీల్చి
పల్లంపుఁగాల్వలు • పాఱువేగంబున
నతిసారమునఁ జేవ • నంత పీల్చి
నెత్తునాడుల పిచ్చు • నిండారనెక్కించి
తీక్ష్ణమా పసరికఁ • దిమ్మద్రిప్పి
ఒకనాఁడుజన్నితో • నొకనాఁడు తెలిపితో
జ్వరపుఁ దుపానును • జలిచిచలిచి
గీ॥ తనువు రక్తమంతియు లాగి • దాని ప్రతిగ
పసుపునీటఁ జొన్పి నటులు • పాండుఁ జేసి
కూల్తు నంతియుజాతుల • గుంపుగుంపుఁ
బంటసేద్యంబు లెల్లడఁ • బాడువడఁగ॥

మృత్యు—సుఖవ్యాధులారా! నాజంట పెఱుములారా!

ఫిరంగిణీ కుసుంభిణులారా! మీరత్యంతగూఢప్రవర్తనలచే మానవజాతి ప్రవేశించి సంఘమునకుఁ దెలియరాని మర్మముల మోసపుచ్చెదు. మీరూపలావణ్యంబులఁ బ్రోదిసేయ నీసమ్మోహనకంచుకము లొసఁగితిని.

(అటులె స్వీకరింతురు.)

ఫిరం—మహాప్రసాదము! తక్కిన మాసోదరీ సోదరులకుఁ జేయూఁతఁగా నుండి మానవుల శరీరదార్ఢ్యంబులు గృశింపఁజేసి కామక్రోధంబులఁ బెంచి యకాల మరణంబులు గల్పింపనేర్తుము.

కుసుం—ఫిరం

గీ॥ కోడెప్రాయంపు యువకుల • కొమరుదులిపి
సంఘసేవానురక్తిని • జంపివైచి
కొంపలమ్మించి కాయంబు • గుల్లజేసి
మేము గిల్లివైతుము వారి, • మృత్యురాజ్ఞి!

పోలేరమ్మ—నాతల్లీ! నే నే సహాయము లేకయే సూక్ష్మదర్శనీ దుర్నిరీక్ష్య మహాసూక్ష్మ దేహంబున వాయువాహినినై సమస్తమానవలోకంబును నొంచుచున్నదాన.

సీ॥ తల్లడం బందింతుఁ • దలపోట్ల సలుపుల
వాంతులనెడమీఁక • వంగఁ గొట్టి
కలఁగింతు నిద్దురల్ • గలవరంబుల లేపి
నడుమునొప్పులఁ జొన్పి • నలిపివైతు

ఉబ్బింతువారాన ♦ బొబ్బము త్రెంబుల
సారింతు విషకీల ♦ జ్వరముఁగూర్చి
పుట్టింతుఁ గ్రుళ్ళించి ♦ పురుగుల నెల్లెడఁ
గనుమెచ్చునంగంబుఁ ♦ గానఁగొందు
గీ॥ క్రొమ్ముక్కుబడులను గడియింతు ♦ మదుపుఁ గొందు
గావు పొట్టేండ్ల నెత్తురుల్ ♦ ద్రావివైతు
సర్వమానవ సంఘాతి ♦ గర్వ మూర్చి
మచ్చగుణితుల ముద్రింతు ♦ మఱవకుండ॥

మృత్యు— నీశక్తి నాకుఁ జక్కఁగాఁ దెలియును. ప్రత్యేకప్రాణాధార పరీక్షము నీకనవసరము.
(ఆత్మగతము) దీని మిడిసిపాటునకు భంగపాటు దాఁపరించునేమో!
(ప్రకాశము) ఓయీ వసకా! నీవగ్నిందప్పఁ దక్కంగల భూతచతుష్టయంబున మాలిన్య లేశం బవకాశంబుగా విహరించు వాఁడవుగదా? నీ వెల్లకడల నప్రమత్తుండవై సమస్త రోగంబులకు హితమొనర్పుము.

వసకుఁడు— చిత్తము! (ఆత్మగతము) వీరు దంభము నఱపుటలో నొకరి నొకరు మించుచుండిరి. ఈప్రేలుట నాకిపుడేల! ఆరంభశూరత్వము కార్యశూరుల నీతిగాదుకదా!

మృత్యు— మీకెల్లరకు నాజ్ఞయొసఁగితి. నాయుద్యమము సఫల మొనరింతురుగాత. (నిష్క్రమించును.)

(అందఱు—సేనాదళమువలె నొకరివెనుక నొకరు అడుగువేయుచుఁ బాడుచుఁ గదలెదరు.)

గేయము॥ ప్రాణులశిక్షింప వెడలంగ నుప్పొంగు లఘించు హృదయము
వెడలుదము బదిమికిఫలము గందము
చింతగుంట నిప్పుడే చింతఁ బెంచి వంతముంచి
అంతకుఁ బొంతఁ జేర్తుము॥ ప్రాణు॥

(నిష్క్రమింతురు.)

(ప్రథమ ద్వితీయాంకముల మధ్య
ప్రవేశకము.

చింతగుంట గ్రామము విషూచీపీడితము. ఉదయమున

(గ్రామస్థులు)

వెంకయ్య, సుబ్బయ్య, నాగన్నలు, ప్రవేశము.

నాగన్న—మనవూరికొచ్చిన మంత్రిగాడు రాత్రి అగండంరొత్తుకొని, నల్లమేకపోతు పేగులు మెళ్ళో రేసుకొని నెత్తురుగూడు గిసిరేయి చల్లేతక్కి, వాని బెడకేకలువిని కేసిగాడు వీధిలోనికొచ్చే

తక్కి_వాణ్ని శస్త్రలు గొట్టినారోయి. ఏనిగంకమణిషి అమాంతము గా పుట్టెడొడ్లబండి బొక్కెన్నెల్లో నెట్టేవోడు తెల్లారేలేక వక్క_టేవాంతితో పీనిగైనాడు.

వెంకయ్యా—సానోళ్ళలులో, దినానికియిర్రవై మందంట. పీనిగెలను బళ్లతో తోలుకొని పోతావున్నారంట. అక్క_డనుంచిమూడురోజులనాడు బిండె సారపెట్టుకొని వొచ్చిన పిచ్చోడికోడలు తెచ్చిందిరా యీవూరికి దూమలా.

సుబ్బయ్యా—అల్లంకివాళ్లయింట్లో ఆయిదుమంది, పల్నాటివాళ్ళయింట్లో పదిమంది, యిప్పుడో అప్పుడో అంటూవున్నారంట. అందరికీ సిరబిగించి పొట్ట వుబ్బిందంట. ముసలోళ్ళని యిడిపించి రోగిష్టివాళ్లకు నీళ్లుగూడా పోశేవాంళ్ళు లేకుండ చిన్నోళ్ల పెద్దోళ్లు కాళ్లకు బుద్ధి చెప్పినారంట.

నాగ—వోరోరి! అంత పెద్దసంసారాలే వలసలుపోతే యెవరుంటారురా యీ పాడుగ్యామంలో?
(పిరికిదనముతో) యేమిటి అపాంచము!

వెంక—వొకటి, రెండు, మూడు, యెత్తుకొని పోతూవుండారు.

సుబ్బ—(భయముతో) అబ్బో! యీ వూళ్ళో నిలిచేది కష్టమే
ఆట్లా పోవాలంటే వాంతివచ్చేటట్టుంది (దైన్యముతో) పిల్లోళ్ళ నిండునెలల లేవలేని పెళ్లాన్ని కూడ చూడకుండా యెట్లా వూరిగమిడి దాటి పొయ్యేదయ్యా!

నాగ—సరే నీకంత భయముగావుంటె నేను వాళ్ళని పిలుచుకొని మామిడితోపుదగ్గిర కల్సుకుంటాములే. భయపడుతూ వూళ్ళోకిరావొద్దు.

(సుబ్బయ్య వీపుకట్టును)

సుబ్బ—వోరే యెంకయ్యా! నాతోగూడరా. మీవాండ్లనిగూడ నాగన్న తీసుకొనివస్తాడులె.

వెంక—(వెడగుచూపుతో)

నాకేమిటో కడుపులో గుటగుటమంటుందోయి. గుండెలు కొట్టుకొంటున్నాయి, తిన్నగా యీ వూరుదాటి పోదాము. ఈ గండంతప్పితే దిబ్బతోపులో కొంపలు కట్టుకుంటాము.

(నాగన్న ప్రభృతులు ప్రక్క_కొదిగి సంభాషించుచుందురు. రేపులపల్లెనుండి యిరువురు ప్రవేశింతురు.)

ప్రథముండు—వూరిగమిళ్ళో ముండ్లకంప లేందిరా. వూరికేమిపుట్టిమునిగిందిరా. వాళ్లెవరో మారానవచ్చేటట్టుంది అడుగుదాము.

ద్వితీయుండు—శనికాలమువచ్చిందిరా, యీ కొత్తపారుదలకాల్వలు, వాటికట్టలుక్రింద గుంటలుదొవ్వి సెట్లాఅయిందిమొగలు యీ వూరిలో యేమో తిమ్మిరినంజులు కొత్తగా బుట్టినాయోయి. వుబ్బర పాండురోగాలు బయలుదేరినాయి (నాగన్నప్రభృతులు కలిసికొందురు).

ప్రథ—సముద్ర వాగర్త పుళ్ళా చంద్రవరం మీనుమిల్లు యీ బాడులంతా చౌకబెట్టి పైరుపెట్టింది మొదలు వరసజ్వరాలెరావడం జనం సప్పు సప్పుగా చావడం యేనిగకాళ్లు, పోట్లు, సలుపులు, చీకాకు గావుంది.

ద్వితీ—శ్రీ ధన్వంతరి యిలాకా పదుచాయన పెబావుదువచ్చి, గుంటలంతా శోధనచేసి, దోమకాటువలన యీ చలిజ్వరాలనిన్నీ, దోమలు వృద్ధిపొందేదానికి సీల్లుకావాలె. అవి యీ దొరువులలో గుడ్లుపెడుతాయి, ఆగుడ్లలోనుంచి చిన్నపురుగులవంటి పిల్లలు పుట్టుతాయి, వారంరోజులలో వాటికి రెక్కలువచ్చి పరుగెత్తిపోతాయి, ఆదోమలలో అనాపిల్లిరకం ఆడయి సందరాత్రి సంచారం చేసేటప్పుడు వాటికాటుకు చిక్కినవాండ్లకు చలిజ్వరం వారం రోజులలో వస్తది అన్నాడు. వాటని చంపేదానికి పన్నాగాలు పన్నాలాని చెప్పిపోయినాడు.

ప్రథ—అదేమోయి (తన్ను జూపికొనుచు) యీ పుబ్బరపాండవరోగానికికూడా యీ గుంటలో చెంబటికివచ్చినవాళ్ళంతా కడుక్కోవడం, కాళ్లకు చెప్పలులేకుండానడవడం కారణమంట. ఆదేమో కొంకిపురుగులంట నులిపురుగులవంటివి. యివిచిన్నపేగుల్లోచేరి రక్తంపీల్చి పాండవరోగం తెస్తవంట. వాటిగుడ్లు, పూరిబైటికివచ్చి వాండ్లు కడుగుకొనేటప్పుడు గుంటల్లోపడి, వారం రోజులలో పిగిలి, అసిల్లనె మళ్లా కాళ్లు కడుగుకొనేవాండ్లకు, ఆబురదనేల తొక్కేవాళ్లకు, సోకి చర్మంలో ప్రవేశించి పేగుల్లో చేరుకొని, పూడునంజులు తెస్తాయంట.

ద్వితీ—ఇదొకయింత. అవునోయి నేను వున్నది సెప్తాను యినండి. ఈ నంజులు పెద్దోళ్ల కాలంలో లేవక్కో! బీటిపొలాలు, తోటలు, దరోబస్తు, డెల్టామాగాని అయింది మొదలు, పల్లెటూళ్లకు అంతావూటు గొట్టింది. యెక్కడబట్టినా యెప్పుడూ! యీమిరె. యిందుకు దోడు యీ అరగదంచిన మరబియ్యపువంటకం నాజూకు ముదిరినువ్వుల నూనెకి బదులు నెయ్యివాడుకోవటం, పండుఫలం తినక పోవటం, పూట పూట పేరబెట్టిన తీపుపెరుగుల భోజనాలు, యీతిమ్మిరిరోగానికి కారణాలని చెప్పినాడు.

ప్రథ—ఈ కాల్వకట్టలకింద పెట్టిన పశులమూలాన, పూటకాల్వల ప్రమేయంపెట్టుకోనందున, యింజనియరంగువాళ్లు, యీమిరిమూలాన ధాన్యలాభానికి జననష్టం వడ్డీగాచేసినారు.

ద్వితీ—నిన్నేమి! చెంబుబట్టుకొని పోవద్దన్నారంటయ్యా! చెప్పులుకూడా తొడుక్కోవద్దన్నారా! పూటకాలువల విషయం మాత్రం లబలబలు సాగించండి.

ప్రథ—ఒరే అదేంది అగుంపు! పిల్లోండ్లు పెద్దోళ్లు నడువలేక నడుస్తూండారు.

నూతన ప్రవేశము (ఒకగుంపు, భీతితో).

(నాగన్న ప్రభృతులు వారితోఁ గలిసి కొందురు.)

గేయము

అబ్బా – అబ్బా – భూమి యీనినట్లు యెలుకలదండు రావడం

యెలుకలు గిర్గిరా - తన్నుకాడి చావడం - యిదియేమో మహామ్మారి
యంట ॥అబ్బా॥
గజ్జబిళ్ల పుట్టడం - కళ్లనీరు కారడం - జెరంజన్ని రావడం -
నిషా తూగునూగడం - తగిలోన్నేదు తప్పకుండ చావడం ॥అబ్బా॥

బోనగల్లు, తాటిచెరువు, అంతా శూన్యమైనాయి. చుట్టు పల్లెలంతా భీతి వలసలు; పానాలు బిగబట్టుకొని పుణకడంలో (జుగుప్సతో) పిల్లల యిడిచిపెట్టినవాళ్లు, పీనిగలనుమంచాల కింద పెట్టిన వాళ్లు, నాగుజెముడులో దోసినవాళ్లు, వాటికి గద్దలు బోరవలు రావడం డొక్కలు చీల్చడం. పల్లకంపు, గందరగోళంగావుంది.

ద్వితీయుఁడు—ఇక గతి వేరేలేదు. (సంతోషముతో) అందరముగలిసి ఆ ధన్వంతరి దగ్గరకేపోయి ఆయన సంరక్షలోవుండిన్ని చెడిపోతూవుండాహని చెప్పకుందాము.

ప్రథముఁడు—(నిశ్వాసమువిడిచి) యముడితో పోట్లాడగలడనే ఖ్యాతి ఆయనకుండదయ్యా! (ద్వితీయుని వీఁపుఁదట్టుచు) బలేమాట చెప్పినావురా!

సుబ్బయ్య—(పిరికితనము వదలి నిశ్వాసమువిడిచి) నాకు యిప్పుడు దిగులు తీరినది. వాంతివచ్చేటట్టు లేదు,

వెంకయ్య—(సంతృప్తితో) నాకు ఆపేరు విన్నతోనే కడుపులో గుటగుట అంతా అణిగింది.

ప్రథముఁడు—నాకు యెన్నాళ్ళనుంచివుండిన వుబ్బరపాండవ ఆయాసం అణిగిందిరా!

ద్వితీయుఁడు—అవి శెలదొర్వులో రాత్రికి భోంచేసి పెద్దబండ్లు కట్టించుకొని తోడుగా పోదాము. తెల్లారి పొద్దుపొడిచే లేక కల్యాణపురం చేరుతాం.

(నిష్క్రమింతురు),

---

# శుచి



## ద్వితీయాంకము.



రంగము 1.—కళ్యాణపురి - వైద్యాలయ సభాస్థలి.

(ధన్వంతరి, ఆత్రేయుఁడు, విశారదుఁడు, ప్రభావుఁడు కూర్చుండి యుందురు.)

ధన్వంతరి—ప్రభావా! నీ కార్యనివేదనము మాకెంతయు సమంజసమని తోఁచుచున్నది. నీవు చూచిన చిం గుంటతేవులపల్లె గ్రామములును, దక్షిణ శిష్యవర్గము శోధించివచ్చిన మాఖవరము తాలూకా మీనుగ కోరపల్లె గ్రామములును, చూడఁజూడఁ బ్రపంచమంతయు వ్యాధులబాధలచే నిడుములఁగు చున్నట్లున్నది. సమస్త గ్రామములందును నొక పరియే చికిత్సాలయములు నెలకొల్పుటకుఁ దగినం శిష్యవర్గము వైద్యకళోత్తీర్ణులు గావలయునుగదా! మా ప్రజాక్షేమమున కీకొఱంత యెప్పటికి దీఱునో.

(నేపథ్యమున)

నాగన్న ప్రభృతులు—

గేయము.

అభయమహాస్వామియ్యాల మాపెబువుల్-అనుగ్రహాముంచాలమా అయ్యాలు
దండాలు పెట్టుతాము - దయవుంచండి దైవములారా! ॥ దండా॥

ధన్వంతరి—(ప్రభువునితో)

అదిమేమియా యార్తనాదము! వారిని త్వరితముగాఁ బ్రవేశపెట్టుము. (ప్రభావుఁడంత నాగన్న ప్రభృతులతోఁ బ్రవేశించును.)

నాగన్న ప్రభృతులు—(పాడుచుఁ బ్రవేశింతురు.)

అభయాస్వామియ్యాలమాపెబువుల్-అనుగ్రహాముంచాలమాఅయ్యాలు ॥అభ

(సాగిలఁబడుచు)

దండాలు పెట్టుతాము - దయవుంచండి దైవములారా ॥దండా॥
పిల్లలుమేకలు - ఘొల్లుఘొల్లుననేడ్వ రూపెత్తినమిత్తి బంట్లవలె-
నల్పి యెత్తుకపోయినాయి ॥అభ॥

మహామ్మారి – మస్నెజరం – మశూచి – విషూచి – మా గ్యామాలు
పాళాలు – మలమల – మాడ్చినాయి ॥అభ॥

ధన్వంతరి—మా బిడ్డలారా! మీ కథయావు సంగతిమి. ఊరడిల్లుఁడు. కూర్చుండుఁడు. మీ కెల్లరకు నిపుడె యీ యంటురోగములు సోఁకకుండ నవరోధచికిత్సలు సేసెదము. మీమీ బంధుజాలములను గూడ సంరక్షించుటకుఁ బుద్ధిమంతులైన మా శిష్యులను మీమీ గ్రామములకుఁ బంపెదము. సాధ్యమయినంత శీఘ్రముగాఁ బ్రతిగ్రామమునను వైద్యాలయములు స్థాపింపఁ బ్రయత్నింతుము.

నూతనప్రవేశి—మీ చల్లని అస్త్రము సోకితే మానవులకు చావు భయము కూడా కలదా! ఏదైనవొక మాట శెలవిచ్చి యీశత్రుల కన్నిటికిన్ని మా గ్యామాలలో పాదయు మోపకుండా అగ్గిపెట్టకుంటె చెడి పోతాము. మేము తిరుగ మాగ్యామాలకు పోము.

జనాంతికము—(ఆత్రేయ విశారదులతో)

ఉ॥ వ్యాధులరాయిడిన్ జనులు • వ్రాలిరి నేఁడిటఁ బట్టలేచు నీ
సాధుల రుక్పరార్తుల వి • షాదము వాపి సుఖంబుఁ గూర్పఁగా
సాధనయుగ్మమేగలదు • చక్కఁగ రోగనిరోధనక్రియా
బోధలు సల్పుటొండు శుచివ్రాజలతోడి ప్రచారమొండునున్॥

ఆ॥ శక్తిగలుగువఱకు • సర్వమానవసేవ
హితము నిరత ముచిత • మతము మనకు
నయ్యదియ వినోద • మదియ పరిశ్రమ
ప్రజలబాధ లుడుపఁ బరమసిద్ధి॥

ప్రాణుల బాధలు తగ్గించుటయే మన యాశయంబులకుఁ బరమావధి, దానంగలుగు మహానందమె మనకు నిరుపమాన పారితోషికము. ఈతని సంభాషణ చూడ నితఁడు మనశిష్యులవలనఁ బ్రబోధింపఁబడని గ్రామనివాసియని తోఁచుచున్నది,

ఆత్రేయా! నీవీ జనులకు ధైర్యముచెప్పి హితమార్గము సూచింపుము

ఆత్రే—

గీ॥ నిప్పుకొండలు గ్రక్కెడు • నీలుకొళ్ళ
మలలదాఁటుచు • దాఁకెడు మంచునదుల
వేగమెనసి జగమ్మును • వేఁచురోగ
ధాటి మనుజుల గుండియల్ • దల్లడిల్ల॥

తనయులారా! ప్రస్తుతమెల్లను వ్యాధిప్రళయమునఁ జిక్కికొని నందున గడుంగడు విచారము గలుగుచున్నది. మీరు భయపడునట్టి ప్రయోగ సంబంధములైన శస్త్రలుగావు- ఈ సోఁకుడు వ్యాధు లన్నిటికిఁ గారణములు రోగమూలాంకురములగు సూక్ష్మక్రిజీవులే యగును.

ఆ॥ రోగబీజసమితి ♦ యీఁగదోమలఁ బోలు
సధమ జంతుజాతి ♦ నాశ్రయించి
కోట్లు వృద్ధినొంది ♦ గూడెంబులోఁ బేటకి
ప్రళయబాధఁ గూల్చుఁ బ్రజలనెల్ల॥

ఆ॥ ఇండ్లయందఁ బెరుఁగు ♦ నీజంతు జాలంబు
పొలము పైరుతోడఁ ♦ గలుపురీతిఁ
గలుపుఁ దీయకున్నఁ ♦ గాఁపేమి పండించుఁ
గ్రిములఁ నారుఁ బెంప ♦ శ్రేయమగునె?

పైరునంత శ్రద్ధతో రక్షసేసి కృషీవలుఁపు మీరు నీరక్తమునుండి యుద్భవించిన పుత్రికల హెచ్చరికతో సాకవలదె! పాప! మీ యల్పజంతువుల ప్రాణము లెట్లు తీసెద మనుకొందురేమో? అయ్యవి పెరుగకుండ గృహములఁ బదిలపఱుపుఁడు. ఉండిన వానినెట్లు చంపుదుము. జీవహింసయే! యనువెడలఁ దేలును, పామును జంపుటలో లేదా; (అ) హింస. పొలములో నికలుపును జంపుటలో మీకుఁ గళంకము దట్టునా?

గీ॥ కలుపునను పైరుగతిఁ బ్రాణ ♦ మలరదొక్కొ?
కలుగదొకో! హింస వేళ్లతోఁ ♦ గలుపుఁ బెఱుక
వీడల నడంచి ప్రజలఁ గాఁ ♦ పాడుపట్లు
వలదు వలదెందు హింసయేఁ ♦ దలఁపు వలదు.

ఇట్టి వ్యాధి కారణములగు నీ విషజీవుల నాశోధన శాలలోఁ దగువసతులఁ బెంచి, వివిధమాలి కాహారములు దీసి, వానితో నీ విషగణప్రాణ నిరోధమారణ ప్రక్రియలు సాధింపఁ బ్రయత్నములు సేయుచున్నాను. త్వరలో సుధాతుల్యము లగునోషధీహారములఁ బడయఁగలనని నా నమ్మకము. అందువలన రోగపీడితులఁ గుముక్షుటకుఁ జక్కని ప్రక్రియ లేర్పడఁగలవు. ఆదియుఁగాక శుచిత్వాది శీలములఁ బునరుద్ధరణముఁ గూర్చియు, వ్యాధులకారణమును, వాని నిరోధముఁ గూర్చియు, తీవ్రప్రచారము సల్పి, ప్రపంచమును ప్రప్రథమమున, ఈతిబాధలనుండి విముక్తిగలుగఁ జేయు శ్రీశుచిమతేనిర్మాణమే సంకల్పించుకొని యున్నారము. దీనికిఁ దగుప్రయత్న మిప్పుడే మొనర్తము. ఈ యంటురోగములు మీకు సోఁకకుండ రక్షణయొనర్చు నవరోధచికిత్స లిప్పుడే పొందుఁడు. మీరలిట నుండునంతకాలము మాపరివార మొసంగు నాతిథ్యము నంగీకరించు చుండుఁడు. మీరుపోయి సుఖముగ నుండుఁడు.

జనులు—చిత్తము. మహాపెసాదము. మేమున్ను తగిన మెలకువతోనుంటాము. శెలవుతీసు కొంటాము. మారాజులాలా!

(దండములుపెట్టి నిష్క్రమింతురు)

ధన్వ—విశారదా! నీ ప్రియశిష్యుఁడు ప్రభావుఁడు నిజభద్రగాన మంత్ర విద్యాసహాయమున దేశకాల పాత్రోచితంబుగఁ బల్లెపల్లెలందును దగువేషంబుల మున్ముందు శుచిమత ప్రచారము సేయవలయు

నని కోరుచున్నాము. నీవును సార్థకాభిధానుఁడవయి, శుచిమత పీఠాధిపతివై, లోకులకుఁ బ్రబోధించి, యారోగ్యమును నెలయించి, మానవకోటిని పునరుజ్జీవింప శిష్యవర్గముతో వెనువెంటఁ బోవలయు.

(విశారద ప్రభావులవైపుఁ జూచి)

అయ్యలారా! చేతులారఁ బెంచి, స్వాస్థ్య విద్యలఁదీర్చిన మిమ్ము దేశదిమ్మరులఁ జేయుటకు మనసొప్పకున్నను, లోకరక్షణార్థమై గాసిపెట్టవలసివచ్చెను. వైద్యశాలలో దైనందిన రోగసంఖ్య లెన్నియో మడుఁగు లధికమైనవి. కాయచికిత్సయం దాత్రేయునకును, శస్త్రచికిత్సయందు నాకును దెఱపిలేదు. అందువలన దేశయాత్రకు మిమ్ము నియోగింపక తప్పినదికాదు.

విశారదుఁడు—అశాశ్వతములగు నీ తనువుల నెప్పుడేవ్యాధి సమయింప నున్నదో! అమోఘములగు నారోగ్యదర్శనముల నేర్చి, యిటనుండిన నేమి ప్రయోజనము? అవశ్యము దేవరవారి యాన శిరసావహించి సంఘరక్షణకై బయలుదేరెదము.

శుచిమత వ్యాపనమునకై నియోగింపఁబడు గురువులిట్లు తనయులమగు మమ్ముఁ బ్రోత్సాహింబలెఁ బ్రబోధింపవలయునే! దేనిని మేము త్రికరణశుద్ధిగ వాంఛించుచుంటిమో యా సంఘసేవయే మాకయాచితముగ లభించె. తామనుగ్రహించుఁ బెన్నిధికిఁ బేరంటపుఁ బిలుపును గావలయునె!

సీ॥ స్వాతి వర్షమునందు ♦ జడివిందుఁ జవిజూడఁ
గాంక్షించునే శుక్తి ♦ ఘనుని పిలుపు?
ఎలమావిగున్నల ♦ నలరు కజ్జములాన
నరయు నే కోకిల ♦ సురభి పిలుపు?
పండు వెన్నెలలోన ♦ వాహ్యాళి వెడలంగ
నీక్షించునె చకోర ♦ మిందు పిలుపు?
కరలాలనంబునఁ ♦ గనువిచ్చి నవ్వంగ
దలఁచునే పద్మిని ♦ తరణి పిలుపు?
గీ॥ వాంఛితంబులకెల్లను ♦ వాంఛితమయి
ప్రాణములకెల్ల, ప్రాణమై ♦ వఱలి పొగడ
రానిశీలప్రచారక ♦ రాజ్యభద్ర
పీఠమున నిల్వ రమ్మని ♦ పిలుపులేల?

(విశారదుఁడు లేచినప్పటినుండి ప్రభావుఁడు నిలువఁబడియే యుండును)

ప్రభావుఁడు—భూతదయాసహితులును, అహింసాపరాయణులును ప్రాణిబాధానివారణ దీక్షాపరతంత్ర మనస్కులునై ప్రాపంచికసుఖముల గడింపక ప్రాణికోటిసేవయె పరమధర్మముగా, స్వర్గసుఖముగాఁ దాము జీవయాత్ర సలుపుచుండ శుచిమతప్రచారమునకై శిష్యసమేతముగా మేము చేయఁబోవు దేశయాత్ర లేశమునకా? "మిమ్ము గాసిపెట్టవలసివచ్చె" నని యవమానముగా సెలవిచ్చితిరి.

ఒకవేళ నిజముగా మాకు గాసియొరాసి లేక శుచిప్రబోధనార్థమై ప్రత్యక్షముగా మాయసువులు నిలువునఁ బోయినను బోసి ఈ బొందెలను సంఘసన్నిధి నర్పించుటకు వెనుకంజవేయుదుమే?

చం॥ కలిగె సహో! యశేషభవ ♦ కాండతపశ్చరణంబునన్ భవ ।
ల్లలితపదారవిందయుగ ♦ ళంబునఁగల్గెడు సేవ, శిష్యతన్ ।
బ్బలసి ప్రచారమేము సలుపన్ ♦ శుచికౌముది లోకమంతటన్ ।
జెలువుగఁ గూర్ప నూత్నయుగ ♦ సేవకు సిద్ధుల మీక్షణంబునన్.

గేయము.

శుచివిజ్ఞానమంత్రము వెదజల్లెదము - వ్యాధుల మర్మము - వాని నిరోధము
శుచిపునరుద్ధారక సత్క్రియలను - ప్రపంచమెల్లను ప్రచురింపఁజేసి
జనులను గ్రొత్తదౌ జ్యోత్స్న వెలుంగఁగ - నూత్నయుగ ప్రారంభము
ఒనరించెదము—(శుచి)

ధన్వ— భళిరే! విశారదప్రభావులారా! మీ సంఘసేవా దీక్షా మహోత్సాహము నిరుపమానము. నేఁడాశ్వయుజ శుద్ధపంచమిగదా? ఆత్రేయా! నేఁడు మన విశారదసంఘమునకాధిపత్యమొసంగెదము. విజయదశమినాఁడు వీరందఱు శుచిమతప్రచార దిగ్విజయమునకుఁ బ్రయాణముగా వచ్చును.

## రంగము 2.

(సాయంకాలము- కల్యాణపురి సమీపమున నొక గ్రామవీధిలోఁ బూజింపియుండిన వేపప్రమాను నెదుట వెలిగించిన గరుడగంబముచుట్టు, కోలాటము వేయుచు, మహాలక్ష్మమ్మభజన సేయుచు ఆఱుగురు ప్రవేశింతురు.)

గ్రామస్థులు— గేయము.

అమ్మ మాయమ్మ మహాలచ్చుమమ్మ - అనుదినమునీసేవ ఆనందమమ్మ ॥అమ్మ॥
యేవీధిచూచిన యాపాకుతోరణాల్- మావీధిచూచితె మల్లెపూతోరణాల్ ॥అమ్మ॥
వడపప్పుపానకం పంద్యారమిస్తాము - మాజోలిరావమ్మ మహాలచ్చుమమ్మ ॥అమ్మ॥

(ప్రభావుఁడు హరిదాసువేషమును దాల్చి పాడుచు ప్రవేశించును. గ్రామస్థులు భజన నిలిపి యాతురతతో విందురు.)

ప్రభా—

గేయము—చతురశ్రగతి.

మృత్యుగణంబుల మోసముఁ దెల్పెడు మేలగు శాస్త్రముఁగనుఁడీ
అకాలమరణము నాటంకపఱుప నాత్రేయ భాష్యము వినుఁడీ॥ మృ॥
శ్రీ శుచి నామోపేత షడక్షరి శ్రేయః ప్రణవము వినుఁడీ
శుచియౌదేహము శుచియౌగేహము శుచికరవస్త్రముఁ గొనుఁడీ॥ మృ॥

శుచిని భజించిన క్షుద్రపువేల్పులు శూన్యముగాఁ బడిపోవుర
శుచిప్రభఁ, దతాములు దగ్గుగ దుమ్ముగ నూడుచుబీడై పోవుర.

(మృత్యుగణంబుల...)

గ్రామస్థులు—ఇదేమిపాటండీ. హరిదాసుగారు.

ప్రభా—ఈతత్త్వమును శ్రీవిశారద మహాగురువులవారు మాకుపదేశించిరి. ఈమంత్రము సాంగోపాంగముగాఁ బఠించి సాధించిన సకలవ్యాధులును పటాపంచలై పోవును. ఇప్పుడు మీరెల్లరు విషూచికి భయపడిరకదా? "అమ్మ మాయమ్మ" అనుపాటను పాడు చుంటిరి. నేను చెప్పెడు శ్రీశుచి శక్తిని గొలిచిన మీకీ వడపప్పు పానకము లక్ష్యముఁ లేదు. మీరుమీవారు మీయిండ్లువాకిండ్లు మీగ్రామములు సర్వము శుభ్రముగానుండినఁ జాలును. గ్రామములో మహాలక్ష్మమ్మ భయముండదు నపుడు శుచి నిట్లుపాసన చేయవలయు.

గేయము॥ బెల్లపుఁపానకము బదులు పోటాష్ పెర్మాంగ్నేటు తేట,
పసుపుజలంబులమాఱుగఁ బానము పరువపు సున్నపుఁదేట॥ మృత్యుగణంబుల
పంచగంగలకుఁ బ్రతిపావనము బాగుగఁ తెర్లిన జలము
శుచిప్రసాదము నిజగృహ సుపచిత శుద్ధంబౌభోజనము॥ మృత్యు॥

గా౹—పాటకడ్డము వొచ్చినానుగాని స్వామీ మీదేవూరు.

(చేఁపలువేసికొనుచు)

(జనాంతికము)

గా౹(2)— వీడెప్పుడు అడ్డాలు వస్తాడోయి! బలే యెచ్చలకారి.

ప్రభా—అయ్యా! మాది కల్యాణపురము. మాగురువులు, శ్రీమదాత్రేయ ధన్వంతరిప్రబోధితవిశారదులు.

గా౹(2)— కళ్యాణపురికి వూపిరితో తీసుకొని పోతేచాలునంట్నే కలరారోగులను ధన్వంతరి దేముడు నూదిమందు వేస్తాడట్నే యేమిస్నె ప్రాణభయం లేదట్నే.

గా౹—నేనెరిగినమట్టుకు యీ యిరవై అయిదు సంవత్సరాలనుంచి అమ్మణ్ణి విసరుతుండది - అడ్డములే వండా ఇప్పుడు అచల్లని ధన్వంతరిదేముడు తలయెగ గట్టివచ్చినపాట కొసవూపిరితో తీసుక పోయినాసరే - అందరికీనయమైపోతుండది.

ప్రభా—జగత్ప్రసిద్ధియైన యాత్రేయధన్వంతరుల ప్రతిభ నేను వేఱుగ పొగడ నేల? వ్యాధిబాధితులకు

సీ॥ వారినామంబుల • ప్రస్తావనలువిన్న
దైన్యమదృశ్యమై • ధైర్యమొదవు
వారునిదానింప• వచ్చుట లాలింప
మునులేని సత్త్వంబు పూనివచ్చు

వారు సన్నిధినుండ • వర్ధిల్లు నభయాప్తి
మిత్తివెటపుదీటి • పాత్తుముదము
వారికరస్పర్శ • పరఁగిన క్షణములో
వ్యాధులతిమిరంబు • వదలిపోవు
గీ॥ దేశకాలపాత్రోచితో • ద్రిక్తరోగ
జృంభణనిరోధనక్రియా • సిద్ధిగాంచి
శ్రీశుచిమత నిర్మాతలై • చెలఁగువారు
భళిర! యాత్రేయధన్వంత • రులు ధరిత్రి॥

ప్రథముఁడు—అయితే అయ్యా యీరోగం వచ్చినతర్వాత చావు తప్పించేదానికే సూదిమందులుంటే మంచి వాండ్లవు అది సోకవుండే దానికికూడా వుండాలనే సూదిమందులు.

ప్రభా—బంగారముగా నున్నవి.

గేయము॥ విఱుగుడు పాలను సూదిని జొనిపిన బరుగిడు భీతి విషూచీ
అట్టుల పొందినవారిని జంపదు ఆఱు నెలలు నాపూచీ॥ మృత్యుగణంబుల॥

ద్వితీ—ఇప్పుడు మేమంచరం సూదిపాలు వేసుకొంటె యీ గండం గడిచి పోతది గదో-

ప్రభా—అవశ్యముగా

తృతీ—(జనాంతికముగా) వోయీ! రామానుజమతానికి శక్రాంకితాల లాగా గామాలనోయి. శుచిమతానికి విసువు సూదిమందులు

ప్రథము—అక్లీ వూరందరికీ వేస్తురుగాని మరిగలిస్తే శుచిని కొల్చువంటే చావు భయంలేదుగదా?

ప్రభా—మీ రెఱుకగలిగి కొలువవలయు.

గేయము॥ పెంటలఁ బొరలుచు నెంగిలి మార్చుచుఁ బెరుఁగు గృహంబుననీఁగ
పాపివిషూచికిఁ బ్రాపువిమానము పంచుఁడు దానినివేగ॥ మృత్యుగణం॥
త్రావు జలంబుల బావులుగుంటలు రక్షణసేయుండచట
పాత్రలుతోముట బట్టలు నుదుకుట మిత్తినిరారమ్మనుట॥ మృ॥
ముట్టినరాదటా పీల్చినరాదటా మూసినగృహముననైన్
త్రావుజలంబుల తినుభోజ్యంబులఁ దగులువిషూచిప్రజలన్॥ మృ॥

మీకు సర్వమును బోధింప మా గురువుల యొద్దకుఁ గొనిపోయెదను. మీ కకాలమరణభయము లేదు. ఇప్పుడే భగవతి శుచిదేవత వచ్చి మీకు స్వయముగనే సెలవియ్యఁగలదు. మరలవచ్చెదను.

(నిష్క్రమించును)

గ్రా॥ 2—యీ హరిదాసే చౌకపాలెంలో వున్న జెరాలను వదిర్చాడంటోయి. యీసమంత్రానికి శుచి దేవత ప్రత్యక్షంగా మాట్లాడుతుందంటోయి!

గ్రా॥ 3—వోయో! మనిషిగావచ్చి మాట్లాడుతుందా?

గ్రా॥ 4—మనము కోరుకున్న వారిమీదవాలి మాట్లాడుతుందంట.

గ్రా॥ 5—అయితే అందరము రచ్చకాడనే చేరి అయన్నుగూడ అక్కడికే పిలుస్తాము.

గ్రా॥ 6—గ్రామకాపులంతా ఆ కంద్రిగోళ్ళ పసరాల మందంతా పార్లబడివొచ్చియెన్నుదీసె మొలగొలు వల చేలల్లోబడి సప్పసప్పగా మేసి పొడుసేస్తే వాట్నిదోలుకొని పాళేవుబందెలదొడ్లో తోల డానికి పోయినారుగదోయి!

గ్రా॥1. సరేలే! రారో! కూళ్లదిన్నవక అందరం యీ రచ్చకాడనే చేర్తాము.

గ్రా॥2. అందరం నూదులువేస్కుంటాం వోయి.

గ్రా॥3. వుమ్మడి కావలికోడిని మంచినీళ్ళబాయికాడ కావువేయిస్తాము.

అందరు—అయన చెప్పినవన్ని చేస్తామోయి.

గ్రా॥1—యీ హరిదాసుదగ్గిరనే మంచిపాటలు నేర్చుకొని శుచిదేవత పాటలే పాడ్తాముర రండి అల శ్యము అవుతుంది.

(నిష్క్రమింతురు.)

## రంగము 3.

అదేపగ్రామము - గ్రామచావడిలోఁ జక్కఁగా నర్చింపఁబడియున్న శ్రీశుచి పటము-ప్రభావుఁడు ఒక బాలిక, చయనులవారు, సెట్టి మొదలగు గ్రామస్థులు, కోడెలరెడ్డి, రత్నము, జోగులు, కూర్చుండియుందురు.

ప్రభా—అందఱు శుభ్రముగా నుదికిన వస్త్రములు గట్టికొని యుంటిరా! సరే-లేదేని శుచిదేవత ప్రత్య క్షముకాదు.

(కమండలువునుండి జలముఁ బ్రోక్షించి బెత్తముతో నొక బాలికను దట్టుచు)

ఈబాలమీఁదనేగదా? శ్రీశుచి పరాశక్తి నావేశపడఁగోరితిరి.

గ్రామస్తులు—అవును.

బాలిక- గేయము.

మఱచినారు మఱచినారు భవ్యశీలమంత ॥మఱ॥

## ద్వితీయాంకము.

గజము మ్రింగు వెలగపండువలె
శుచిత మిగిలె నామశేషముగ ॥మఱి॥
సారము విడిచి యాచారమటంచును
భద్రమహో శ్రీభద్రముగాఁగ ॥
బియ్యము విడిచి పొట్టుం దినంగ
పోసఁగునె నరజన్మ శూరులకు ॥మఱి॥

(ఒక బ్రాహ్మణు నిర్దేశించి)

మీరా! చయనులవారా! శుచివిధులఁ జక్కఁగా నభ్యసించి తక్కినవర్ణముల వారికి నేర్పవలసిన వారు. మీరటుల చేయుచున్నారయ్యా! మీ స్నానము పేరుకే గాని, శుచిత్వము కొఱకుఁ గాదె. చిక్కని బురదకాల్వలలో స్నానము చేసెదరు. అది పంచగంగలోఁ జేరినదని భ్రమించెదరు. అందువలన మీ దేహము శుభ్రపడునా? పంకలేపన మలపడుట మాత్రము నిజము. గుడియెదుటఁ గోనేరు తీర్థమఁట. మునిఁగినవారి యుమ్మి, గుడ్డలుదికిన జిడ్డు, వాననీటిమడ్డి తరతరములనుండి లిబ్బిగాఁ జేర్పబడినవి.

ఈ యమూల్యపదార్థమే పాఁచిరూపముననుండు సకల కల్మషదుర్గంధ భూయిష్టమగు నీ పాఁచినీటిలో స్నానమొనరించిన మీకు నశుచిత్వమబ్బును గాని నన్ను మీరెన్నటికి సమీపింపఁ జాలరు. అశుచిత్వ మాశ్రయించియుండు క్షుద్రరోగములు మీ చేష్టితములకు సంతసించి మిమ్ము నావహించి యెడబాయకుండును. మీరింతకు నగచినఁ బ్రయోజనమేమి? మీరు నన్ను పాటింపఁ దలఁచుకొనిన మీపై నీరోగదేవత లెట్లు వ్రాలఁగలవు. మీరు మా శుచి విధుల మఱచితిరి.

అయ్యా! సెట్టిగారు! మీరు ప్రాణములకంటె వ్యాపారములనుతీపిగాఁ జూతురు. మీ సౌఖ్యములను, ప్రాణములను మీ సరకులకై ధారవోయుదురు. ప్రాణవాయువే ప్రాణంబునకు ముఖ్యాధారము. గాలిమాఱని మళిగలలో రాతి విగ్రహములవలెఁ బగలెల్లఁ గూర్చుండి, దుమ్ము దుమారములఁ బీల్తురు. అందువలన క్షయోత్యాదులు మిమ్ము నావరించును. మీకు దేహపరిశ్రమయే లేదు. మీకు శుచి యెట్లువరమీఁగలను.

రెడ్డిగారూ! మీ పశువులు మీకొఱకుఁ బుట్టినవో, మీరు మీ పశువులకొఱకుఁ బుట్టితిరో మీరెఱుఁగరు. మీరు గొడ్లను బిడ్డలవలె శ్రద్ధతోఁ జూచుటకై మీతోడనే వాని నిండ్లలోఁ బెంచెదమనెదరు. మీ బిడ్డలకు గొడ్ల సాంగత్యముచే మడ్డిబుద్ధి యలవడెను. పేఁడకుప్పలు మఱుగుచుండ ఈఁగలు ఝుంఝుమ్మని మూఁగుచుండఁ బశుమూత్రదుర్గంధము గలిగిన బూడిదకుప్పల దుమ్మె ధూపములుగఁ బేఁడబుట్టల శబ్దములె ఘంటానాదములుగఁ, బేఁడగుంటలయూట తీర్థంబులందుఁ గ్రుంకి యద్దానిచే నాచమనీయాదులు సలిపి, మీరు, బుద్ధిపూర్వముగనో, తెలివిలేకయో యశుచిత్వమే యర్చించుచుండ మీకు నేనెటుల ప్రత్యక్షముకాఁగలను. మీయొద్దకు నేరాఁజాలను.

కోడెల—అయితే మా గొడ్లు పాలాలు అమ్మకో వలసినదేనా? నాతల్లీ!

బాలిక—

ఆ॥ పెంచరాదుగొడ్డ • బిడ్డలతోడను
గొడ్డఁ బెంచవలయు • గొడ్డవలెనె
మడ్డిబుద్ధివచ్చు • మూర్ఖవర్తకయున్న
వేలుచేసి సుతులఁ • బెంచుమయ్య॥

కోడెల—అయితే యేమి చెయ్యాలె?

బాలిక—ప్రత్యేకముగా దొడ్లసుగంధమును, సాధ్యమయినంతత్వరలోఁ దీసివేయించునట్లు భద్రము సేయుము. గొడ్లదొడ్ల దుర్గంధము మీరు పీల్చు ప్రాణవాయువులను సోకఁగూడదు.

కోడె—అట్లె చేస్తాం తల్లీ! (సాంబ్రాణి ధూపము వేయును.)

బాలిక—ఇదిగో మీకడిమూలము. మీయూళ్ళను కోసి, విసిపి, విడచిపెట్టిపోవుటను ముందీక్షుద్రరోగములు లేకుండెను. అప్పుడందరు నన్నే కొలిచెడివారు. మధ్యకాలమున క్షుద్రమతములుపుట్టి, యశుచిత్వమే శిలమని ముగ్ధులగు మీపెద్దల నమ్మించి మిమ్మిట్టి నీచస్థితికిఁ దెచ్చినవి. మీరు జాగరూకులరై పౌరుషము వహించి, కాలయోగ్యములగు మార్పులఁ బురస్కరించుకొని మిమ్ములను మీసంతతుల నారోగ్యవంతులుగఁ జేసికొనుఁడు. పూర్వాన్నత్యముఁ దలఁచి విఱ్ఱవీఁగిన ఫలము లేదు. పూర్వాచారముపై చాపల్యముచే ననర్థము లనుభవింపకుఁడు. సంస్కరించి మేలొనగూర్చునట్టి మార్పులన్యదేశీయములవైనను గైకొనుట లెస్స.

కోడెల—అమ్మా! యీమన్నె కెరములను విరుగేమి!

బాలి—చెలపచెలప నీటిగుంటలే యీ యూరికనర్థకములు. వానిని పూడ్చివేయింపుఁడు. అందాఁక ఆదివారమునాఁడన్నిగుంటలందును నీరు తోడివేయుఁడు. అనాఁడు గుంటలయడుగున నాచుఁ బొంగలిఁ బెట్టించిన మన్నెజ్వరమును మీ వంకకు రానను.

కోడెల—(జనాంతికము)

బలేమాటరా! దోమలు గుడ్లలోనుంచి పిల్లలవుండేదానికి మంచిపన్నాగము. అమ్మణ్ణి శెలవిచ్చింది.

బాలి—నావాఁడు, విశారదగురువు, నామతమును జక్కఁగా బోధించును. వానిదగ్గఱ శిష్యత్వముఁ బొందుఁడు. ఇఁక నీమీద సెలవు.

జనులు—చిత్తము అట్లాగే చేస్తాము తల్లీ!

(నిష్క్రమింతురు)

కోడెల—(ప్రభావునితో) నారు, చిన్నా! యిక్కడికి వస్తారా? ఆగురువులుగారు.

ప్రభా—ఆ! నారు త్వరలో సంచారముగా విచ్చేసెదరు. ప్రస్తుతము శుచిమతానుసారముగాఁ బట్టణపు

మార్పులను జేయుటలో నిర్బంధోచిత విద్యలంగఱపు సర్వకళాశాలల స్థాపించుటలో నారోగ్య వాస్తవ్యు, శుచి విద్యాశాఖల సర్వాధికారులు గడచిన ఆఱుమాసములందు నెఱవేర్చిన కృత్యములం బరిశీలించుచు కల్యాణపురిలోనే యున్నారు.

కోడెల—అయితే అయ్యా! నాదీ కల్యాణపురమే. ఆరునెలలనాడు కొంప గోడి విడిచిపెట్టి యీ పడమటి రాజ్యముమీద యెదజల్లిన బేరం అప్పులు దండుకోనడానికి వచ్చి అష్టకష్టాలుపడి తిరిగి పోడంలో యిక్కడ మఖాం చేసినాము. అయ్యో! మా కొంపలంతా పగలగొట్టినారంట పెద్దపుకారుగా వుండదయ్యా! నిజమేనా?

ప్రభా—కల్యాణపురి కెల్ల వైపులను నాలుమైళ్ళ పర్యంతము సకల పట్టణములను, గ్రామములను, ఎలుకలను, పిఁగలను, దోమలను, సందులలో వసతిలేనట్టి మార్పులతోఁ పునర్నిర్మాణము చేయుటయుఁ బూనినది తథ్యము. ఇప్పటికాపనియుఁ బూర్తియై యుండును.

కోడెల—అయ్యా! నిజమేనా! నాకొంపమునిగిపోయెగా! యీ అనవగాహల ప్రయాణం భత్యాల గుంజులాటలో మిన్న, నీవు అప్పులోండ్ల ప్రాంసరీనోట్ల కట్టంతా యెత్తి చూరులో తగలబెట్టివస్తినే. అంతా నా కొంపకేరావాలె.

ప్రభా—రెడ్డిగారు! త్వరపడకుఁడు. అకట్ట బహుశః భద్రముచేయఁబడి యుండవచ్చును.

కోడెల—ఆ! భద్రము లేదు, గిద్రము లేదు, పెదిమకదల్చి మాట్లాడ నిచ్చినారంటయ్యా! యీనరకళ్ళూ! యీళ్ళజగడాలలో అశగనంయాశిమించి పోద్దని యికాయెకీన కదలబారి దోవబట్టితిమి. అందుకే ఆత్రమూ, అడావుడిన్ని, అప్పులచేటు అన్నాడు. అయ్యా! యికశెలవియ్యండి. అవూళ్ళోనే వుపదేశం అవుతా.

(పరిభావుఁడు నిష్క్రమించును.)

(కోడెలరెడ్డి కొంతదూరము నడచి యొక తిన్నెపైఁ గూర్చుండును.)

కోడెల—బసవనచ్చినాము (రత్నముతో) రాయె నాబంగరుబొమ్మ! నీముఖం చూస్తేనాకన్నికష్టాలు తీరతాయి

రత్నము—సరేకాని ఇక చూరులో ప్రోనోట్లకట్టపోతే! దివాలా దాఖలు చేయవలసినదేనా!

కోడెల—ఛా! వెర్రిదాని! ఊరుకో! ఒకేజోగులూ! ఎత్తురాళ్లుసంచి. ఈయిగో నూడు. అట్లాంటి కట్టలు నూరు—నూటికినూర్లు, ఇవిమాత్రం ఒకలెక్కా. ఏమనుకొన్నావు. నేను ఒకవూరునుంచి ఇంకొకవూరికి ఆవలించి అడుగుబెట్టే దానికిముందే ధణీల్ ధణీల్ అంటూ లక్షల్ లక్షల్ ధనలక్ష్మి బరాబరి చేస్తా. బ్యాంకీనుంచి బ్యాంకీకి హుండీమీద హుండీ నడస్తా ఉండదం టె.

యేం! యెవరనుకొన్నావు! వూళ్ళో అడ్డదొడ్డాలు తిరిగే కొంటె కోంటె పడుచుపిల్లకాయ లనుకొన్నావా?

రత్నము—కండ్లు తెరచికొని చూచేవాండ్లు ఎవ్వరు మిమ్ములను పడుచువారని పొరపడరు.

కోడెల—బోసిబాణా! పడవాటిసీమంతా నాలుగుమూర్లు కనుదాళినంతవట్టుప తిప్పించి మళ్ళించికొట్టేను. పలపల వొళ్ళ-మీసం నరసినవని కోడిగానికి నెం దలుపెట్టినావుగా! భద్రం! రేపక తినే వోడిని?- అయితే

రత్న—తాము ప్రౌఢులని రసజ్ఞశేఖరులని నాకుదెలియదా? అయినను మనము పోవునది యిదివరకువలె పల్లెగ్రామముకాదు. మీభార్యాబిడ్డలు పదిమందిబంధువులుండే స్వంతపట్టణము. వారందరు ఒకటిఅయి, మీకునామీదగల మమతను మరల్చివేసిన నాగతియేమి. మావారినందరిని వదులుకొని, మీపాదములే నమ్ముకొని ఊరూరు నీళ్ళుత్రాగుచు మీతోడవచ్చుచుంటినే. తాముచూపిన ఆశలు, పెట్టుకొన్న ఒట్లు, ఏటితోగట్టినమూటలేనా?

కోడెల—అరరే మాటతప్పే పలుంగాదిది. నోటరావలసిందేగాని, (ఆత్మగతము) అయినా ఆయివోజు దీని చేతికందిస్తే అల్లరిపలం ఎవరైనా చూపరిని పడువోణ్ణి లప్టాయించుకొనిపోతే నేనేమిచేసేది. (ప్రకాశముగా) మాటనమ్మనితెగ వరే! జోగులూ! యెత్తురా! పైలుసంచి యియిగో బొంత పాడుగుండ్లసీమపత్రాలు; కొసులకండ, రవ్వలకమ్మలు సిమచేయించేదాక నదగ్గర పెట్టిపెట్టుకో (రెడ్డి తిన్నెపై కూర్చుండును.)

రత్న—(పలుకుచు అందుకొనును ఆకుమడుపు లందిచ్చును)

## గేయము.

(1) ఆకుమడుపుల నందికోరా! హాళి తాళగలేరా॥ ఆకు॥
(పరోక్షమున మటికెలు విఱుచుచు) "మారాకార"

కోడెల—(వక్కలాకులు నములుచు)

భేష్! యిదేమిపాట యెంతమర్లు యీమితాయిబొమ్మకి నామీద. సంగీతం కాకుండా కవనము కూడా యాడ నేర్చుకున్నావే?

రత్న-(2) ప్రౌఢరసికవరులో మీ - పజ్జనుండంగ నాకు ।
గూఢలలితభాష - గోప్యమా శయ్యతోరాదె ఆ శుకవిత ॥ఆకు॥

కోడెల—అహా! వాహ్వా! నా ముద్దులమితారికి వొక సొగసేకాదు, వొక సంగీతమే కాదు. కవనముకూడ నేను అనుకొనంది అబ్బివుండెకదా! యేమి యీ యిటుకలాడి పాటపాడేసీటు! యేమి యీ వగలాడి మొంగము చిలికే సొగసు! యేమి అవులుకలాడి కళ్లచూపే తళుకు! వరేజోగులూ! వొకయాళ దేశాలన్నీ గాలించి యెదికినా నేపో బలేదాన్ని పట్టినాన్ రా అబ్బా! దీనికిచ్చే దుడ్డుకేమిలే! ఒక సబురులో అప్పులోండ్లు మహామ్మారిలో చచ్చినారనుకొంటా.

రత్న-(3) నీలనీరదమందు నిక్కి-ధళ్కని వెల్గు
మేలిమెఱుములచాలు మెచ్చులో. మీసములు । నీమీసములు ॥ఆకు॥

కో—(మీసములుగువ్వచు)

నరసిపోయిన మీసాన్నికూడ యెంత బాగా వర్ణించినదిరా! కడతా వుండారుగ దేశ కళ్యాణ పురంలో అంతస్తులమీద అంతస్తులమేడలు - చీమలు చిటుక్కు మనమండా, దోమలు చెవులలో సంగీతాలు పాడమండా, ఈగలు యెంగిలి చేయమండా యెలుకలు అలుకొంగుళ్ళ పక్కలనడుమ నబ్బని పడమండా - అక్కడా, అతిగదీపాలకాంతిలో సివుకల్కుతా పాడుతా వుంటే సిపాటలు యెన్నిఅయినా యింటావుంటా (జవనిక జాఱును)

రంగము 4.—కళ్యాణపురి.

(శుచికార్యస్థానము ఆరోగ్యవాస్తు విద్యాశాఖా సర్వాధికారులు కూర్చుండియుందురు)

విద్యాశాఖా సర్వాధికారి—ఆహా మిత్రమా! యిప్పుడుగదా! కళ్యాణపురియు పరిసరప్రదేశములును, శుచి విషయిక సర్వకళాశాలలకును, విద్యా శాలానేకములకు నాటపట్టులై అభినవనాగరికతకు అవలంబములై చీమ చిటుక్కు మనునంత లేని దుర్గంధాలు లేనివై స్వర్లోకనాయకుని ముఖ్యపట్టణములో యన విరాజిల్లుచున్నవి. ఈ శుచి విశ్వవిద్యాలయములు నీ వైద్య శాఖాసమితులుం జూడం జూడ బౌద్ధమత విజృంభణకాలమందు అ యశోకుని రాజ్యములో స్థాపితములైన నలందాతక్షశిలాది విశ్వవిద్యాలయాదులును, బౌద్ధ సేవావిహారణములు స్మరణకుం దెచ్చుచున్నవి.

వాస్తు—అయినను చిత్ర శిల్పమందువలె ఆరోగ్యవాస్తు శిల్పమునందు ఆనాంటిబౌద్ధులకు ప్రవీణత లేదు. ఆరోగ్యవాస్తు వన్ననో శుచిమతము పెట్టిన భిక్ష. రోగవాహకములగు సిమశక మక్షికా మూషికాది జంతువులకు దుర్గమములగు గృహరాజంబుల సంకల్పించి ప్రప్రథమమున నిర్మాణముచేయు కీర్తి శుచిమతమునకే వచ్చినది.

విద్యా—అయ్యా! యీ పునర్నిర్మాణ కార్యక్రమమునందు పూర్వ నివేశములను విడిసేయించుటయందేమి, పగులగొట్టించుటయందేమి మీకు సామాన్యపు జనంబులవలన ఆటంకము లేమైనం గలుగలేదా?

వాస్తు—సుంతయులేదు. ఆసత్య, సత్త్వ తేజోమూర్తులు లోకసంరక్షణ కార్యదక్షులు, ఆత్రేయ ధన్వంతరుల యాజ్ఞయనినం జాలును. జనులు తమ గృహములనేగాక వలయునో ప్రాణములనైన నర్పింప వెనుదీయరు. ఇంక వారి శిష్యులు, జగద్గురువులు, శ్రీ శుచి మత పీఠాధిపతులు నగు విశారద మహాశయుల యభిజ్ఞతయు శుచిమహాదేవి యాజ్ఞానుసారము కమలామహాదేవి ముప్పది మూండుకోట్ల రూప్యంబులనిధి సమర్పించుటయు మీకుం దెలియని విషయంబులుగావు. ఇంక సౌకర్యంబుల కేమికొదువ?

తత్పట్టణ నిర్మాణకాలమందు వెలుపల నేర్పఱచిన తాత్కాలిక కుటీరములందు నిలిచియుండినట్టి సమయమున వారు ప్రసాదించిన శుచి సంతర్పణముల భుజించి నిర్బంధమైనను వినోదమువలె నేర్పుతో మీ బోధకు లిచ్చు విద్యలు గఱచుచు సుఖంబుగనుండిరి. విద్యుత్పరికర సహితములగు నీ నూత్న గృహముల నెల్లరు సంతుష్టాంతరంగులై కాంపురములం చేయుచు విలసిల్లుచున్నారు.

విద్యా—ఏదిక్కు వినినను శుచి విద్యావిషయిక బోధనలు చక్కఁగా సంకీర్తింపఁబడుచున్నవి. బాలురే గాక యువతులును ప్రౌఢులును లోలురును, పురుషులేగాక స్త్రీలుఁగూడ నీకాలఁది కాలముననే యుపన్యాసముల వినియు, యంత్రపట నాటకముల వలననేమి, రంగస్థలిఁ గావింపఁబడు రూపక ప్రదర్శనమాలవలననేమి గ్రహించియు, సూక్ష్మదర్శని యంత్రముల మూలమున స్వయముగ సాధన మొనర్చియు, మానవ దేహ నిర్మాణ తత్త్వాదులను, ఆరోగ్యసాధనములను, విషజీవుల నిర్మూల మార్గంబులను, వాని కొటపట్టులగు మశక మక్షికామూషికాది జంతు ప్రకృతుల విమర్శనంబులను, వేసేల వ్యాధుల సత్యతత్త్వంబులను, వాని నిరోధప్రక్రియలను అలవరించుకొని, విరాజిల్లెదరు. సర్వకళాశాలలఁ గ్రొత్తక్రొత్త విషయముల, విషజీవుల, వాని నున్మూలించు నోషధీవర్గంబుల పరిశీలించు దేశ సంరక్షణ దీక్షా పరతంత్రులౌ విద్యార్థులెందఱేనియుఁ గలరు.

గాస్త్రు—బహుచక్కని ప్రబోధమార్గము. నా కార్య నివేదన మిచట నేయున్నది.

ద్యా—నేనుఁగూడ కొనివచ్చితిని. మునుముందు ఈ రెంటికిని పరస్పరము పొందిక చూచి పిదప విశారద దేశికుల పాదసన్నిధిని వాని నర్పింతును

స్త్రు—ఇంకను నాలుగు ఘడియల విరామమున్నది. తాము చూచుచుండుఁడు. నేను పురద్వారమందుఁ పూర్తిఅయిన కొన్ని కట్టడముల పరిశీలించి ఒక ఘడియలో నిచటనే కలిసికొనెద.

రంగము:—కల్యాణపుర ద్వారము.

కోడెలరెడ్డి-రత్నము-జోగులు-ద్వారపాలకుఁడు.

డెల—(దృష్టిసారించి) అబ్బా! ఏమి మాటిపోయించె యీవూరు. ఈమిట్ట, ఆగుడిగోపురాలుఁ, యీ చెరువును, అధనమంత్రి నగరు మిద్దెలను జ్ఞప్తిపెట్టుకోకుంటే యీ కల్యాణపురము మాయమైపోయి ఆ ఇంద్రుడిపట్నమో చంద్రుడిపట్నమో ఇక్కడ దిగబడ్డదని అనుకోవలసిందే. అబ్బా! చూడరా అట్లా! ఆ నల్లమబ్బులో పస్తుళ్లా ఇంద్రుడు, వాడిమెఖాన చుట్టపొగ యిడిచే అంత యెత్తుగా వుఁడయిరా పొగగొట్టాలు. వోయో! బంద్రటోతూ! యేందబ్బా! యింతపొడుగ్గావున్నాయి పొగ గొట్టాలు?

ద్వార—అవి ఆత్రేయులవారి విషజీవ శోధనశాలకు సంబంధించినవి. పెరుములుండవలే, మబ్బులో పెరుములు, అట్లాంటి దీపాలకు కావలసిన యంత్రాల సంబంధములు, యివి. తులసీ, వేము యిట్లాంటిఅవుషధంచేసే మూలికలు, ఆకులు, కాయలు మొదలయిన వాట్లనుంచి ఉప్పుతీసే యంత్రాలవి, యివి. ఇవి నీళ్లను గట్టిగా మంచుగడ్డగాచేసే యంత్రాలవి. మహామ్మారి, విషూచి, సన్నిపాత పురుగులను నూరి, చంపి, విరుగుడు నూదిమందులను చేసేది, యిక్కడ. అక్కడ బాగ్గుగాలి చేసేదానికి. అల్లదుగో మురుగుకాల్వనీరు తోడే యంత్రానిది. దానికావలిది పెంటకుప్పలు కాల్చే యంత్రసంబంధము. వీట్లపొగను బైటికి విడిచి పెట్టేటందుకయ్యా యీపొగ గొట్టాలు.

డెల—(మెల్లఁగా చుట్టముట్టించుకొనఁబోవును)

ద్వార—అయ్యా భద్రమండీ! నేలను వుయ్యబోతారేమో. నేలఉమ్మేస్తే మీపై జుల్మానావేస్తారు.

కోడెల—ఓయబ్బా! ఇదివరకంటేవాటికి గాక నేలవుమ్మేస్తే, చీదితే, దగ్గితేకూడానా జుల్మానా!

ద్వార—అదుగో! అపలకమీద వ్రాసియున్న ఉత్తర్వులు చూడండి. మీరుచెప్పిన అమూడుపనులుకూడా ఇతరులకు సెబ్బరకాబట్టి బహిరంగంగా జనబాహుళ్యముండే వీధులలో నేలమీద వుమ్మేయరాదు, నేలమీద చీదగూడదు, చేతిరుమాలుతో నోరుమూసుకొనే దగ్గాలని ధన్వంతరి దేముడి శాసనం.

కోడెల—ధర్మంతరీ దేవుడి శాసనమా! (చెట్టపొరవేయును. శిరముపై చేతులు జోడించుకొనును.)

ద్వార—మీరేమి యీ వూళ్ళోకిపోతారా?

కోడెల—నీవెవురో కొత్తోడివిగా వుండావు. లేకుంటే నన్నెఅగనోల్లుండారా యిక్కడ? నేనుకొండలరెడ్డిగారి కోడెల రెడ్డినిగదో!

ద్వార—అయితే వీరెవరు?

కో.రె—వాడు నాకింద బేరగాడు జోగుల్లే. అపిల్ల నాతోకూడా వచ్చిందిలే.

ద్వార—మీ రెవ్వరైనా సరే పట్నంలోకి అడుగు పెట్టేదానికిముందే యీవూరిబైట యిల్లిదిగో యీవైద్యశాలలో తనిఖీ పొందాలె. మీకేవైన జబ్బులుంటే అక్కడ బాగుచేసికొననిదే వూళ్ళోకి పంపరు. ఆయినా అతి త్వరగా పసురు సూదిమందులతో ఉచితముగా పత్తెపానాదులు చూచి బాగుచేసి పంపుతారు.

(కోడెల—సానిమొగము చూచి కనుబొమ్మలెగురవేయును)

కోడెల—వోరే జోగులా! యెత్తురా రైలుసంచి. పదిరూపాయల రొక్కం యీ బంట్రోతుచేతిలో బెట్టు.

ద్వార—అకాలంపోయిందండీ. కూటికి గడవని కాలంలో పొట్టాత్రానికి పిల్లలను మేకలను పెంచేదానికి చెయ్యి జాపుతుండేము. ఇప్పుడా చల్లని ధనుమంతరిదేముడు మమ్మెలనందరి యెంత గారాబముతో సాకుతూవుండాడు. ఇంకయెంతమంది చుట్టాలువచ్చినా, పిల్లలుమీదపిల్లలు, మనమండ్లమీద మనవరాళ్లు, వందలుమందలుగా పుట్టినా కన్నతండ్రికంటె యెక్కువ సంతోషముతో సాకగలడు. మాకు యీ దుడ్డుభారమెందుకు? అక్కఱలేదు.

కోడెల—ఆఁ ( : అయితే భయమేమి? పోయి చూపించుకొంటాము. అయినా వంట్లో కొంచెము నస్మేరిపుండది. అన్ని సంకటాలు యీ మూలంగా తీరిపోతాయి.

రత్నము—చాలుచాలు. అడ్డమైనవూళ్లు తిరిగితిరిగి నాకేమో వళ్లు ఛీదరకించినట్లున్నది. మీవూరిలో పాదము పెట్టకముందే సూదికొట్లు అంపరార్పణ కావాలె. అవైద్యశాలకు నేను రానూరాను. చూపించుకోనూపోను. నాకు సూదిపోడుపులు వద్దనూ వద్దు.

ద్వార—అట్లయితే మీరు వూరులోకి వచ్చుటకు వీలుపడదు.

జోగులు—(కోడెలరెడ్డి చెవిలో) నేనప్పుడే చెప్పలేదంటయ్యా! యీ మణిసికి వేశే మనస్సుండదని.

కోడెల—(బింకముతో) యేమే రత్నమూ! వూరిముంగలికివచ్చి వూరుకూడా చూడకుండా నాపకావుదీయ వచ్చునంటే? నేను నీ కెంతైనా యివ్వనంటే?

రత్నము—ఆఁ. ఇదివరకు యిచ్చినదిచాలు.

కోడెల—(కోపముతో, అఱచుచు) ఆఁ! ఆఁ! ఏమో! నాదగ్గఱవుండి నా అన్నవస్త్రములుతిని, కట్టి, నాద గ్గఱ రొక్కముతీసుకొని, నన్ను మోసముచేసి, నన్ను కానకుండా, లోపాయికారితనంగా యింకొ కణ్ణి కోరుతావూ?

రత్నము—నీదగ్గఱనే ఉన్నాను. నీయన్నవస్త్రములు తిన్నది కట్టినది వాసవమే. నీ దగ్గఱ రొక్కము తీసుకోలేదని చెప్పలేదు. అయితే నేటితో ఋణముతీరినది.

కోడెల—(నిస్పృహతో, కసితో) ఋణముతీరినట్లైనా? నిన్నుతీగదీపాల రెండంతస్తుల మేడలో పెట్టాలని అనుకొన్నానుగదే! (గ్రుక్కమింగి) అయితే గుండ్లసీమ, బొంతపాడు పత్రాలకట్టలు నీవందుకొ నేటప్పుడు నీవు నాకు వడంబడిక చేసికోలే!

రత్నము—ఏది? ఆఒడంబడిక కాగితము?

కోడెల—(కోపముతో, పెదవులదర, కంపముతో) తప్పుడుదానా? నిన్నేమిచేస్తానో చూచుకో!

ద్వారపాలకుఁడు—(అడ్డమునిలిచి)

యింతకు పయికిపోయిన పరువుదక్కదు. యిష్టములేని దానితో యెంతవాదించి యేమిప్రయో జనము.

(రత్నము చేయిపట్టి పిలుచును. శెట్టి ప్రవేశించి నిలువఁబడును.)

శెట్టి—కోడెలరెడ్డీ! జాగ్రత! మా' అయ్యగారు యీ మన్సిని భద్రంగా తీస్కొని రమ్మన్నార్.

గో—(కెలఁగుపడి)

యీ సిద్దిగాణ్ణి యెక్కడతెచ్చినావే తప్పుడుదానా! వీడి అయ్యగాడట. యెవడు వాడు! (బింకముతో)—వాణ్ణి వీళ్ళందరిని యేమి చేస్తానో సూడు.

(జోగులు యజమానుఁడు పోయినపక్షీ చూచుచుండును సర్దారుసింగు వచ్చి రత్నమురెట్టఁ బట్టుకొని కోడెలరెడ్డి పోయినవైపు లక్ష్యముచేయక)

సింగు— గేయము.

రావే-రావే- ముద్దులగుమ్మా రాకేందునిభముఖిరో!

రత్న— నీతోగరు గడ్డము నేత్రపువిందు - నీవెడఁద వక్షము నెయ్యపు చిందు

నీనూగుమీసము: బల్ పసందు॥
రారారారా ముద్దులమారా రతిసతి ప్రణయపుమేరా॥

సింగు—రావే-రావే-ముద్దులగుమ్మా రతిపతి ప్రణయమ్మా
ఓ వలపుల జిలికెడి చిలుకల కొలికీ
ఓ జిలిబిలి పలుకుల యలరులములికీ
ఓ కలువల కలిమిని కలంచెడు కలికీ॥ రావే రావే॥

రత్న— ఆ ముదుసలి మీసుంగు, బారిదప్పెనా కనుంగ
మదమలరగ, ముద మురలంగ, మదనునిగొల్తము రారా రారా॥ రారా
ముద్దులమారా రతిసతిప్రయణపు మేరా॥

ద్వారపా—(బిగిలినాది)భయము, భక్తిలేమండా రచ్చలోనా ఆంపు! మీరందరు మా అయ్యగారి హవేలికి నడవండి.

శెట్టి—నీదియెందివోయి?

ద్వారపా—నోరుమూస్కొని నడువురా బక్వాస్.

(శెట్టి మెడపై ఒక తాపు యిచ్చుచు నెట్టుకొనిపోవును. రత్నము సర్దారుసింగు అనుసరింతురు.)

కోడెల—(పునఃప్రవేశము కోపకంపితుడై చేతిలో పెద్దదుడ్డుకఱ్ఱతో) మంచిపేరు పెట్టినారురా నీవ మందమతిజోగులు. ఆ బోగందానికి మఱుసు వేఱేవిధంగావుంది గీఱుసువేరేవిధంగావుంది అవ మంటె సింగిగాడే కన్నేసినాడని చెప్పగూడదో?

జోగులు—(ఏడ్చుచు) నేనేమి నూచినానంటయ్యా?

కోడెల—(జోగులను చెంపమీద దెబ్బగొట్టి) అధికప్రసంగీ! భద్రము అయింది, అయింది, పోయింది, పోయింది, గాని యీ బోగందాని కతవ్వాళ్లో యెవరితోనైనా నీవుగా యెత్తినట్లుండాల, యీ చెంపనకొత్తె ఆచెంపన జోపె గారుతుంది భద్రం. కబడ్దార్.

(దైన్యము, కోపము, యేడ్పు, గుండెలు గుద్దుకొనుచు)

నా చేతులారా సాకి పెంచి పెద్దజేసి బేరంనేర్పి భాగంయిచ్చి గుంపుకు సర్దారుగా చేసిన సింగిగాడే యెంత గురుద్రోహము చేసినాడురా,

గేయము. చేతిలోని ప్రాంశరినోట్లు చెఱచుకొంటి సూరులో
చేరదీసి బోగంసాన్ని చెఱచుకొంటి బేరము
చేరబట్టి బోగంసాన్ని చెఱచుకొంటి దేహము॥ చే॥
చేరదీసి చెంత గుడిపి సాకిన
బేరసారంనేర్పి సర్దారుచేసిన – చెనటిసింగనా
గురుద్రోహియైనా సానిగొంచు – గుండ్లపల్లి బొంతపాడు

కాగితములన్ని కాఁజేసెగా॥ చేతి॥
గుట్టునింక కాపురంబు నెట్టెద
గట్టిగా శుచిదేవిపాదము కావుకావనిపట్టెద॥ చేతి॥

తెలిసి బంగారంవంటి వల్లు పాడుచేసుకొంటిని. పింగిగాడి గురుద్రోహం వాడ్నే కొట్టిందిలే! బంట్రోతుపదం అయినాడు. ఇంతకంటె ఘాటయిన రోగాలు వాడికిన్ని రత్నం పంచిస్తది.

మూడుకాళ్ల ముసలోడికి నాకేల యీసుర్బుద్ధి యిప్పుడు పుట్టాలె. పలికిసాలు పొంగిస్తా వుఁడదే యీకళ్యాణపురంలో ఆ మహాతల్లి శ్రీశుచిదేవినే కొలుస్తూ మిగిలిన బ్రతికే కాలము గడుపు తుంటా. యీవైద్యశాలలో వళ్లు బాగుచేయించుకొని విశారదగురువుల వద్దవుపదేశమందుతా రారా జోగులూ.

(నిష్క్రమింతురు)

## రంగము 6.—కళ్యాణపురి—శుచిమఠము.

(ఉచితవేష విభవములతో విశారదుఁడుపవిష్టుఁడై యుండును.)

విశా—ప్రభావాది మదీయ శిష్యుల ప్రబోధముచే ప్రపంచమున నవీన మతమునందు ఉత్సాహము కన్పట్టుచున్నది. భారతఖండాయురారోగ్య పునరుద్ధరణాభిరతులగు జనులిటకే దీక్షగైకొన స్నానము లాచరించి పట్టుపుట్టములు ధరించి "శ్రీ శుచిదేవికి జయ్" అంచు జయజయ ధ్వానములతో వచ్చుచున్నారు.

జనులు—మహాదేవి శుచికి జయ్ - మారీకృతమశూచికి జయ్ - వశీకృత విషూచికి జయ్ - శ్రీమదఖండానందదాయక, సకలరోగ భయ నివారక, శుచిమత బీజాక్షర ప్రబోధక, సచ్చిదానంద స్వరూపులగు విజ్ఞాననిధులగు శ్రీ విశారదగురువర్యులకు యుష్మత్పాదారవింద శుశ్రూషాభిరతుల మిదె సాష్టాంగదండ ప్రణామము లొనరించుచున్నాము.

విశా—శ్రీ శుచ్యర్పణమస్తు! ఓ శుచిమత సాంప్రదాయాన్వేషణ పరాయణులారా! సంఘస్వరూపమును దిలకింపుఁడు.

తల్లి గారాబుబిడ్డను ఎడతెగని ప్రేమతో సాకునట్లు ఆ పరాశక్తియు నిండు వాత్సల్యమున మనల సర్వదా అనుక్షణంబును సేవించుచున్నది. నీతినిదీర్చి, సుగుణభూషణములచే నలంకరించి, స్వాస్థ్యము నెలకొల్ప ప్రబవక్తలను, మహాపురుషులనుపంచుచున్నది. యుగయుగమునందును సంఘము నుద్ధరింప సుగుణరూపిణిఅయి అవతరించి సంఘరక్షకసేవ చేయుచున్నది. అట్టి సంఘసేవకంటె పరమార్థము లేదు. అద్దానిమాత్రము పరిశీలింపుఁడు. ఇవి రెండు విధములు. మొదటిది తాను కష్టపడి సంఘశ్రేయోర్థము పాటుపడుట. రెండవది తనకేవేని సోఁకుడువ్యాధులున్న సంఘక్షేమార్థము తాను సంఘమును వీడి దూరస్థుఁడైయుండుట. ఇట్లు చేయుటవలన అనేక దేశములలో కుష్ఠరోగము నిర్మూలమైనది. ఓ కుష్ఠరోగులారా! మీ నాసికాస్రావముల మూలమున మృత్యువు ప్రతిక్షణము నను కోట్లకొలఁది కుష్ఠరోగక్రిములను మానవసమాజముపై వెదజల్లుచున్నది.

ఓ క్షయరోగులారా! మీరు దగ్గునప్పుడెల్ల క్షయక్రిములు మిరపపొడి దంచునపుడు కారు వ్యాపించురీతిని తరంగితములయి యితరుల శ్వాసకోశములం బ్రవేశించుచున్నవి.

అయ్యయ్యో! మృత్యుపక్షమవలంబించి మీ దేశమును మీ సంఘమును మీ రక్తమునే ధ్వంసము చేయుదురే!

జనులు—స్వాములారా! మేమెన్నటికి అట్లు చేయము.

విశా—అట్లయిన ఏదీ మీ సంఘసేవాపరాయణత? నిదర్శనము చూపింపుడు.

కుష్ఠరోగి—(లేచి) మహానుభావా! వంశపారంపర్యముగం గూడిన రెండుకోట్లరూప్యంబులుగల నా సర్వస్వము కుష్ఠరోగ శరణాలయమునకై తమ పేరిట వ్రాయించితి. నేనుతాముఏర్పఱచిన ఆశరణాలయ ద్వీపమున వసించుటకై యిదే పోవుచున్నాను.

విశా—అటులనా? చాల సంతోషము. నాయనా! పురుషకారమునకు నీవు మార్గదర్శకుండవైతివి. నీకు భగవతి ఆయురారోగ్యముల ప్రసాదించుగాక.

(జనులతో) చూచితిరా.

అ॥ సంఘహితమునకును ♦ సాష్టాంగ మొనరించి
అగ్నిశుద్ధయనుచు ♦ నాత్మనెఱింగి
రాముఁడు సుగుణాభి ♦ రాముఁడుకానకు
సీతఁ బంపె జనుల ♦ ప్రీతికొఱకు॥

కాఁబట్టి సామాన్యులకేగాక చక్రవర్తికిసహితము సంఘసేవ పరమాదరణీయము. అందువలననే స్వీయ ప్రయోజనములు సంఘకళ్యాణమునకు హితవుగానిచో వానిని వీడుటయే పారమార్థికమును, కర్తవ్యమును.

(కుసుంభిణి. ఫిరంగిణి ప్రవేశము)

కుసుంభిణి—విశారద జగద్గురువర్యులకు కుసుంభిణీ ఫిరంగిణులము నమస్కరించుచున్నాము.

విశా—కళ్యాణమస్తు! మీనామధేయము లపూర్వములే?

కుసుం—

కం॥ విరిసెడుగులాబిరాసి పొ
దరుటింటఁ గుసుమశయ్యం ♦ దల్లి గనుటచేఁ
బరఁగెఁ "కుసుంభిణి" నామము
గురువర్యా! నాకు ముద్దు ♦ కోసము పేరై॥

విశా—అటులా!

ఫిరంగి—

కం॥ తళతళకత్తులు మెఱయఁ

ఫళఫళధామ్మని ఫిరంగి • బారులు మ్రోయన్
గల్గితి, జయోత్సవంబునఁ
గులము-'ఫిరంగిణి' యిదియని • కుతుకము నొందన్॥

విశా—ఇది మఱియు చోద్యము.

ఫిరంగి—పూర్వజన్మశుభవాసనచే ఇంత విద్యాగంధముఁ గంటిమి. దేవరవారి శుచిమతదీక్షవిని, ప్రపంచసౌఖ్యముల కాంక్షలేని మాకు ఇంతకంటె తారకములేదని, తమకు శుశ్రూష సలిపి తరింపనెంచి వచ్చితిమి.

విశా—మీరు నవయౌవనవతులుగ నున్నారే! ఏల? ప్రాపంచిక సౌఖ్యములపై నిస్పృహ.

వసుం—సంసారసాగరము ఈఁదఁజాలమని, తాపత్రయంబునఁ చిక్కువడరాదని, ఆముష్మికమునే వాంఛించి, సంఘసేవా పరాయణత్వము పురికొల్ప నదనునిరీక్షించుచుంటిమి. తమయుదంతము తెలిసిన వెంటనే యిటువచ్చితిమి. మమ్ము ఆనుగ్రహింప నమస్కరించుచున్నాము.

విశా—(ఆత్మగతము)
తగుశిక్షనఁ అలవఱచి శిశుపోషణకు ఒకర్తును, ప్రసూతి రక్షణనిమిత్తము మఱియొకర్తును- ప్రపంచముఁ ప్రబోధింప నియోగించినమేలు. (అనుమానముతో) అయినను, వీరిజాడనాకుఁ తెలియదే? (నిశ్చలమనస్సుతో) ఏల యీ యకారణ సందేహము? శుచిమతావేశము ప్రపంచమునంతయు ముంచియుండ ఈ ముగ్ధలను ఏల అనుమానింపవలయు?

వసుం—గురువుల ఆజ్ఞ వేఁడుచున్నాము. దిక్కులేనివారము. దీనబాంధవులరని, ప్రపంచరక్షణదీక్షితులరని, శుశ్రూషసలుపఁ తమ సన్నిధానమునకు వచ్చితిమి. అనుమానముచే నిగ్రహింపఁదగు నీచులము కాము.

విశా—అటులైన, మీరు శుచిమతమునకై సన్యసింతురా?

వసుం—చిత్తము!

విశా—ఇందులకుమీరు, కేలజలములందుకొని శ్రీశుచిమత ప్రచారణార్థము సన్యసించి, యావజ్జీవము లోకశ్రేయమునకై పాటుపడెదమని ప్రమాణము చేయవలయును.

వసుం—అట్లేచేసెదము.

సీ॥ శిశువులఁ జూలాండ్ర • క్షేమంబు నేకూర్చి
స్థితిసూత్రధారియై • చెలఁగునెద్ది
ఆరోగ్యమార్గమే • యాచారమనితెల్పి
స్వాస్థ్యహితముఁబలుకు • స్వస్తియెద్ది
వ్యాధుల తత్త్వంబు • వసుమతిఁజాటించి
తగురక్షనెలకొల్పు • త్రాతయెద్ది

సంఘసేవోత్సాహ • శంఖంబుపూరించి
పరువశారముసూ్ౕదు • ప్రోడయెద్ది
గీ॥ అట్టి శుచిమత మవనిలో • వ్యాప్తిచేయఁ
బాటుపడ సన్యసించెగఁ • బ్రతినఁబూని
శ్రీశుచియెసాక్షిగా నిదే • చేతినీళ్ళు
వదలుచున్నాము జన్మ సా • ఫల్యమొంద॥
(తక్కిన జనులు అట్లే చేయుదురు.)

విశా—పరమసంతోషము.
ఆ॥ శిష్యకోటిః లెప్పుడు • సేవింప నర్పింప
శ్రీశుచిమతసూక్త • చిత్రనిధిగ
నవ్యశాస్త్రవిధులు • నలువొందనిర్మింతు
దేవిశుచికి నొక్క • దేవళంబు॥

వసుం—(జనాంతికము)
బాగుగ నమ్మించితిని.

ఫిరం—(జనాంతికము)
ఇఁక రుచి చూపెదము. మనవారేమైరో కదా? వారిపొలఁపువఁ తెలియకున్నది.
(జవనిక జారును.)

రంగము. 7—కల్యాణపురిపరిసరవనము.

(వసకుఁడు ప్రవేశము, స్వగతము)

గేయము. ఏదిశఁజూడ నేమిచోద్యం బీశుచిమతఫలము
ఎంతవెదకిన సుంతయనుంగుల చెంతనుగననైతి॥ మిత్రీ॥
చింతలఁ జిపుకుచు, వంతలనవయుచు నేపొంతలఁ బోయిరోగా॥ ఏది॥
(ఆలోచించుచు)
మోసము వచ్చెడు వేసములన్నియు నీపురిఁబూనెనుగా
(బింకముతో)
దోసఁగులెన్నైననుఁ బూసఁగినఁగానీ వసకుం డోడునే వీసంబేని॥ ఏదిశ॥

నేనుకొంచము ఆలసించి వచ్చువఱకు వసుఁభిణి ఫిరంగిణులు ఎటకోపోయిరి. తక్కిన వారి జాడలు ఎక్కడను పొడసూపలేదు. ఈ పాడుకట్టడములచే మావారికి ఇచ్చట జీవము దుర్భరముగా నున్నది. (దృష్టి సారించి) ఎవరావచ్చుట? ఆహా మహామారియా?

మహామా—వసకా! యెంతపుణ్యము! నిన్నైనను కంటచూచితిని. ఏమని చెప్పుదును శుచిమతప్రచారము!

వస—అతి తీవ్రముగ నేయున్నది.

మహా—నా ప్రాబల్యమునను వలయు ఎలుకజాతి పోయ పోయెఁగా!

వస—ఎట్లు?

మహా—ఎలుకలకు గృహావసతి వల్లకాదైనదయ్యా! అన్నియుఁగట్టి మిద్దెలే! డాబాలే! కప్పు చూరులు లేకుండా చేసిరిగా!

వసంతుఁడు—అయ్యయ్యో! కప్పు చూరులలో అరణ్యములలో మృగరాశివలె పెరిఁగి, గూడెములు కట్టి, కలకలమంచు, ఉయ్యాలపాటలు పాడుచుండునవే ఎలుకలు! ఇక కష్టమే!

మహా—గోడలకంగయు అద్దమువలె గిలాబు, ఇఁక ఎలుకలు గోడలపైకి ఎట్లు ప్రాకును? తోఁకలు దేనిని ఆధారముగాఁ బట్టి యెగురును? నేల నాపరాళ్ల పఱపు. ఇట్టి గదులలో లోవైపున నేలమట్టమునకు నాలుగు అడుగులయెత్తున నిక్కనున్నవి వెడల్పు పలకలు, వానిపై ఉగ్రాణము.

వసు—ధాన్యపుఁగొట్లకో?

మహా—ధాన్యపుఁగొట్లకుఁగూడ నిట్లే. కొట్లద్వారములను నేలమట్టమునకు మూడడుగులపైనఁ పెట్టిరి.

వస—ఇఁక ఎలుకలకు ఆహారమెట్లు?

మహా—ఆహారము ఎక్కడిది? త్రాగుటకుఁ గూడ ఇంటిలో నీటిచుక్కైన దొరకనియ్యరుగదా? నమిలి రసముతో గ్రుక్క దడుపుకొనుటకైనను ఇండ్ల ఆవరణములలో పచ్చిక పోచైన మొలవనియ్యరు. ఎన్ని పన్నాగములు పన్నినారయ్యా వాటిని నిర్మూలించుటకై! వసకా యేమని చెప్పుదును.

సీ॥ బోనులలోఁ బట్టి • పొరిగొందు రెలుకల
మచ్చెంబు లెరగాఁగ • మచ్చుబిళ్లి
గూడెంపు దొమ్ములఁ • గూల్చెద రెలుకల
సూదులతోఁ జొన్పి • సూక్ష్మక్రిముల
విసము నూదినిపించి • పసదూల్తు రెలుకల
పాషాణములఁ జేర్చి • భక్ష్యములను
పెంటల నేటించి • ప్రేల్చెద రెలుకలఁ
బోతులుఁ దిగులునఁ • బొక్కి చావ

ఆ॥ కప్పు గోడలందుఁ • గట్టిగినమార్పుల
వసన నెలుకగమిక • నెలవు లేదు
ఎలుకమందుకైన • నెచ్చోటఁ గానము
బ్రతుకఁ జాల విచట • వలనఁ బోదు॥

వసుడు—అట్లనా?

మహా—ఒక్కొక యెలుకకు నూటపదార్లు మిన్నలుండెడివిగదా!

వసు—మిన్నలేమి మిన్నలు?

మహా—అక్కలుగలిగి యెలుకలపేలే మిన్నలు. వీటికి రక్తముదప్ప వేరేమియు రుచింపదు. నాసోదరుడు చేత ఈ యెలుకలు చనిపోవుచుండెడివి. మిన్నలకుమాత్రము నాసూక్ష్మక్రిములనుండి అభయ హస్తము మృత్యురాణి యొసఁగె.

వసు—అట్లనా?

మహా—ఒక్కయెలుక నాబారిఁబడి చావఁగనే, నూటపదార్లు మిన్నలు నా సూక్ష్మక్రిములతో నిండిన పొట్టలతో, రక్తాహారమునకై మానవుల పాదములమీఁదికి చెంగలించి, కఱచి, రక్తమును పీల్చి, ఆ కాట్లద్వారమున ఆ సూక్ష్మక్రిములను గ్రక్కి, మానవశరీరములో ప్రవేశింప చేయును. ఇదిఅంతయు ఇకమీద కలలోనివార్త, ఎలుకలుండినఁగదా మిన్నలు? మిన్నలు లేనిదే స్వయముగా మానవాంగములలో నా సూక్ష్మజీవులను ప్రవేశపెట్టి బొబ్బలవ్యాధిని పుట్టింపఁజాలనుగా? ఎలుకలు దట్టముగా ఉన్న దేశములకే వలసఁబోయెదను.

వసు—ఎవరావచ్చుట? మన్నెజ్వరమా! యేమి నాయనా నీవును పాలిపోయియున్నావు?

మన్నెజ్వ—ఇంకను ఎట్టులొ బ్రదికి ఉన్నావనుము.

మహా—నీకుఁగూడ నాకువచ్చిన దుర్గతియా?

మన్నె—నా ప్రాణమునకు ఆధారమై నా సూక్ష్మజీవులను కడుపుపొరలలోఁ బెట్టుకొని, పెంచి, పెద్ద చేసి, పెండ్లిచేసి, తామరతంపరగా తమకడుపుపొరలలోనే గుంపులుగావృద్ధిచేసి, నరులను తొండములతోఁ బట్టినపుడు తమతొండములలోఆడుకొనుచుండెడి నాముద్దుపాపలను మానవరక్తములోఁ జేర్చి నాకు ప్రాబల్యమును గూర్చు దోమలకు ఇపుడు జీవించు నుపాయములేకుండఁ జేసిరిగా?

వసు—ఎట్లు?

మన్నెజ్వ—

సీ॥ మన్నెపుం బరలలో ♦ మశకముల్ మసకుండఁ
దగుసూట కాల్వలఁ ♦ ద్రవ్వినారు
దొరువుల దోఁగాడు ♦ దోమపాపల మ్రింగ
వైరిమీనంబుల ♦ వదలినారు
గునగున నడయాడు ♦ గనిదోమల నడంప
గబ్బునూనెను నీటఁ ♦ గలిపినారు

సరముఁగూర్పులు పోలె ♦ దరిజలంబులనూఁగు
మశకాండవాసముల్ ♦ మాపినారు
గీ॥ దోమ చొరఁగకుండ గేహంబు ♦ లోమినారు
దోమజీవించు తెఱఁగింకఁ ♦ దోఁపదయ్యె
మనుజులకు నోడి శుష్కించె ♦ మన్నెజ్వరపు
నిలువగతిలేక వలసఁ బో ♦ వలసె నకట.

(సన్నిపాతము గుండెలు మోదుకొనుచుఁ బ్రవేశించి మన్నెజ్వరమును గాఁగిలించుకొనును. వసనుఁడు ఉభయపార్శ్వములవారికి మధ్యనుండును.)

సన్ని—సోదరా నీవువచ్చితివా?

మన్నెజ్వ—ఎచ్చటనైన ఒకటి, అర, దోమలుండినను అవి చేరరాకుండ మంచములపై దోమతెరలు వేసికొనుచున్నారు. శరీరములలోఁ జొచ్చిన నాక్రిములను "క్వైన" ప్రయోగముచేత అంతమొందించినారు. ఇండ్లవాకిండ్లకు, కిటికీలకు, దోమ చొరరాని సన్న కంతల రేకుల చట్టములు వేయుచున్నారు. ఇంక నేను నిల్వఁజాలను.

మహా—మాగతియు మీవఁ బట్టినదికాఁబోలు.

వసను—నిజమే?

సన్ని—అయ్యో! వసనా! నాదుస్థితి యేమనివక్కాణింతు. (విషూచి ప్రవేశించును)

సీ॥ యంత్రమూలమున న ♦ ద్యాదులనీరంబుఁ
తేరిచి వడగట్టు ♦ తెఱవులమరె
నిర్మలోదకము పా ♦ నీయార్థమెల్లెడఁ
బ్రవహించు గొట్టముల్ ♦ బరిఢవిల్లె
విచ్చుకత్తులతోడ ♦ వచ్చి చుట్టును గాఁచు
వారి రక్షక భట ♦ వ్రాతమొనరె
మాక్షిపూఛ్చియడంచి ♦ మాలిన్యముడిగించు
శుచివిధుల్ సర్వత్ర ♦ శోభనలరె
గీ॥ త్రావుజలమున లోఁజొచ్చి ♦ ప్రేవులందుఁ
దవిలిప్రబలెడు నాకింకఁ ♦ దాపులేదు
నాదు 'విఱుపు పాలె' ల్లెడ ♦ నరులఁగాఁచు
వసన! గతివేఱె లేదింక ♦ వలసదప్ప.

విషూచి—(రోఁజుచు) అయ్యో! వసనా! అమ్మా మహామారీ! మిమ్ములఁ జూడకరయి కడతేఱెద నేమో అనుకొంటిని. సన్నిపాతము చెప్పినట్లు మా సూక్ష్మక్రిములకు నీటిలో వసతి లేకపోయెనుగదా? ఇదేమిచిత్రమో! ఈఁగపురుగు ఈ దేశములో మొదలంట నశించినది.

వస—ఎంగిలి మెతుకులను ఏఱుకొనితిని బ్రతుకు ఈఁగలనుఁగూడ వసతి లేకుండఁ జేసితిరా ?

(తుపాను జ్వరము ప్రవేశించును)

విషూచి—ఏమి యేర్పాట్లు ! ఏమి కట్టుదిట్టములు ! అన్నముఁ దినునపుడు ఎంగిలి మెతుకులు దిగువఁబడనీయఁగూడదనిగదా వైద్యవిద్యాధికారి శాసనముచేసెను. ఇఁక నెంగిలి యొకవేళ దిగువఁబడినను, దానిని ఊడ్చినకసవును, ఎంగిలిఆకులనన్నిటిని, ఎప్పటి వప్పుడే, ఏయింటివి ఆయింటి పెరటిలోనే, కాల్చి బూదిచేసెదరు. మటపాత్రలలోవచ్చిన అంట్ల మెతుకులనుకూడ అట్లెచేసెదరు. ఇఁక వంటయిండ్లలోనా ? ప్రొయ్యిమీఁదఁ గూరలు పెట్టకముందే, పచనముచేయుటకు మునుముందే, కూరగాయలనుండి తీసివైచెడి పెరకు, పీఁచు వీటిని ముందుభద్రముగాఁ గాల్చి, తర్వాత కూరగాయలు ప్రొయ్యిపై నెక్కించవలయునని శాసనము.

ఇండ్లమూలలలోఁ గసవుప్రోవులు లేవు. దొడ్లలోఁ బేఁడకుప్పలు కానవు. వేయేల ! యిఁటి మాలిన్యమంతయుఁ బెరటిలోఁ గాల్చివేసెదరు. మురుగుకాల్వలకెల్ల మూఁతలు. మాలిన్యము తోడివేయుటకు యంత్రములు. ఇండ్లలో మురికి గోతులు లేవు. ఇఁక నీఁగ గ్రుడ్లు ఎచ్చటఁ బెట్టఁగలదు. అవి యెచ్చట పిగులును. పిల్లపురుగు లెట్లు బ్రదుకును.

వస—మహాచిత్రము !

విషూ—ఇఁక నొక్క వింత. బెల్లపు పాకులో జిగురు, పాషాణముఁ గలిపి పూసిన కాగితముల నుంచెదరు. చెంతనుండు ఈఁగలు బెల్లముమీఁది ఆసచేతపోయి ఆ జిగురులో కాళ్లు తగుల్కొని నశించిపోయినవి.

మహా—ఏమి మోసము ! ఇఁక వలసలు పోవుటకంటె వేఱే యుపాయములేదు.

విషూచి—

తే॥ గీ॥ చర్మవస్త్ర నిర్బంధమై • సాగుకతనఁ
బ్రజల కిచట • విషూచిచే • భయము లేదు
ఈఁగ గాలించి చూచిన • నెందు లేదు
వలస లేఁగంగ వచ్చెఁగా • వసకు నేఁడు॥

(పోలేరమ్మ ప్రవేశించును)

పోలే—ఓహో ! యిచ్చట నున్నారా ! మీకొఱకుఁ దిరిగి తిరిగి వేసారితిని.

మహా—మా అవస్థ లిట్లున్నవి. ఇఁక నీచరిత్రము ముందుగాని!

పోలే—ఏమి ఈ ప్రజలపరిశుభ్రత ! సచ్ఛీలము ! టీకాలు వేయించుకొను కట్టుదిట్టములు ! నా ఆటలు సాగనిచ్చినారుకారు. దూరదేశమునకుఁ బోవలయునని సంకల్పించికొని మీతో నావార్త చెప్పవచ్చితి.

తే॥ గీ॥ గృహములు లెయ్యెడనైనఁ గ్రి • క్కిఱిసి లేవు
ఆఁకలిని మాఁడు వార • లెందైన లేరు

కలుగు శిశులకు టీకాలు • కవచమాయె
నిలువనీడలే దిటనాకు • వలసఁబోదు॥

తుపాను—వసకా! అన్నలారా! అక్కలారా! నాకును పేనునకును అటులే ఋణానుబంధము తీర్చినారుకదా? నేను, మహామారి అక్క మిమ్ము కడుపులో వర్ధిల్లునట్లు, పేలపక్షిలో వృద్ధిబొందవాఁడఁగదా? ఎట్టి నిర్బంధములగు ఆరోగ్యచట్టము లొనర్చినారబ్బావారు? ఎట్టి విశ్వాసముతో ఆచరించెదరు ఈ నిమ్నజాతిప్రజల అకట్టుదిట్టముల? ఏమరిన, ఎనుబదిమంది తలల లోని రక్తము రుచిచూచి గునగునమటుఁగగు పేనును రూపుమాపినారే జనులందు! పేలేలేనంత తీవ్రతరదీక్షయున్నప్పుడు కట్టువస్త్రములు శుభ్రముగ నుంచుకొనరా? స్నానములు వేళవేళఁ దప్పకుండఁజేయరా?

వస—చేయకేమి! నేనుఁజూచితిని. ఎన్నికొళాయీల స్నానఘట్టములు. ప్రత్యేకము ప్రత్యేకముగా స్త్రీలకుఁ పురుషులకుఁగూడఁ గాక వయసునుబట్టియుఁ సంఘములనుబట్టియుకూడ. తర్వాత

తుపా—ఇఁకఁ చీరపోతు లెక్కడివి? నాకు ఆధారముగా నుండు పేలుఁ చీరపోతులు ధ్వంసమైన నేనేమి చేయుదును.

సీ॥ ఎటనేఁ బ్రవేశింప • నటఁ దిరుపతిబోడి
బదు లనకజరుగుఁ • బల్లెపల్లె
సీమంతినులునట్లు • చేసికోలేమిచేఁ
కిరసిను నూనెను • గురులఁజటిని
దువ్వి, పేలవెదకి, దూపి, • యూర్పెనసీర్చి,
యారు ప్రొంకి, నా • బారిఁబడరు
అంత్యజు లెల్లెడ • నాచారవంతులై
మడుఁగు వస్త్రంబులే • ముడుచువారు॥
ఆ॥ శ్రేణిగట్టి రక్త • సిరలలో విహరించి
ముద్దుపాముల బలె • మురియు సుతుల
నూదికొట్లఁ జొచ్చు • శుద్ధియాపాషాణ
వస్తిచయముఁ జంపె • వలసబోదు॥

మహా—వసకా జనసంఘుంబునం దేమాత్రము గలవరముఁ బుట్టింపక మృత్యురాజ్ఞి ఆజ్ఞలఁ జెల్లించువారలు నీవును, మసుంభిణియు, ఫిరంగిణియు. మీరు దప్ప ఈ శుచి మతము భేదింప మాకు సాధ్యము కాదు. మఱియు మాకు గృహావాసకములగు జంతువాహనములయొక్క ఆవశ్యకతయు లేదు. తగు నుపాయము చే మీరు మువ్వురును యోజించి శుచిమతమును నిర్మూలింపవలయు.

అందఱు—వసకా! కుసుంభిణీ ఫిరంగిణులతో మా మాటగా నిట్లు చెప్పుము.

మన్నె—సీ॥ వ్యాధుల మార్గముల్ • శోధింప బోధింప
సర్వకళాశాల • వర్ధిల్లెననుము
సన్ని—ఎలుకలీఁగలు దోమ • లిసుమంత చొరరాని
వింత గృహంబులు • వెలసెననుము
విషూ—జనసంఘములను నీచి • చనెడివారలతోడఁ
కుష్ఠరోగాదులు • గూలెననుము
పోలే—ప్రాణంపుఁ గారికర • వ్రాతంబు నశియింప
వలసపోయెడు వేళ • వచ్చెననుము।
మహా—ఆ. జనుల నేమఱించు • జాణలీవు కుసుంభి
ణీఫిరంగిణులును • నిల్చిరనుము
తుపా—మృత్యురాణి నింక • మెప్పించు ముచ్చట
మీకు మవ్వారకును • మిగిలెననుము ॥

అయ్యో! వసకా! యింక మేమిచట నుండఁజాలము. శుచిమత ప్రచారమునకు బాహ్యముగా నుండు ప్రదేశములలో ఎట్లో కాలము గడపుచుండెదము. శుచిమత దుర్గభేదనమునకై నిరీక్షించుచుండెదము.

వస—అట్లే! నేనును పోయెదను. మీ రింతగా భయపడ నవసరము లేదు. త్వరలో మనవారిని గలిసికొని పర్యవసానముఁ దెలియఁ జేసెదను.

(నిష్క్రమింతురు.)

రంగము. 8.—శుచిమత ప్రాంతము (కుసుంభిణి, ఫిరంగిణి ప్రవేశింతురు.)

ఫిరంగి—అక్కా? కుసుంభిణీ? మనము చక్కఁగా అవిశారద మాయావిని బేలుపుచ్చితిమి.

కుసుం—ఎంత మోసగాఁడె! శుచిమతమట. ఆత్రేయధన్వంతరులు మతమొకదానిని కల్పించి దానికై విశారదుని జియ్యంగారుగా చేసి ప్రపంచము నంతయు భ్రమింపజేసిరి. ఇఁక నీ సన్యాసి శుచిదేవి, ఆలయ ప్రతిష్ఠాపనముఁ జేయునఁట. ఇప్పుడే కట్టడముల మార్పులచే ఎలుకలకు దోమలకు ఎడము లేక మహామారియు మన్నెజ్వరమును పలాయితులైరి. (వసకుఁడు ప్రవేశించును.)

ఫిరం—ఎవ్వరావచ్చుట? వసకుఁడుగాఁ దోఁచుచున్నది. తమ్ముఁడా యేల వచ్చితివి?

వస—అమ్మలారా! యేమని తెలుపుదును? శుచిమత ప్రచారముచే మన్నెజ్వరము మశూచి, విషూచి మహామారిలోనుగాఁ గల వారు నన్నుఁజేర బిలిచి వసకా? ప్రపంచమందు సంఘములందేమాత్రము గలవరమును బుట్టింపక శ్రీమృత్యురాజ్ఞి ఆజ్ఞల మెప్పించువారలు కుసుంభిణిఫిరంగిణియు నీవును దక్క నితరులు లేరు. మేము వలసపోవలసినట్లాయె. మృత్యుమహారాజ్ఞి ముద్దు చెల్లించు

ముచ్చట మీ ముప్పురకే మిగిలెనని చెప్పిరి. ఈయుదంతము మీకు నివేదించి కర్తవ్యము గనుఁగొనవచ్చితి.

ఫిరం—ఏమేమి! మహామార్యాగులు వలసఁబోయిరా?

వసుం—అయ్యయ్యో! పోవుటకు కాళ్ళాడకున్నను వలసఁబోక తప్పనట్టి స్థితులలో పరితపించుచు తరలు నపుడు,

సీ॥ వ్యాధుల మర్మముల్ • శోధింప బోధింప
సర్వకళాశాల • పర్వె ననుచు
ఎలుక లీఁగలు దోమ • లిసుమంత చొరరాని
వింతగృహంబులు • వెలసె ననుచు
జనసంఘమునువీడి • చనెడివారలతోడఁ
గుష్ఠరోగాదులు • కూలెననుచు
ప్రాణంపుఁ బదికర • వ్రాతంబు నశియింప
వలసఁబోయెడువేళ • వచ్చె ననుచు
ఆ॥ జనుల నేమఱించు • జాణలీవు కుసుంభి
శ్రీఫిరంగిణులును • నిల్చి రనుచు
మృత్యురాజ్ఞ నింక • మెప్పించు ముచ్చట
మీకు ముప్పురకును • మిగిలె ననుచు.

అనివచించిరి,

ఫిరంగి—మహాగర్వాయత్తులు. వారలకాకీర్తియెటుల వచ్చును?

కుసుం—మనకు, కంచుకములు మాత్రము రాణిగారు ఇచ్చినపుడు ఎటుల దాచికొనుచుండిరి, అనలుగురును వారికంతహారబహుమతులను. మాటిమాటికి వాఁపుదీరఁగాంచి మురియుచుండిరే?

ఫిరంగి—మన మీరిత్తమాటలతో కాలవిలంబనము సలుప నేల? వసకా? తెలియుఁగదా? మేమీమతము లో శిష్యరాండ్రమైనది. ఇచ్చట సమయము గనిపెట్టి విశారదుల పంచించి వారిని వారిమతమును భ్రష్టుజేసెదము. ఏల రిచ్చపడియెదవు? మేమువేసిన పునాది సాంతముగా వినుము. (చెవిలోఁ జెప్పును.)

వసు—భేష్! ఇఁక శుచిమత మనదెంత!

కుసు—కనలేదా నాప్రయోగము? జోడుజీడిగింజల నంటి నా సూక్ష్మరూపముతో.

సీ॥ ముచ్చట దీఱంగ • మూనాళ్ళబ్రోదితోఁ
గుసుమంబు విరియింతుఁ • గులుకుసడల
జాగరవ్యసనుల • రోగి నాప్రజ్ఞను
గీర్తింపవాపింతుఁ • గీళులెల్ల

శోణితనిర్ఝరిం • జొచ్చి హృత్కమలంబు
నల్లదొవ్వలఁ జుట్టి • నమల్పైతు
ద్వారముల్ గ్రొత్తగా • వాటంబుగా విచ్చి
సృష్టికిఁ బ్రతిసృష్టి • సేయుదాన
ఆ॥ జననవేళ శిశుల • కనులలోపలఁ జొచ్చి
పుట్టుగ్రుడ్డితనము • పెట్టఁగూర్తు
వంధ్యతనముఁ దెత్తు • బ్రహ్మ నేవంచించి
స్త్రీత్వపుంస్త్వములకుఁ • జేటొనర్చి॥

ఫిరం—

మ॥ మరునున్మాదము రేఁగ, నంధులయి, దు • ర్మార్గంబులం బోవు నా
నరులన్ డీకొని యెత్తుదున్ వ్రణపు బెం • డా నొక్కమాసంబునన్
బిరుసుంబిళ్ళలగుండ్లు బేర్చు నవచేఁ • బ్రేల్తున్, దురిన్ శల్యపం
జరమున్ గ్రంతలనింతు గ్రుడ్డితనమున్ • జచ్చున్ గడుంగూర్చెదన్॥

తే॥ ముద్దుమోవి నాగరిడీల • విద్దెలావు
ఒక్కపంటి నొక్కుఁనదూసి • సొక్కడంతు
సర్పరూప సూక్ష్మక్రిముల్ • సరసకేళిఁ
బల్లవులకు నేనొసఁగు ను • పాయనములు॥

వస—నేనా?

సీ॥ చర్మంబు నరికట్టి • సర్వత్రపొంచుంతు
నవరంధ్రములవజ్జ • నాదు నేన
చర్మంబు విచ్చెడి • సర్వరోగములకు
సన్నిహితుండనై • చనెడివాఁడ
మహిమనే జూపింతు • మధుమేహమ్ముఁగూడి
రాచబిరుదుఁగొన్న • వ్రణము గొల్పి
ప్రభువనై యేలెద • వ్రణరోగ సైన్యాద్య
జృంభణసత్త్వముల్ • జిన్నవోవ
ఆ॥ ద్రాక్షగుత్తివోలు • రమ్యతరాకృతి
వ్రణపు స్రావములను • గ్రాలుచుండు
భూతిములను నాల్గుఁ • బూరికిన్ గొనఁగాని
శుచికినోర్వఁ జాల • నెచటనైన॥

ఫిరం—

గీ॥ చనుమ కల్యాణపురికీవు • సత్వరంబ
వైద్యరాడ్సేవకుండవై • భక్తికలన
మెలఁగి యాత్రేయ ధన్వంత • రులను గెడపు
యత్న మప్రమత్తతఁ జేయు • మన్న వసర॥

పసుఁ ఖి—మేమున్నాం,

తే॥ బోడిసన్యాసి బిగువును • బుంగకెత్తి
కంచుదట్టీల పోడిమి • చించివైచి
కీలుబొమ్మను గావించి • కేళిఁదూల్చి
మంటఁ గల్పెద మీతని • మతము తోడ॥








# తృతీయాంకము.

---

స్థలము:—కల్యాణపురము – శస్త్రచికిత్సశాల.

(రంగస్థలమున శస్త్రపీఠముపై, రోగి పరుండబడియుండును. వ్రణచికిత్సోపకరణములు సిద్ధము చేయఁబడియుండును. వసకుఁడును, శస్త్రచికిత్సాశాలలోని సేవకుఁడునందుందురు.)

సేవకుఁడు—వసకా! నీవు ఇచ్చటికివచ్చి కొన్నిదినములైనకాలేదు. మా దొరలకెల్లరికి ఎంతోనమ్మకమయిన బంటువయితివోయి? చాల సంవత్సరములనుండి చక్కఁగ పనిచేసినవాఁడను. అనుభవశాలిని. నీవు ఇచట పాదముమోపిన ఆఱునెలలు మొదలు నన్నుపిలిచినారే నా ప్రభువులు! తక్కిన పని వారిని పాటింపరే! దేనికిని నిన్నే వసకా! వసకా! అని పిలుతురే! నీవు ఎంతమాయలమారివిరా!

వసకుఁడు—(పృష్ఠిమీద చేయివేసి)—ఓయి ముదుసలీ! నీవును తక్కినవారును కలసి నన్ను ఏమిచేయఁగలరు? నీ చూడలేనితనమును దొరలకు జెప్పి నిన్ను ఏమిచేయింతునో చూడు! ఏమి! యెవఁడనుకొన్నావు?

సేవకుడు—ఏమో! పెద్దవాఁడను. పెద్దసంసారము గలవాఁడను. నీ పుణ్యము. నా జీవనము పోగొట్టకయ్యా! అపరాధిని. (చెంపలు వేసికొనును.)

వస—(బింకములో) సరే! నేఁటికి మన్నించితిని. ఊరక పేరు వచ్చునటయ్యా? శ్రీధన్వంతరిదేవుని శస్త్రచికిత్సవ దినమునను నూఱుకత్తులు చక్కఁగా పదనుపెట్టి తక్కిన ఆయుధములు, వ్రణచికిత్సోపకరణములు, కనుసన్నల కదలకుండ అందిచ్చుచున్నాను. నేను నిద్రపోవుటలేదు. చూచితివా! ఆత్రేయులవారికి తొమ్మిదిబండ్లు తులసిని పచ్చిరాసి దేశములద్రిమ్మరి వాడిపోకుండ తెచ్చియున్నాను. (తలయూఁచుచు) యోగ్యతనుబట్టికదా? విశ్వాసము! ఆదరణము. సరే నీవు నిర్మలజలము నాయత్తపఱుపఁబొమ్ము.

(సేవకుఁడు నిష్క్రమించును)

(ఆత్మగతము) ఇన్నిదినములకుఁ గదా అవకాశము దొరకినది. ప్రాంతమాత్రన ఈ బల్ల ఆదరి పడునట్లు యుక్తిబన్నెదను.

మ॥ కాంతుల్, గోఁతలబల్ల కాళకొలికగ్రద్ధం బీశిలాలేశముల్
జూతుల్, శస్త్రగృహంబువీడి వెలికిన్ బోవన్ మృషాసంజ్ఞలన్

క్రమ్మోఁతక్, ధామ్మనిపింతు పీనిరుధిరం • పుంగ్రోవులల్లాడఁగన్
జేతంబుల్కిఁపడంగఁ గత్తిబెడియన్ • జేసేఁతఁగా ట్లేర్పడన్.

ఆ॥ కత్తికాట్లఁ జొచ్చి • కడిమి మడియులు
గరళసన్నిభరస • కరులు పేర్చి
క్రిక్కిఱిసి పెరుఁగుచు • వృక్కోత్కరంబుల
మిత్తికడకు నిడని • మొత్తఁగలరు.

మోహనౌషధ ప్రయోగకుఁడు, సహాయులు ముందుఁ బ్రవేశించి తమతమ స్థానముల నిలిచె దరు. పిదప ధన్వంతరి ప్రవేశించును.

ధన్వంత—వసకా! రాజవ్రణ చికిత్సకు సర్వము సిద్ధమా?

వస—సర్వము సిద్ధము.

ధన్వం—అయ్యా! మోహనౌషధ ప్రయోగకా! ఇపుడు ప్రారంభింపుము. రోగికి హృదయవ్యాధి లేదుగదా? చేయవలసిన తక్కినపరీక్ష లన్నిటిని గావించితివే!

మోహనౌ—చిత్తము! ఇతనికి హృదయ వ్యాధి యేమియు లేదు. కాని చక్కెర అధికముగా నున్నది, కొంచెము మందముగా నున్నాఁడు. మధుమేహపు సైక మింకను ప్రబల లేదు.

వసకుఁడు సైకపు ప్రయోక్తను తనకడుపులో అధికముగా నొప్పియుండునట్లు సైగ చేసి తాను శస్త్రగృహమునుండి బయటికిఁ బోవును

ధన్వం—(చేతులు కడిగికొనుచు విషజీవసంరోధక ద్రావకమునఁ జేతులు ముంచుచుఁ బ్రత్యేకపు టంగిఁ దాల్చుచు) (స్వగతము)

శుచిత్వసాధన సంపత్తియేగదా శస్త్రవైద్యుని హస్తవాసికిఁ గారణము?

సీ॥ నఖములు కుఱుచలో • నర్చి హస్తంబులు
సబ్బు, బురుసులతోఁ • జాలఁదోమి
విషజీవఘాతి సా • వీరంపు ద్రవమందుఁ
గరములు బల్మాఱు • గడిగి కడిగి
తీక్ష్ణంపుటావిరి • తెర్లులో శుద్ధమౌ,
స్వచ్ఛంపుటంగీని • సమరఁదాల్చి
శస్త్రోపకరణముల్ • శస్త్రసహాయులు,
శస్త్రగృహంబును • శస్త్రపీఠ
॥ సర్వమొప్పఁ దీఱ • శారదపూర్ణిమా
జ్యోత్స్నవోలెఁ దన్నుఁ • జుట్టి వెలయ

నమృత కర విహారి • యామయంబులఁ జెండ
స్వాస్థ్య శస్త్రరక్ష • జయముగనఁడె.

ఆహా! మోహనౌషధముచే లాలితుఁడై, నిమీలితనేత్రుఁడై, యీ వ్యాధి గ్రస్తుఁడెంత సేవ్యుఁడై యున్నవాఁడు!

గీ॥ క్షీరవారాశి భక్తాళి • సేవ్యుఁడగుచు
యోగనిద్రాభిరతినుండు • నాగశయను
శోభనున్నాఁడు మైకపు • సుప్తినితఁడు
వృత్తు లుడుగ సాక్షిగ నాత్మ • వెలుఁగుచుండ.

సత్వరగ శస్త్రక్రియ చేసెదఁగాక!

(శస్త్రక్రియ సంపూర్తి యగునపుడు నేపథ్యమున ధ్వని. బల్లజారిపడును. ధన్వంతరి యుల్కి పడును. అప్పుడు కత్తిబెడిసి యెడమచేతి రెండవ వ్రేలిపైఁ బడి గాయ మగును. వెంటనే ధన్వంతరి శస్త్రపీఠినుండి వెడలి పసుపునఁబోయి చేతులు కడిగికొనును)

ధన్వం—ఏమియిది! శస్త్రశాలయొద్ద కీచప్పుడు! ఈతొందరలో నాకు గాటుగా వ్రేలు తెగినది. వ్రణచికిత్స సంపూర్ణముగా ముగించితిని. ఓయి సహాయకా! నీవు రోగికి కట్టుగట్టి లోపలికి ఎత్తించుకొని పోయి మంచముపై పరుండఁ బెట్టింపుము.

(శస్త్రపీఠమునకు ముందువైపున యవనికజారును. మైకప్రయోక్తయు ధన్వంతరి మాత్రము రంగస్థలినుందురు.)

(కారపు ద్రావకములో నొక పుడకనుముంచి గాయమును కాల్చికొనుచు)

అయ్యా! మైకప్రయోక్తా! కారపుద్రావకముతో నా వ్రేలిగాయముఁ జక్కఁగాఁ గాల్చితిని. కట్టుగట్టుము. (అతఁడు విధ్యుక్తముగ కట్టుగట్టును) ఆహా! అప్పుడే ఆరాచపుంటిలోని విషపురుఁగులు నా వ్రేలికొటునందు విజృంభించుచున్నవి.

చ॥ ఇదియదియంచుఁ జిత్తమున • నెంచఁగరాని వికారమెంతయుం
బొదలె, విషక్రిమి ప్రకర • ముల్ రుధిరంబున విస్తరిల్లె, ది
క్కుదరియుఁ దోఁపదాయె, ముఁలు • కోల్ జుఱుకెత్తఁగఁ గ్రుచ్చినట్లున
న్నదవదసేయు నొప్పియక • టా! భుజమూలముఁ జీల్చివైచుచున్.

గాయము సోఁకినది మొదలు ఇరువది నాలుగుగంట లయినపిదపఁ గనఁ బడవలసిన లక్షణము లన్నియిప్పుడే పొసఁగినవి. అబ్బా! ఈ వేదన యెంత విజృంభించుచున్నది. (ఒక ఆసనముపై నొఱఁగి)

ఉ॥ ఝల్లని మించుతీవెలుగ • సల్పులు సారెకు నీక్షతంబునన్
బెల్లుగ నుప్పతిల్లెఁ జ[illegible] • వెంపరలాడెడు నాల్కయెండెడున్
భల్లము నాఁటినట్లురరు • పార్శ్వములన్ శిరమూఁడిపోయెడున్
గల్లయొ! శస్త్రజీవులకు • గండము స్వీయకరాపరాధమే!

ఈ లక్షణములు మఱియు విపరీతములైనవి.

చ॥ కనుఁగవ నశ్రుబిందువులు • గ్రమ్మెడు, గ్రుడ్డులు భారమయ్యెడున్
బెనమున వేచుమాడ్కిఁ దల • వేండ్రము తెన్నత మంటలూఁదెడున్
అనలపు టూర్పులోష్ఠముల • నార్ద్రితఁ బిల్చి దహించి వైచెడున్
దనువు వడంకెడున్ హృదియుఁ • దట్టువ శీఘ్రగతిఁ గ్రేళ్ళు వాఱెడున్॥

కొంచెము జలముఁగొనితెండు. నన్ను విశ్రాంతి మందిరమునకుఁ గొనిపొండు.

(అటులె చేయుచుండ)

ధన్వం—వసకా! వాఁడెక్కడ?

మోహనా—తాము శస్త్రక్రియ ప్రారంభించినప్పుడు సైగతో వెలికిఁబోవ ననుజ్ఞవేఁడెను. బయటికి పోక తీఱని సంకటములున్నట్లు వాని ముఖలక్షణములు సూచించెను. మిమ్ము విశ్రాంతి గృహమునకుఁ జేర్చి, యీధ్వనికి కారణము విచారించెద.

(ధన్వంతరి మోహనౌషధ ప్రయోక్తలు నిష్క్రమింతురు.)

(వసకుఁడు పునఃప్రవేశము)

వస—చేయవలసినది చేసితిని. ఆత్రేయుఁడు మిగిలియున్నాఁడు. వానిపనిబట్టించి పాఱిపోయెద. విషజీవశోధనమందిరమున నున్నవాఁడు. మా సూక్ష్మజీవులను పెంచి మూలికౌషధ, విషపాషాణాదులచే సాక్షించి, విదళించి ఆనందమొందుచున్నాఁడు. చూతము!

(నిష్క్రమించును)

స్థలము 2.—కల్యాణపురి—విషజీవశోధన మందిరము.

ఆత్రే—(స్వగతము) వసకుఁడు కడుయోగ్యుఁడు. అశక్యమగు తొమ్మిదిబండ్లు పచ్చితులసిని అవలీలఁగ ఒక దినములో ఎటనుండియో కొనితెచ్చెను. వానికిఁ దగు బహుమాన మొసఁగవలయు. నేఁటికిఁ గదా? నాతులసీ పరిశోధనము సఫలమయ్యె.

(వసకుఁడు గుప్తముగా ప్రవేశించి యొక్క ప్రక్క నొదిగియుండును.)

ఆత్రే—

ఉ॥ చేసితిఁ బట్టివంట తుల • సీలవణంబును బొందరేఁబవల్,
మోసితి జాగరంపు వ్యథ • మూఁడుదినంబులనుండి, నేఁటికిన్
దీసితి నిద్దయైన, శుచి • దేవికృపన్ సుధయై, గదాధ్వరో
ల్లాసకమూలికా విజయ • లాంఛనమై, భువిఁ బ్రోచుగావుతన్॥

వస—(వెక్కిరింతతో) (స్వగతము) ఏమీ తులసీక్షారముఁ దీసితిమని మురియుచుంటిరో! ఇదివఱకుఁ దీసిన అసంఖ్యాకములైన మూలికాక్షారములగతిగాక, దీనికి ప్రత్యేకపట్టాభిషేకమగునో?

ఆత్రే—(స్వ) ఈ తులసీకషాయముచేతనే యీ గాజుగొట్టములలో పెరిగిన వివిధ విషజీవుల నొంచి చూచెదఁగాక. ఈ సూక్ష్మక్రిముల సముదాయము లెంత త్వరలో వృద్ధినొందినవి.

(వసుఁడు పెదవిగఱచి యూఁగుచుండును.)

ఆత్రే—(స్వగ) (వేర్వేఱ నిరూపించుచు)

సీ॥ రక్తసారమునందుఁ • బ్రబలు నీయవి సన్ని
పాతంబుఁ బుట్టించుఁ • బాపి క్రిములు
మాంససారమునందు • మనునివ్వి సెగజబ్బు
వెల్లువల్ జల్లించు • విస్ఫుర క్రిములు
ప్రేవుసారమునందుఁ • బెంపారు నివి విషూ
చీవ్యాపకము సేయుఁ • జెనటి క్రిములు
నేతిసారమునందు • నెగడు నీయవి మహా
మారిని సోఁకించు • మూల క్రిములు
ఆ॥ వీనిఁ గల్వమందు • వేర్వేఱుగా నూఱి,
చంపి, యుచితమాన • చర్మవస్తిఁ,
దనువుఁ జొన్ప రోగ • తతి నిరోధకములై
భావికాల రక్షఁ • బ్రబలఁజేయుఁ॥

వసు—(స్వ) ఓ కటికవాఁడ! ఈ కూనలను గాజుగొట్టములఁ బెంచి చంపి (కార్పణ్యముతో) ఔషధము చేయుటకు తలపోయుచున్నావా? (ఉద్ధతితో) వేచియున్నాఁడను.

ఆత్రే—(స్వగ)

కం॥ కవచముఁ దాల్పఁగ వలయుఁగా
బవరమునకు నేఁగువేళఁ • బ్రథమంబందుఁగా
నవరుక్పరీక్షణంబున
కవశ్యమగు చేమారక్ష • యట్టులె మొదటఁగా॥

(వసుఁడు ముక్కుమీఁద వ్రేలిడుకొని తుస్సురనుచు, ఆత్రేయుని మొగము తేఱిపాఱఁ జూచుచుండును.)

ఆత్రే—(స్వ) కావుననే అప్పుడప్పుడు వీనిలో ప్రాణాపాయకరములగు విషజీవుల నిరోధకరసములను చర్మవస్తి చేసికొనుచున్నాను.

(ఒక గాజు గిండిని చేఁ దీసికొని)

ఇయ్యది స్ఫోటక నివారకద్రవము. మూఁడు దినములక్రిందట ఇటనుంచి మఱచితిని. ఇంక ఆలసించిన దీనిగుణము క్షీణించును. కావున

గీ॥ స్ఫోటక నివారక చికిత్సఁ • బొంది పిదప
పూత తులసీరసక్షార • పూర్ణమహిమఁ
జెనఁటికాక్రిమిగణములఁ • జెండివైవ
శోధనప్రక్రియకుఁ బూనికఁ • జొరెదఁగాక॥

సారాయుపుదీపమును వెల్గించును. సబ్బుబురుసులతోఁ జక్కఁగా చేతులురుద్ది కడిగి తుడిచికొనును. కాట్లవాదరను, కడ్డీదుబ్బను ఆదీపముపై కాఁచి, కాల్చినభాగములు పైలసోఁకకుండ, జాగ్రతగా చల్లార్పుటకు, పిడిని, కడ్డిని అగ్గిపెట్టెను ఆధారముగాఁ జేసియుంచును. ఎడమముంజేతిని సబ్బుతోఁ జక్కఁగాఁ గడిగి పరిశుభ్రమయిన తుండుగుడ్డతోఁ దుడిచికొనును. పిదప స్ఫోటక నివారక ద్రవమును శస్త్రిపుమొనపఁదీసి శుభ్రము చేసికొనిన ఎడమముంజేతి క్రీవైపున మూఁడు క్షతములవేసికొని ఆటీకాలపాలను చక్కఁగా వానిలోనికి కడ్డీదుబ్బతో రుద్దికొనును. శస్త్రిమును తుడిచి దీపములో కాల్చి భద్రము చేయును. దీపము అర్పివేయును.)

(స్వగతము) టీకాలు వేసికొనినాఁడు. (నడునెత్తిపయి కుడిచేయి యుంచుకొని ఆలోచించుచుండును.)

అత్రే—(స్వ)

గీ॥ కాట్ల వాదరకఁ గడ్డీని • కాఁచియుంచి
యెడమ ముంజేయి చక్కఁగాఁ • గడిగి యందు
మూఁడు నొక్కుల శస్త్రింపు • మొనను గీఱి
వాని రుద్దితి టీకాల • పాలతోడ॥

ఇఁక నిమహామారి క్రిములనే మున్ముందు తులసీక్షారముచే నొంచి చూచెదఁగాక.

(మహామారి సూక్ష్మక్రిములని వ్రాయఁబడి యుండు గాజు గొట్టమును కుడిచేతఁ బట్టుకొని చూచి కదిలించుచుండును.)

వసవ—(స్వ) ఏమి ఆగొట్టమందు! (చదువుచు) మహామారి సూక్ష్మక్రిమిసముదాయమా? (ఆలోచించి) నేను ఇచ్చటికి వచ్చిన ఆఱునెలలనుండి ఎప్పుడేని యితఁడు బొబ్బలరోగము విఱుప్ర వేసికొనలేదు. మంచితరుణమున దొరకినాఁడు.

(తలపంకించుచు, ఉద్ధతితో)

సీ॥ జాగరంబునఁ జిక్కి • చచ్చుమనీషతోఁ
దతాఁగెడు బుద్ధితోఁ దతాలువాఁడు
తులసికారముఁగాంచి • తోరంపుటుబ్బుతోఁ
మురిపెంపు టూహాతోఁ • బొరలువాఁడు
డాకేలిక్రీవైపు • టీకాలకత్తితోఁ
జీల్చిన కాట్లతోఁ • బొల్చువాఁడు

కుడిచేతఁగొట్టంబు • కుదిలించి పూన్కితో
సయ్యాట క్రిములతో • సలుపువాఁడు
గీ॥ దొరకి నాఁడిపుడె తొనఁకింతు క్షతములను
మా మహామారి కుప్పయై • మలయురసముఁ
పిడుగుఁ బోలెడు వార్తచేఁ • బ్రేల్చి, వీని
ప్రీల్చెదఁ బుచ్చెదఁ మిత్తి • ప్రీతినొంద॥

(దైన్యముతో, కంటఁదడి తుడిచికొనుచు ఆత్రేయుని ఎదుటికి వచ్చి యేడ్పుతో)

(ప్రకాశము.)

అయ్యో! అమ్మా! ధన్వంతరి ప్రభూ! అయ్యో! ఇంకెక్కడి ధన్వంతరి.

ఆత్రే—(నివ్వెఱపడి) వసకా! యేమిరా యీతొందరపాటు? ధన్వంతరికేమి ఆపదవచ్చె?

వస—(ఏడ్పుతో)

ఆ॥ రాచపుంటెఁ గోయు • రయమునఁ గత్తిచేఁ
గాటుగొనియె వ్రేలు • గాటముగను
విసపు జన్ని సోఁకి • వేఁచెధన్వంతరిఁ
పడక కుదురకుండఁ • బొన్నుమీఁద॥

ఆత్రే—(దుఃఖముతో) మహాశస్త్రచికిత్సకా! నీ కెట్టి యిక్కట్టువాటిల్లె!

గేయము—అన్నయ్యా ధన్వంతరీ! ధన్వంతరీ! ధన్వంతరీ! ధన్వంతరీ!
నీనామస్మరణము—జగమున—నీనామస్మరణము—
అనామయమంత్రము తండ్రీ! ధన్వంతరీ! ధన్వంతరీ!
ధన్వంతరీ! ॥అన్నయ్యా॥
అస్తమించెన నేఁడు శస్త్రకౌశలము తండ్రీ! రోగతిమిర నిరోధి
శస్త్రసూర్యుఁడెవఁడింక॥ అన్నయ్యా॥

(వసముఁడు ఆత్రేయుని వైపు అతిదైన్యముతో చూచి కన్నీరునించుచు, నిట్టూర్పు బుచ్చుచుండును.)

వస—(స్వ) నిజముగానే అస్తమించెను. (తలయూఁచుచు హాస్యహావము చూపును.)

ఆత్రే—నేని దుఃఖవాహినిఁ జిక్కి కర్తవ్య కార్యములు చేయక (స్వ) మసలుట పురుషకారము గాదు.

ప్రకాశ—ఇచట నే ప్రతీకారచర్మవస్తి ద్రవములుగలవు.

ఎడమచేతితో తాళపుగుత్తులు విసరుచు త్వరితముగ వసమునికడకువచ్చి సరిఅయిన బీగము చూపును. ఇంకను మడిచేతిలోని గొట్టము అట్లెయున్నది.

(వసముఁడు, మహాశ్రద్ధతోను, చులుకఁదనముతోను బీరువా తెఱచును.)

ఆత్రే— (వెదకుచు)

ఏమీ తొందరపాటు!

ఆ॥ వేగిరింపఁ బనులు • విషమములౌఁగదా,
కామ్యవస్తువకట! • కాననైతిఁ
ప్రేమబంధమెచట • బిగువుగా వెలయునో
బుద్ధిమాంద్య మటనె ? • పొల్లు లటనె॥

ఇంకను త్వరితముగ వెదకుచు, బుడ్లుఅటునిటుఁ దొలఁగఁ ద్రోయుచు, వసుని వైపు దృష్టి సారించి,

ఓయి వసకా! ఏమంటివి? జన్నిలక్షణములు కనుపించిన వనియా?

(బుడ్లను కదపఁగఁ గొన్ని దిగువను దొరలుచుండును)

గీ॥ రయము నేర్పును మెలఁకువ • రాగభక్తి
ఆ యమృతకరాంగుళులలో • నడఁగియుండె

(ఒక పెద్దబుడ్డి దిగువఁబడి విస్ఫుటమైన ధ్వనితోఁ పగులును. మఱికొన్ని దానివెంబడి దొరలి పగులఁగా ఆత్రేయుఁడు ఉలికిపడి కుడిచేతిలోని గొట్టమును ఎడమముంజేతి క్షతములలోఁ తోఁకించికొనును.)

ఎట్టి యేమఱుపాటొయొ? • నిట్టి చెట్ట
వచ్చె నవతారమూర్తి ధ • న్వంతరికిని॥

ఆత్రేయుఁడు తత్క్షణమే పరుగిడుచుపోయి అచటి పాత్రమందలి నీళ్ళతో క్షతములు కడిగికొని కారపు ద్రావకముతో రుద్దికొనును. వసుఁడు మహాదరముతో సహాయపడును.

స్వ—(వసుఁడు, విజయ విజృంభితములైన మందహాస వీక్షణములతో నుండును)

త్రే—ఎంతయేమఱుపాటు ?

కం॥ జడమతి నటునిటుఁ దడవఁగ
బుడిబుడిసీసాల్ దడబడ • బుడమినిబడఁగా
జడిమ డిక్షతముల దొనిఁకెను
వడిగ మహామారిగములు • ప్రాణాంతకముల్॥

అహా ! ధన్వంతరీ ! యిదేమిదుర్గతిము ! ఎంతవేగిరపాటు ! మనము ఇద్దఱికి ఎట్టిదుర్దినము ! మహామారిపురుగులపుట్టను ఈ ముంజేతికొట్లలోఁ దోనికించుకొంటిని. చేసేఁత నన్ను నేఁ జంపుకొంటిని. ఏమో యీవిషజీవులనుండి ప్రపంచమంతయు నుద్ధరింపవలయునని గంపెడాసతో నుంటిని.

తులసీక్షారమా ! నీవెంత ద్రోహకారివి. నీవులభించిన పారవశ్యమునఁ గాదె యింతవిపత్తు సంఘటిల్లె ? ఎంతమోసము ! ఎంతమోసము !

వసు—(స్వగతము)

మాపాపలను పెంచి చలపుచుండిన ఏమాసమే నన్ను కొట్టినది.

ఆత్రే—

సీ॥ చెఱువులు నిండించి ♦ సిరిపంటఁ జూపించి
కట్టలఁ దెంచదే ♦ గాఢవృష్టి
ఉరుతర భోగంబు ♦ లరచేతఁ జూపించి
తస్కరుఁ బిల్వదే ♦ ధనసమృద్ధి
మల్లత్వసిద్ధికై ♦ మమతను జూపించి
గదమెదఁ జొన్పదే ♦ గరిడిసాము
క్రూరజంతులఁ గ్రుమ్మ ♦ కోర్కెలు చూపించి
విపినాలఁ జంపదే ♦ వేఁటయాట
ఆ॥ వేయునేల యెద్ది ♦ విశ్వరక్షకమంచు
రోగబీజసత్త్వ ♦ రోధమంచు
ఆశచూపి నాకు ♦ నానంద మొసఁగెనో
అట్టి తులసియుప్పె ♦ చెట్టదెచ్చె॥

వసు—(స్వగతము)

తులసియుప్పు సుధయగుటను మాఱుగా.
(చిఱునవ్వుతో).
సాదను మూలమయ్యె.

ఆత్రే—నేను, మహాపావన మగు తులసి ఉప్పు నేల దూషింపవలయు?

ఆ॥ తులసి లవణమేమి ♦ ద్రోహంబు గావించె
నా కరంబె తొలఁకి ♦ నన్నుఁ జంపె
నత్యా నిద్రకు ఫల ♦ మవిలంఘనీయము
"అతి" సతం బనర్థ ♦ యుతముగాదె॥

విధి అవిలంఘ నీయముగదా?

వసు—(ఆత్మగతము)

అవును!

(మహాదరముతో ఆత్రేయునకు ఉపచరించును. తనలోనుబ్బును.)

ఆత్రే—ఇదేమిభారము! నిజముగా త్రాచుబాము విషమువలె తలకెక్కినది.

కం. తలగిఱ్ఱుని భ్రమియించెను
పులకించి శరీరమెల్లఁ ♦ బొంపిరివడఁ గుర్జ.

నిలువెల్లఁ గుడ్డుచెమటలు
దళముగ వ్యాపించె, హెచ్చె • దప్పియు శ్రమయున్.

వస—(ఆత్రేయునకు ప్రత్యక్షమున ఉపచరించుచు దైన్యము చూపును. పరోక్షముగ డంబము వెక్కిరింత చూపుచు తలయూఁచి పెదవి విఱిచి అట్టహాసమును వీక్షణములందుఁ గనఁబఱుచును.)

ఆత్రే—జ్వర మతితీవ్రమయినది. నే నిచట నిలువఁజాల. శయనమందిరమునకుఁ గొనిపొండు. కాదు! ధన్వంతరియొద్దకుఁ దీసికొనిపొండు.

వస—(పరోక్షమున వెక్కిరింతతో) త్వరలో నే ధన్వంతరిలోఁ గలిసికొందురులే!
(ఆత్రేయుని మహాదరముతో ఉపచరింపుచు లోనికిఁ గొనిపోవును)
(జవనిక జాఱును.)

వస—(ఈవలికి వచ్చి, స్వగతము) హారములుగొన్న అమ్మలక్కలు, కంచుకములుగొన్న కామినులు మిణుకరించుచుండ మా మృత్యుదేవత ముఖ్య శత్రువులను మూఁడుముక్కలు ఘడియలలో ఆమె వేటికి దారిఁజూపితిని. హారాలుగొన్న ముగ్గురుమూఁడుమూలలదాఁగిరి, కంచుకములుగొన్న వారుగట్టివారె. వారు ఏమిచేసిరో చూతము.

స్థలము ౨.—కల్యాణపురి. శుచిమత ప్రాంతము.

(వసుంభిణి, ఫిరంగిణి, వసకుఁడు అందు ఉందురు.)

వసకు—అమ్మలారా! ఏమిచేసితిరి?

వసుం—వసకా! యేమి నీముఖమున ఎన్నఁడులేని వికాసము గంతులువేయుచున్నది!

ఫిరం—వసకుఁడు వస్తాదిబిడ్డ. ఏమో లాభముచేసి వచ్చినట్లున్నది.

వసకు—(ఆత్మగతము) వీరి ముఖములుచూడ వీరును ఏదో పనిచేసినట్లే ఉన్నది. వారలనే ముందుచెప్పనీ! (ప్రకాశము) అమ్మా! మీరు చూపెడు త్రోవల నడచు వాఁడను. మీరు అనుగ్రహము చేయనిదే స్వల్పుఁడను. నేనేమి చేయఁగలను?

వసుం—చూచితివా ఫిరంగిణీ! వీని సూక్ష్మపు పలుకులు!

ఫిరం—మనము ప్రాణులకు సోఁకి వ్రణములు కలుగఁజేసిన వెనుక వాటిలో నితఁడు ప్రవేశించి నొంచుట సూచించుచున్నాఁడు. మనము చెప్పనిదే యితఁడు నిజము పల్కఁడని తోఁచెడు.

వసుం—అయ్యా! విశారద జియ్యంగారిని భ్రష్టుని జేసి వచ్చితిమి, వానికిఇచ్చిన గాటంపు సోఁకుల్లు వాని అబ్బ మగువలకైనను మరలవు. మహాచార్యులు, భ్రష్టాచార్యులయి నలుగురిలోఁ తిరుగలేక మొగము వెల్లకిల వేసికొని విషాదసాగరమునో మునిఁగియున్నామ్రైవసాగరములోఁదేలుచున్నారు.

వస—అట్లయిన నేను వానినిమీనోటఁ జల్లఁగఁ జెప్పిన ఆ ఉన్మాదసాగరములోనే ముంచివైచెదను. ఈ క్షణములో.

వసుం—ఏమీ! రామీ!

వస—చెప్పెదనులే.

ధీరం—నీ మాటలు అతి గూఢములోయి!

వసుం—వసకా! రామి ప్రియము! ఏలదాఁచెదవు!

వస—ధన్వంతరికి ప్రవేలికొటునుండి 'విషజన్ని' ఆత్రేయునకు ఇంచుమించుగ అలులే మహామారి ప్రయోగము. ఇద్దఱిని విశ్రాంతి శాలలకుఁ గొనిపోయిరి. 'జన్ని' యిప్పటికి ముదిరియుండును. ఇంక కొన్ని గడియలలోనే వారి మరణవార్త చెవిచేనికో వచ్చును. అప్పుడు మన అమ్మలక్కల, ఆ దంభపు కోఁతిగాంప్రదను మరల ఈ శుచిమతమును భేదింపఁ ప్రయోగింతేము. (పోఁబోవును.)

వసుం—ఏమీ తొందరపాటు! కథ ఆ మూలాగ్రముగ చక్కఁగ చెప్పి పోవయ్యా!

వస—ఆ విశారదుని విషాదపు టునుపమీఁదనే ఘోరమగు దెబ్బగొట్టి ఉన్మాద సముద్రములోఁ త్రోయఁబోయెదను,

ముగ్గురు. గేయము.

ఉన్మాదమున ముంచి సన్మాన మందెదముగా సన్మానమందెదముగా।  
మత్తుటన్నల టక్కు, మత్తుటక్కల నిక్కు మిత్తికివెలి బుచ్చి  
సన్మానమందెదముగా॥  
హారాల అన్నలకు, హారాల అక్కలకు, హారతుల నిప్పించి  
సన్మానమందెదముగా॥ ఉన్మాదమునముంచి॥

స్థలము 4—కల్యాణపురము—శ్రీ శుచి మఠము లోపలివైపు.

(విశారదుఁడు కృష్ణాజినముపై కూర్చుండియుండును. వసవుఁడు విశారదునకుఁ తెలియకుండనొకచోట నుండును.)

విశార—

తలఁచికొనినకొలఁది సంతాపము తరంగితముగాఁ బొరలివచ్చుచున్నది. ఏమి ఔన్నత్యము! ఉత్కర్షము! శుచి మతపీఠాభిషిక్తుఁడనయి ప్రపంచరక్షణకై ప్రచారమునకుఁ ప్రయాణమై అమ్మవారిదేవి సంపూర్ణ కరుణాకటాక్షమువడసి నపుడు ఉండిన స్థితి, శోభ, మహిమ యనిర్వచనీయములు కదా!

మ॥ శుచిదేవీ వరమంత్రదేశికుఁడనై • సుజ్ఞానశీల ప్రబో
ధచతుర్వ్యక్తిఁడనై, రుజానిధాన జనమ • ధ్యప్రోజ్జ్వలత్ క్షుద్రజం
తుచయత్ర్యక్తుఁడనై • ప్రజ్ఞ మనుపుచో • దుగ్ధాబ్ధిపుత్రీశుఁ బో
లుచు దివ్యశ్రుతిగాంచు నన్నుమను ము • ల్లోకంబు లగ్గింపవే॥

కుసుంభిణీ ఫిరంగిణులు ఆనాలుగు నెలల శిశు ప్రసూతి పోషలయెడఁ జూపిన నిరుపమాన మగు ధాత్రేయీ సపర్యా కౌశలమును, నాపట్లఁ గుమ్మరించుచుండిన వైరాగ్యయుక్త భక్తిధురంధరత్వమును చూచి, నిర్మలమయిన జనకవాత్సల్యముతో వారిని నాదగ్గఱకుఁ జేరనిచ్చితినే ! ఎంత మోసము ! ఎంత మోసము ! ఏమియా అమాయకత్వ ప్రదర్శనము ! ఇరువురలో నొక్కొక్కతెయు.

సీ॥ భక్తిగాఢతతోడఁ • బరముఁజూచుటవోలెఁ
జుక్కలపై బెళ్కు • చూపునిల్పు
సీర్కాఫులుధరించి • నిండు ముగ్ధతెదోఁపఁ
బయఁటఁబెదవిఁ గప్పి • పదులువలుకు
ఎండతాపమడంప • మెండైన పన్నీట
మృదులమౌ నలుఁగుచే • మేనునలచు
రేలందుఁ బడకింట • గాలియాడదటంచు
విసనకఱ్ఱనుమెల్ల • విసరుచుండు
గీ॥ మచ్చికల నిట్లు సుతవోలె • మసలుచుండ
గాఢనిద్రావశుండనై • కన్నుమూయఁ
బడుక చేరువఁదానును • పండునపుడు
కొన్నినాళ్ళకు నాబుద్ధి • కొంచెమాయె॥

నాకు ఈరోగ అవస్థముదురగనే వారి బంధువులు ఎవరో అచట చరమస్థితిలో నున్నారను మిషపై ఇటనుండి నాసెలవు గైకొనకయే వెడలిపోయిరికదా! వారిచట శిష్యత్వమునకై చేరినరాత్రి యే ఒక దివ్యస్త్రీ నా కలలోఁ గనఁబడి బెత్తముతో నా వీఁపుచఱచిఁ అదృశ్యయాయెగా! నేను ఉలికిపడి లేచి, అదినాత్రిదండము, గాలి యండనుండి జాఱినాపైఁబడెనని అనుకొంటినే! శ్రీ శుచి భగవతి హెచ్చరిక అని తెలియనయితినే! ప్రస్తుతము ఈ దుస్థితి యెంత విషాదకరము ! ఎంత విషమముగా ముదిరినది.

సీ॥ గరిడిసామునఁ దీరి • గట్టివారిన మేను
దాఁకిన నూడు నగ్గ • దలఁపు గొలుపు
ఆలయస్థాపన • కంజెవేసెడి మది
మాంద్య వార్నిధి మున్గి • మాటుమణఁగె

శుచిశీలగోష్ఠి కై • చొచ్చెశిష్యతతిఁగోరు
బుద్ధి బయటికిఁ గాలు • పోనఁగనీదు
ఎవరికిఁ దెలియునో • యీప్రవర్తనమంచు
నెడఁద రేయుంబవ • ళ్ళెప్పుడళుకు
గీ॥ రంగువేయని పులివేష • మంగములను
వ్యాఘ్రమయ్యెను బట్టింపు • యానమయ్యె
గ్రావశృంగంబునుండి యు • గాధపాత
మయ్యె, వలదిట్టి బ్రదుకాత్మ • హత్యమేలు॥
(సంచినుండి కత్తిని దీసికొనును.)

వస—(స్వగతము ఆతురతతో) ఆ కత్తితో పొడిచికొనునాయేమి ? మంచిదే! ఇచట నా పనియుఁ పూర్తి అయినట్లే!

విశార—(ఆత్మగతము) (విషాదపు నివముతో)

మహాప్రభూ ! ధన్వంతరీ ! మీరు వాత్సల్యముతో నాకొసఁగిన విస్రావ వ్యవ్రుటచ్ఛేదమగు నీ కత్తి యున్నది. బడబానల సన్నిభదుశ్చింతాజాల దుస్సహావేదనాన్వితమగు నీ పాపిహృదయ గోళమును జీల్చి చికిత్సచేసికొని రాఁగల జన్మమునకేని అవినీతినుండి రక్షగావించికొనియెద. (పొడిచికొన నుంకించును.)

వస—(స్వ) అదియే మంచి మార్గము. ఏమి మరల నాలోచన !

విశా—(కత్తి నివలికిఁ దీసివైచి)

ఛీ ! నేనేమి చేయనుంటిని ! ఆత్మహత్యయా ? ఎంత దారుణ మొనరింపనుంటిని !

గీ॥ అంధతామిస్రలోకంబు • లాత్మహత్య
పరుల కాబ్రహ్మకల్పంబుఁ • బరఁగునండ్రు
కోటు లేడులు నిరయానఁ • గూలుకంటె
నొక్కజనికష్ట మోర్చుటే • యుచితరీతి॥

చేసేఁతఁ కండకావరమున నెఱపుగొనిన గదా ? పెద్దల అవినీతియే మార్గదర్శకముగాఁ గొని నీతిపరులఁ దలంపక తెచ్చికొనిన బుద్ధిహీనత గదా ? యిది.

సీ॥ ఋషిపరాశరురాగ • వృత్తిని ఘనమెంచి
లక్ష్మణుదీక్షపై • లవమునించి
దేవేంద్రభోగంబు • దీర్ఘంపుఁ జవిమంచి
భీష్మునియమముపై • వెగటుబెంచి

కౌశికువంచించు ♦ కామంబు వినుతించి
ప్రవరాఖ్యుశీలంబు ♦ పరిహసించి
ముగురుమూర్తులనోంచు ♦ మోహాంపుఁ బ్రియమెంచి
సారంగధరునీతి ♦ చౌకఁబంచి
గీ॥ పువ్వువిలుతులీలలాశించి ♦ మఃకుక్కుసరి
చూచికొని దత్తారుఁడ నయితి ♦ శుచిభగవతి
కమలయశము నుత్సాహంబు ♦ నబ్ధిగలిసె
మతము పాడాయె, మతమును ♦ మాయమగునొ॥ (ఏడ్చును.)

వస—(స్వగతము) (దెప్పెనతో, వెక్కిరింతతో) ఏడ్వుము బాగుగా, ఆఁడుదానివలె ఏడ్వుము. ఆఁడువారిదెబ్బలకే ఏడ్వుము.

విశా—(ఆత్మగతము) (నిర్ధారణముగా) దీనికివేఱే ప్రాయశ్చిత్తము లేదు. ఏమైనను గాని! ఎంత ఆగ్రహమైనను రాని! నాయపరాధములు శ్రీధన్వంతరి ఆత్రేయులయొద్ద నివేదించి పశ్చాత్తాప పడెదఁగాక.

వసుఁడు—(ఆత్మగతము)

ఆ॥ జ్వాలబోయి కొఱవి ♦ చాయకుదిగియెను
మఱియు వీని మనసు ♦ మాఱునేమొ!
గుగ్గిలంపువార్త ♦ భగ్గని మండింతు
నిదియ బీజమునకుఁ బదనుహాదను॥

(ప్రకాశముగా దైన్యముతో)

గురువర్యా! నమస్కారములు. నేను శ్రీమదాత్రేయ ధన్వంతరులకుఁ గడుగూర్చు పనివాఁడను నన్ను వసుఁడందురు.

విశారదుఁడు—(ఆదరముతో) వింటిమి. నీవేనావసుఁడవు?

వస—(ఏడ్పుతో) అయ్యా! నేనేమి చెప్పుదును వారిదుస్థితి! నోరాడకున్నది.

విశార—(నివ్వెఱపాటుతో) ఏమివాటిల్లెను? త్వరితముగఁ జెప్పుము. భయపడకుము.

వసు—(కంటనీరు తుడిచికొనుచు గద్గదికముగా) ధన్వంతరిదేవుఁడు రాచపుంటిఁ గోయుచుండ శస్త్రము యావేగమున వ్రేలుకొటు గొనిరెు.

విశార—(కంటనీరు రాలుచుండ డగ్గుత్తికతో) అబ్బా! నాతండ్రీ! ధన్వంతరీ!

వస—ఈసంగతి ఆత్రేయులవారు వినఁగనే విషజీవ శోధన మందిరములో, సూదిమందు వెదకు తొట్రుపాటున మహామారి సూక్ష్మజీవుల గొట్టమును ముంజేతికి చేసికొనియుండిన టీకాలలోఁ దొనికించి కొనిరి.

విశార—(చేతులు పిసికికొనుచు రేడ్చుచు) అయ్యయ్యో! ఆత్రేయప్రభూ! (ఏడ్పుమ్రింగి వినును.)

వస—ధన్వంతరి ప్రభువులకు విషపుజన్నియు, ఆత్రేయులవారికి బొబ్బరోగమును వచ్చె. (ఏడ్చుచు) నేనిటఁ దడయఁజనదు. సెలవిండు. పోయివచ్చెద.

(ఈవలకి వచ్చి, స్వగతము) చక్కని అదనున మంచిబీజము నాటితిని. వీని ఆటలు మఱుఁగనఁ జూచి మావారలకుఁ దెలిపెద.

విశా—(దిగ్భ్రాంతితో విషాదముతో) ధన్వంతరి ఆత్రేయప్రభువులారా! నన్నువిడిచి తాము ఎచ్చటికేఁ బోయెదరు?

నూతనయుగముఁ గల్పించెద నని నిండోలగమునఁ బల్కినందులకు ఫలముగాంచియు, విషయప్రమత్తత అవగలాంఛల టక్కులకుఁ జిక్కి మోసపోతినే! నేనే యీ గతిగాఁగ నా శిష్యులేగతి అయ్యెదరో అని దైన్యమునఁగుచుంటినే! మతాచార్యులు భ్రష్టులయిరని పదుగురాడుచుండఁ తలయెత్తికొని తిరుగఁగలనా యని విలపించుచుంటినే! ఇంతలో మీకును ఈగతి రాఁదగునే! మమ్మిక నోమెడు వారెవరు? ఇంకమేమెట్లు ప్రపంచమునఁ మెలఁగఁగలము?

(వెడచూపుతో) అయ్యా! ధన్వంతరీ! సన్నిపాతమున ఏమనుచున్నావు? విశారదా! అనెదరా! వసుంభిణీ ఫిరంగిణులచేఁ జిక్కినభ్రష్టా! అని కలవరించుచుంటిరా? అబ్బో! (సభయముగా) ఆత్రేయుఁడు! ఆత్రేయుఁడు! ఉఱిమి చూచుచున్నాఁడు. పండ్లుపటపట కొఱుకుచున్నాఁడు. పయికి దుముకుచున్నాఁడు. అదేమి! చేతిలోఁ పొడవైనబెత్తము!

(ఏడ్చుచు, వీఁపుచేతులతోఁ తడవికొనుచు, ఉలికిపడుచు, అఱచుచు)
అబ్బో! అబ్బో! ఊ! ఊ! ఆ-త్రే-యుఁ-డు
(గుటకమ్రింగి వెఱ్ఱిచూపుఁజూచి నిట్టూర్పుతో)
ఇంకేమి ఆత్రేయుఁడు. నన్నెవరు రక్షింతురు, రక్షించు ప్రభువులను నా విరోధివర్గమునకే అర్పించితినే! ఆత్రేయా! అమృతహస్తా! నీ శోధనశాల యికపాడేనా? ధన్వంతరీ! రోగుల నీ ప్రపంచమున సంరక్షించు వారెవ్వరు?
(వెడచూపుఁజూచి తల గోకికొని, తొడలు చేతులతో నదిమికొనుచు, బాధవలన నుస్సురనుచు)
అహో! యిదేమి బాధ. ఈ సలుపులచేత!
(ప్రక్కల, దిగువ, ఎగువఁ జూచుచు) ఇదేమి! నన్ను పరుండఁ బెట్టినటులున్నదే
(ప్రార్థనా పూర్వకముగా)
అయ్యా! ధన్వంతరీ! నాకు బాధనివారణార్థము చికిత్స చేయుదురా?
(ఏడ్చుచు)

అయ్యో! మీ మృదువచనము లెటుపోయె? ప్రళయకాల మేఘగర్జనముల వలెనున్న వే నన్ను మీరు తిట్టుటలు? మాటలు స్పష్టముగా వినరావే!

(చెవులు మూసికొని విసుఁగుతో) అయ్యో! తల దిమ్మపట్టె,

(చేతులు విదల్చుచు ఏడ్చుచు) బాధకోర్వఁజాల, ఏల గట్టిగా నా ప్రాణముల నొత్తెదరు?

(భయముతో బిగ్గరగా) శస్త్రచ్ఛేదము చేసెదరా?

(బతిమాలుచు, దైన్యముగ) మహాప్రభూ! మీదాసునికి మైక మిప్పింపుఁడు.

(దగ్గుతీతతో) ఏమనెదరు?

(బిగ్గరగా నేడ్చుచు) నాదుండగమునకు మైక మియ్యకయే శస్త్రచికిత్స చేసెదరా?

(వడఁకుచు) అయ్యయో మేను వడఁకుచున్నది.

(భయముతో పిఱికితనముతో, అఱచుచు) అబ్బో! అబ్బో!

(పట్టుదలతో, ఏడ్చుచు) నాకీ చికిత్సవలదు.

(పట్టుపడినవాడు పాఱిపోవురీతి చేతులతోఁ బెనఁగి పాదములు విదల్చి లేచిపోఁజాలక) నేను పోయెదను.

(దైన్యముతో) గట్టిగా కాలుసేతులు సహాయకులను బట్టికొనుఁడనెదరా?

(వెఱ్ఱికేకలు వేయుచు) అబ్బో! అబ్బో! తళతళలాడుచున్న ఆ కత్తితో కోయఁబోవుచున్నా రే? ఓ! ఓ! అయ్యో!

(ఆయాసముతో) నానెత్తురంతయు కాఱిపోయినది.

(హీన స్వరముతో) నా ప్రాణములు పోవుచున్నవి.

(చేతులు కాళ్ళు, తల మరణసమయమందువలె ఆడించుచు) నాయూపిరి నిలిచిపోయినది.

(నేలకొఱగుచున్నాఁడు) (జవనిక జాఱును)

వసుమ:—(స్వగతము, ఈవలికి వచ్చి) నామీసముపై మసంచి నిమ్మపండు నిలువఁ బెట్టెద!

గేయము.

చెంగు చెంగున చెంగలించెద । విషజారాంగనల చెంగటికిసే ॥చెంగు॥
సంకల్ప సిద్ధుఁడనై నాప్రతినను జక్కఁజేసి వచ్చితి నని తెల్పఁగి ॥చెంగు॥

(నేపథ్యమున, "కంకణాలు గట్టినాము- వీరకంకణాలు గట్టినాము.")

వసు—(ఆజనుల వైపు దృష్టి సారించి) యేమిది యీ సంబరము! ఓహో! శుచి కొలుపు చేసికొనుచు మతానికి వచ్చుచున్నారా పల్లెలజనము! మీగురువుగారి చిహ్నాళ్ళాయి ఆ శుచి జోలపాట పాడి నిద్రబుచ్చి పోవుచున్నాను.

మీవీరంగాలు కిలారింపులు, ఎన్నిఅయినా వాటిని లేపలేవు. ఇంకనాకేమి పని యిచ్చట.

(పరువున నిష్క్రమించును.)

స్థలము 5.—కల్యాణపురి, శుచిమత ప్రాంతవీధి.

(కొలువు నాట్యసంగతితో పల్లె పల్లెల జనము యథా విధముగా ప్రవేశింతురు. వైశారదుడు, గౌతమను, శిష్యవారు అనుసరింతురు.)

వీరాంగము.

కంకణాలు గట్టినాము ॥ మీ కంకణాలు గట్టినాము ॥ నాల్గు ॥కంకణాలు॥
మిత్తిదేవత మానవులంహారణము చేయడానికి పన్నిననాల్గు జంతువులు మాడ్చుటకు॥కం॥
ఈగ, దోమ, ఎలుక, నేసు, ఇంచుకైన లేకుండ, మందుకైన లేకుండ, వెదకినా లేకుండ ॥కం॥

నాడుగట్టిన కంకణాలు, నేడు విప్పుటకు – నాడుమూసిన మడుపులు నేడు తీర్చుటకు, తల్లీ! శుచీ! నాడుబట్టిన దీక్షలు నేడు విడుచుటకు॥ పోతున్నాముగా, శుచి మతానికి పోతున్నాముగా ॥కంక॥

శాబ్దిలన్నిటిని – చకచకా జేసినామని, దోమలన్నిటిని, దుమ్ము చేసినామని, ఈగలన్నిటిని పర్చి తుడిచినామని, ఎలుకలన్నిటిని దూలి పివేసినామని, పేలనన్నిటిని వేరుమాపినామని –పోతున్నాముగా – శుచిమతానికి పోతున్నాముగా –చేసిన విధి చెప్ప-పోతున్నాముగా ॥కం॥

విశారద శిష్యులు—(ప్రవేశించి) అయ్యో! పాపము! శుచికొలువు చేసికొనుచు మరణమును వచ్చుచున్నారు ఈ పల్లెల జనులు? బ్రహ్మణులగుటచే పవిత్ర భక్తితో జరుపుచుండు మునులవలె రాక్షసగర్జనాలతో ఈ సర్వారి ఎట్లు చెప్పగలము శ్రీ శుచిదేవతా భక్తి పారవశ్యమున నుండు ఈ శిష్యబృందమునకు?

(ప్రకాశము)

అయ్యలారా! చెప్పక తప్పదు. మీ వాద్యములు నిలుపుడు. ధన్వంతరి కోపునకు గురియైనారు.

జనులు—అయ్యో! ధన్వంతరి ప్రభూ!

విశా॥ శి—ఆత్రేయులవారికి బొబ్బలరోగము సంధించినది.

జనులు—(అతిదైన్యముతో, నిస్పృహతో) ఇద్దరు ధర్మప్రభులకా? (ఆక్రందనములు చేయుదురు)

విశా॥ శి—విశారదగురువులకు ఈ విషయము తెలియగనే పిచ్చిపట్టినది.

జనులు—అయ్యయ్యో! అయ్యయ్యో! మా గురువులకు కూడ పిచ్చిపట్టినదా? ఇంకెవరు ఈ మడుపులు చెల్లింతుము ఎక్కడ మా కంకణాలు విప్పుదుము.

(ఏడ్చుచు కంటినీరు తుడిచికొనుచు)

అయ్యో ! మీ మృదువచనము లెటుపోయె ? ప్రళయకాల మేఘగర్జనము వలెనున్నదే నన్ను మీరు తిట్టుటలు ? మాటలు స్పష్టముగా వినరావే !

(చెవులు మూసికొని విసుగుతో) అయ్యో ! తల దిమ్మెక్కెనే,

(చేతులు విదల్చుచు ఏడ్చుచు) బాధకోర్వఁజాల, ఏల గట్టి నా ప్రాణముల నొత్తెదరు!

(భయముతో బిగ్గరగా) శస్త్రచ్ఛేదము చేసెదరా ?

(బతిమాలుచు, దైన్యముగ) మహాప్రభూ ! మీ దాసునికి పైక మిప్పింపుఁడు.

(డగ్గుత్తికతో) ఏమనెదరు?

(బిగ్గరగా నేడ్చుచు) నాదుండగనునవ పైక మియ్యకయే శస్త్రచికిత్స చేసెదరుగదరా

(వడఁకుచు) అయ్యయో మేను వడకుచున్నది.

(భయముతో పిఱికితనముతో, ఆఱచుచు) అబ్బో! అబ్బో!

(పట్టుదలతో, ఏడ్చుచు) నాకీ చికిత్సవలదు.

(పట్టువడినవాడు పాఱిపోవురీతి చేతులతోఁ బెనఁగి పాదములు విదల్చి లేచిపోఁజాలక)
నేను పోయెదను.

(దైన్యముతో) గట్టిగా కాలుచేతులు సహాయకులను బట్టికొనుఁడనెదరా ?

(వెఱ్ఱికేకలు వేయుచు) అబ్బో! అబ్బో! తళతళలాడుచున్న కత్తితో కోయబోవుచున్నారే? ఓ! ఓ! అయ్యో!

(ఆయాసముతో) నా నెత్తురంతయు కాఱిపోయినది.

(హీన స్వరముతో) నా ప్రాణములు పోవుచున్నవి.

(చేతులు కాళ్ళు, తల మరణసమయమందువలె ఆడించుచు) నా యూపిరి నిలిచిపోయినది.

(నేలకొఱగు చున్నాఁడు) (జవనిక జాఱును)

సుశర్మ:—(స్వగతము, ఈవలికి వచ్చి) నానిూసముపై మంచి నిమ్మకెపంచు ... నంబెట్టితిద!

## గేయము.

చెంగు చెంగున చెంగలించెద । విషజ్వరాంగనలు చెంగటికి నే ॥చెంగు॥
సంకల్ప సిద్ధుఁడనై నా ప్రతినను జక్కఁజేసె వచ్చితి నని తెల్పఁగి ॥చెంగు॥

(నేపథ్యమున, "కంకణాలు గట్టినాము- వీరకంకణాలు గట్టినాము.")

సు—(అజనుల వైపు దృష్టి పాఱించి) యేమిది యీ సంబరము! ఓహో! శుచి కొలువు చేసికొనుచు మఠానికి వచ్చుచున్నారా పల్లెజనము ! నాగుమపుగారి చివ్వెళ్ళాయి ఆ శుచి కోలపాట పాడి నిద్రబుచ్చి పోవుచున్నారు.

నా వీరంగాల కిలారింపులు, ఎన్ని అయినా వారిని లేపలేవు. ఇంక నాకేమి పని యిచ్చట.

(పరువున నిష్క్రమించును.)

స్థలము 5.—కల్యాణపురి, శుచిమాత ప్రాంతవీధి.

(కొలువు వాద్యములతో పల్లె పల్లెల జనులు యథావిధముగా ప్రవేశింతురు. కైనేయవాఁడు పాడును, కొందఱవారు అనుసరింతురు.)

వీరాంగము.

కంకణాలు గట్టినాము ॥ మీ కంకణాలు గట్టినాము । నాల్గు ॥కంకణాలు॥
మిత్తి దేవత మానవులకు ప్రాణము చేయడానికి పన్నిననాల్గు జంతువు మాడ్పుటకు॥కం॥
ఈఁగ, దోమ, ఎలుక, పేను, ఇంచుకైన లేకుండ, మందుకైన లేకుండ, వెదకినా లేకుండ ॥కం॥

నాఁడుగట్టిన కంకణాలు, నేఁడు విప్పుటకు – నాఁడుముడిచిన ముడుపులు నేడు తీర్చుటకు, తల్లీ! శుచీ! నాఁడుబట్టిన దీక్షలు నేఁడు విడుచుటకు॥ పోతున్నాముగా, శుచి మతానికి పోతున్నాముగా ॥కంక॥
శాబ్దిలన్నిటిని – చక్కఁజేసినామని, దోమలన్నిటిని, దుమ్ము చేసినామని, ఈగలన్నిటిని పర్చి తుడిచినామని, ఎలుకలన్నిటిని మట్టి పివేసినామని, పేలన్నిటిని పేరుమాపినామని –పోతున్నాముగా – శుచిమతానికి పోతున్నాముగా –చేసిన విధి చెప్పపోతున్నాముగా ॥కం॥

విశారద శిష్యుఁడు—(ప్రవేశించి) అయ్యో! పాపము! శుచికొలువు చేసికొనుచు మహానందమున వచ్చుచున్నారు ఈ పల్లెల జనులు! శ్రీధన్వంతరిభాగముచే మహాభక్తితో జరుపుచుండు మునులకు రాక్షస గర్జనవలె ఈ దుర్వార్త నెట్లు చెప్పుదును శ్రీ శుచిదేవతా భక్తి పారవశ్యమున నుండు ఈ శిష్యబృందమునకు?

(ప్రకాశము)

అయ్యలారా! చెప్పక తప్పదు. మీ వాద్యములు నిలుపుఁడు. ధన్వంతరిగారికి న్యూమోనియా జ్వరము.

జనులు—అయ్యో! ధన్వంతరి ప్రభూ!

విశా॥ శి—ఆత్రేయులవారికి బొబ్బలరోగము సంభవించినది.

జనులు—(అతిదైన్యముతో, నిస్పృహతో) ఇద్దఱు ధర్మప్రభులకా? (ఆక్రందనములు చేయుదురు)

విశా॥ శి—విశారదగురువులకు ఈ విషయము తెలియగనే పిచ్చిపట్టినది.

జనులు—అయ్యయ్యో! అయ్యయ్యో! మా గురువులకు కూడ పిచ్చిపట్టినదా? ఇఁకెవరికి ఈ ముడుపులు చెల్లింతుము ఎక్కడ మా కంకణాలు విప్పుదుము.

(ఏడ్చుచు కంటినీరు తుడిచికొనుచు)

ఒకయువతి (బిడ్డను జూపుచు)—తండ్రీ! ధన్వంతరిరాజా! యీ బిడ్డను నా పొట్టనొలిచి తీసి నాకుగతి గలుగ జేసితివే!

ముసలివాడు—నాయనా! ఆత్రేయా! ఎట్లున్నావో నా తండ్రీ! నాకు కడుపులో నీరుబల్ల పెరిగినప్పుడు ఎంత ఆదరణతో మందులిచ్చి పథ్య పానాలతో బాగుచేసినావయ్యా!

ఒక పురుషుడు—తండ్రీ! విశారదగురూ! మా గుడిసెలు తీయించి యిండ్లు కట్టించి ఊరూరికి బావులు త్రవ్వించి బాటలు వేయించిన పుణ్యము ఎట్లుపోయెనయ్యా! మాకు ఇక ఉపదేశము చేసే వారెవ్వరయ్యా! నిర్బంధముగా ఉచితముగా చెప్పించిన చదువు ఫలము బీడుపడెనటయ్యా!

విశా॥ శి—మరేమియు భయములేదు. అమరావతికి, ఆశ్వినేయుల వైద్యాలయమునకు వారినెల్లర విశ్రాంతి రథములపైఁ గొనిపోయిరి. వారికొరకు మాత్రలు శుచిసుధలు, నిరుపమానమైనతమధాత్రేయికా కళాచాతుర్యమున నిండు వాత్సల్యముతో వీరికి పథ్యపానాది సపర్యలు ఒనర్పఁగలరు. ఇక అశ్వినేయులకు అశక్యమగు వ్యాధిలేని విషయము మీరు విని యుండవచ్చును.

సీ॥ వీరభద్రుండుకాల • విఱుగఁ దన్నినసూశి
చుక్కల కెగసిన • సూర్యుపల్లు
శరఘాతరక్తంపు • ఝురధార చిమ్మంగ
దైన్యావనతమైన • దక్షుశిరము
ముందుకు సొరిగెడు • ముక్కాలి ముదుకని
బెండుగా నిగిరిన • వీర్యపటిమ
చ్యవను శాపంబున • నమరులు తలవంపఁ
గొయ్యవారిన యింద్రు కుడిభుజంబు
గీ॥ బాగుపఱుపరే యాశ్వినుల్ • ప్రథితకీర్తి
వారి యంశమే వంశమే • వారిమూర్తి
స్వాస్థ్యశీల భిషక్ సామ్రాజ్య • చక్రవర్తి
ఆశ్వినిప్రభుండే తీర్చు • నయ్య! యార్తి॥

జనులు—(ఊరడిల్లినట్లు ఆశతో నిట్టూర్పు బుచ్చి)

గేయము.

మానాయలను మాలోనగలిపి మమ్మునేలుమా! తల్లీ! శుచిదేవి! ॥మానా॥
మాతండ్రులకు బాధలు లేకుండ మమ్ముగావుమా! తల్లీ! శుచిదేవి! ॥మానా॥
మాగురువులకు ఆయువుపోయుచుమమ్ము బ్రోవుమా! తల్లీ! శుచిదేవి ॥మానాయనల॥

(టెంకాయకొట్టి కర్పూరము వెలిగించి పొకటించి, చేతులు జోడించి)

### గేయము.

అమ్మతల్లీ! శుచిదేవతా! ప్రోవుమమ్మా! చల్లని మాఅయ్యలను ॥అమ్మతల్లీ॥
మల్లెమొల్లల మంటపంబున - నిండుచంద్రుఁడు నిద్రదివ్వెటఁ బట్టఁగా,
తళ్కుతళ్కని ధిమ్మి ధిమ్మని - తారకావళులాడఁగా,
చలువగంధపుగాలి మొలఁకువవీవఁగా,
వాణివీణెతో తేనెసోనలు గురియఁగా,
మహాలక్ష్మికలిసి మంగళారతి పాడఁగా,
లోకములేలు త్రిలోక జనని!-తల్లీ! శుచిదేవతా! ॥అమ్మ॥

ఒక పురు—చంద్రులారా! మీకు అందరికి ఒకటేసారి జాలమున కంతా చుట్టుకొనినవా కనిపెర్చుకొను టకి మారులు!

ముసలివారిడు—అందరము గలిసి ఆ అమరావతికి పోయి మన చంద్రులనుకళ్ళచూస్తాం.

(నిష్క్రమింతురు.)





# చతుర్థాంకము.

## దృశ్యము 1.

అమరావతి; వైద్యాలయము. ; వ్యాపారి సమండి యుండును.

(చిన్నబల్లపయి పానీయము అమర్పఁబడియుండును. ధన్వంతరికి ఏమాత్ర లేకుండ వెనుకవైపుగా శుచి ప్రవేశించి సపర్యాసామగ్రి నమర్చుచుండును.)

శుచి—(స్వగతము)

ఆహా! యేమీ శస్త్రవైద్యుని సోయగము!

మ॥ కనులందుం బరిశోధనోచిత సుదృ ♦ గ్గాంభీర్య మొప్పారెడిన్
ఘనమై చాలవెడందమై, యమరు వ ♦ క్షంబెంతో ధైర్యాంకమై
కనరూపెత్తిన శస్త్రికౌశలము నా ♦ గాంతిల్లు సన్నంబు ల
య్యును దీర్ఘంబులుగాంగ వ్రేళ్ల ♦ వహహా! యుల్లంబురంజిల్లఁగన్॥

జనకుఁడు వచ్చువేళ యగుచున్నది గనుక నేను పాత్రలు అమర్పవలయును (అట్లొనర్చుచుండును)

ధన్వ—కల్యాణపురమునుండి యిటకు వచ్చినది మొదలు వారము దినములు నాకు ప్రపంచస్మృతియే లేదు. నాకు ప్రజ్ఞవచ్చుచుండఁగ నపుడు శుచి సుందరమూర్తిమాత్రము నాకు ఉచితోపచారములు సలుపుచుంట గనుచుంటిని.

ఆహా!

సీ॥ దరహాసపూర్వమై ♦ తరితీపులొలుకుచు
ప్రాణంబువోసెడిఁ ♦ బడఁతిపలుకు
మించుతళ్కులమోము ♦ మంచు చెమ్మట గ్రమ్మ
రహిసపర్యలుసల్పు ♦ రమణిహాయలు
వల్లరీగతిడాసి ♦ వాసిఁ బ్రశ్నించుచో
లాలించి జోకొట్టు ♦ లలితకరుణ
మణిబంధము స్పృశింప ♦ మైగగుర్పడఁజేయుఁ
బన్నీరు పూతేకు ♦ వనిత కేలు

గీ॥ స్వాస్థ్యమందారవనా కళికా • సౌఖ్యగాఁడియుఁ
ప్రౌఢలావణ్యశృంఖలఁ • బట్టికట్టి
భువనమోహన వీక్షలఁ • బుదురులాగి
భామ నిజమూర్తిలో నన్ను • బందెఁజేసె॥ (అర్ధాకర్ణితము.)

(శుచి, ధన్వంతరికి తెలియకుండనే పడక వద్దికి వచ్చును.)

శుచి—(స్వ)

భామ నిజమూర్తిలో నన్ను బందెజేసె (తనలో నవ్వుకొనుచు)

(ప్రకాశ) అయ్యా! శస్త్రప్రయోగధీవరా! యేమి యౌషధంబుల నియతకాల పానము ను ఉపేక్షించితిరి.

ధన్వం—నాకిప్పుడు జ్వరమువచ్చుట నిలిచి ప్రేలికాటు బాధయు తగ్గెను. కొంతదేహపటిమయు వచ్చుచున్నది. "ఇన్నిదినములు జాగరణోపవాసములచేత తననిద్రాహారములు ధారవోసిన శుచిరేఖయే దేహపునరారోగ్యమునకు కారణము" ఆ అశ్వినేయులు సెలవిచ్చిన వాక్యము నేను మరల మరలఁ దలఁచికొనుచుఁ గొంచెము ఏమఱితిని. మన్నింపుము.

శుచి—అవును! ప్రేలికాటు బాధలు తగ్గఁగాన కరుణాకరము అదృశ్యమయినది.
దేహపటిమ హెచ్చఁగావుననే శృంగార రసము ఉభయముపై వెల్లి విరియుచున్నది.

ధన్వం—(చిఱునగవుతో) ఎవరిమూలమున?

శుచి—ఎవరిమూర్తిలో నీవు బందెవైతివో వారిమూలమున.

ధన్వం—(స్వ) నిశ్చయముగా నాభావము ఇప్పుడు వెలిబుచ్చియుండలేను. ప్రణయ భావడోలికా సంభ్రమమున నాకు ఎఱుకలేకయే మాటలు నానోటినుండి జాఱివచ్చెనాయేమి! సురూపాలతో నాపై అసూయాగ్రస్తయగునాయేమి?

(ప్రకాశముగా)
శుచీ! నీకు తెలియదా? యిచట నీవు గాకుండిన మఱెవ్వరు గలరు?

శుచి—లేరా మఱి కల్యాణపురిలో?

(ధన్వంతరి ఆశ్చర్యపడుచు బదులు పలుకకుండు ముందే)

శుచి—అయ్యా! ఆత్రేయులవారు మీకు నెమ్మదిగా నుండుటచే నేటిసాయంకాలమున సెలవుతీసికొని ప్రమదవనమున కొంత సేదదీర్చికొన మాజనకుల వేఁడుకొంటిమి. నేఁటినియమిత కాలమునకు వారిఁక ను రారైరి. నేనుఁబోయి వచ్చెదను.
అదే ఆత్రేయులిటకే సహాయునితోడ వచ్చుచున్నారు.

(నిష్క్రమించును.)

(ఆత్రేయుఁడు ప్రవేశించును).

(ధన్వంతరి, శుచివైపుఁగల మోహదృష్టి మరల్పఁబడకనుండి సంభ్రమముతో చివాలున క్రిందికి దుమికి ఆత్రేయుని కౌఁగిలించుకొనును.)

ధన్వం—ఆత్రేయా! మనమీ ప్రపంచమున వెండియు కలిసికొనఁగలమని నేను కలనైనఁ దలఁపలేదు. అనవద్య జాగరూకతతో ధాత్రేయీత్వ మాచరించి నిద్రాహారములు ధారవోసిన శుచియే నాప్రాణమునకు ఆధారమాయె.

ఆత్రే—మిత్రమా! నేను చెప్పకముందే వచించితివి. ఆసుధాహస్త స్పర్శనముచే, సపర్యచే, నాదేహమంతయు సుధావ్యాప్తమై కడు శీఘ్రకాలముననే బొబ్బలవ్యాధి బారినుండి తొలఁగింపఁబడి పునరారోగ్యము వడసితిని.

ధన్వం—మాచితే! నాశాస్త్రము నీవైద్యము ఎంత ప్రయోజకములయినను సరియైన ధాత్రేయీసాహచర్యము లేనిదే కడఁ జూడఁజాలవు.

ఆత్రే—ధన్వంతరీ! నీవు శుచియే ప్రాణాధారమనియు, ధాత్రీసాహచర్యము లేనిదే శస్త్రము ప్రకాశింపదనియు, వచించెదవు. నీభావమేమి? ప్రాణబాధానివారణ పరాయణత్వమే మనకు పరమావధి యని అనుకొని యుంటిమి. వివాహాది బంధములు సరిగాదని విముఖులరమయియుంటిమి! ఇప్పుడన్నియు పూర్వపక్షమై యున్నట్లున్నదే?

ధన్వం—ఆత్రేయా! క్షమింపుము. నేను వేఱువిధముగా వచింపలేనుకాని, నాకు ఆయాశయమందు మాత్రము మార్పు గలిగినది.

ఆత్రే—నేనును గంభీరముగా నుండిన వంచకుఁడ నందువేమో? నాకును సరియైన సహధర్మచారిణిని ఎప్పటికైనఁ బడయవలసిన భాగ్యముండిన సుధను దక్క అన్యులవరింపఁజాల.

ధన్వం—వ్యాధిగ్రస్తులకు కదా తెలియును, ధాత్రేయీసపర్యా ఫలము? అట్టి ధాత్రేయీత్వమందు ఆరితేఱిన భార్య దొరకుటయే పరమభాగ్యము.

ఆత్రే—సుధయు సాభిప్రాయవీక్షణముల, ధ్వని వచనముల నాభావమెంతయుఁ గరఁగించె. నీ మాటలు చూడ శుచిమూలమున నీవు నట్టి దశయందే యుంటివని తలఁచెదను.

ధన్వం—అటులయిన అశ్వినేయులకు మనసంకల్పము నివేదింతమా?

ఆత్రే—అశ్వినేయులు నాప్రాణములు సుధవలన నిలిచెననిరి. వారి సంకల్పము నట్టిదిగానే దోఁచెడిని.

ధన్వం—నాకును అటులేచెప్పిరి. అయినను వారినోట వెలువడనిదే వారి సంకల్ప మిట్టిదని మనమెట్లు నిర్ధారణ సేయఁగలము?

ఆత్రే—మునుముందుగా శుచిసుధల సంపూర్ణాభీష్టములు వడసిరయే వారి జనకులకు మన కోరికలు దెలుపుట లెస్స.

(ఆత్రేయుఁడు ప్రవేశించును).

(ధన్వంతరి, శుచివైపుఁగల మోహదృష్టి మరల్చి పడకనుండి సంభ్రమముతో చివాలున క్రిందికి దుమికి ఆత్రేయుని కౌఁగిలించుకొనును.)

ధన్వం—ఆత్రేయా! మననీ ప్రపంచమున రెండియు కలిసికొనఁగలమని నేను కలనైనఁ దలఁపలేదు. అనవద్య జాగరూకతతో ధాత్రేయీత్వ మాచరించి నిద్రాహారములు ధారవోసిన శుచియే నా ప్రాణమునకు ఆధారమాయె.

ఆత్రే—మిత్త్రమా! నేను చెప్పకముందే వచించితివి. అసుధాహస్త స్పర్శనముచే, సపర్యచే, నా దేహమంతయు సుధావ్యాప్తమై కడు శీఘ్రకాలముననే బొబ్బలవ్యాధి బారినుండి తొలఁగింపఁబడి పునరారోగ్యము పడసితిని.

ధన్వం—చూచితే! నా శాస్త్రీయ నివైద్యము ఎంత ప్రయోజకములయినను సరియైన ధాత్రేయీసాహచర్యము లేనిదే కడఁ జూడఁజాలవు.

ఆత్రే—ధన్వంతరీ! నీవు శుచియే ప్రాణాధారమనియు, ధాత్రీసాహచర్యము లేనిదే శస్త్రీయము ప్రకాశింపదనియు. వచించెదవు. నీభావమేమి? ప్రాణబాధానివారణ పరాయణత్వమే మనకు పరమావధియని అనుకొని యుంటిమి. వివాహాది బంధములు సరిగాదని విముఖులరమయియుంటిమి! ఇప్పుడన్నియు పూర్వపక్షమై యున్నట్లున్నదే ?

ధన్వం—ఆత్రేయా! క్షమింపుము. నేను వేఱువిధముగా వచింపలేదుకాని, నాకు ఆయాశయమందు మాత్రము మార్పు గలిగినది.

ఆత్రే—నేనును గంభీరముగా నుండిన వంచకుఁడ నందువేమో? నాకును సరియైన సహధర్మచారిణిని ఎప్పటికైనఁ బడయవలసిన భాగ్యముండిన సుధను దక్క అన్యులవరింపఁజాల.

ధన్వం—వ్యాధిగ్రస్తులకు కదా తెలియును, ధాత్రేయీసపర్యా ఫలము ? అట్టి ధాత్రేయీత్వమందు ఆతితేఱిన భార్య దొరకుటయే పరమభాగ్యము.

ఆత్రే—సుధయు సాభిప్రాయవీక్షణముల, ధ్వని వచనముల నాభావమెంతయుఁ గరఁగించె. నీ మాటలు చూడ శుచిమూలమున నీవు నట్టి దశయందే యుంటివని తలఁచెదను.

ధన్వం—అటులయిన అశ్వినేయులకు మనసంకల్పము నివేదింతమా ?

ఆత్రే—అశ్వినేయులు నా ప్రాణములు సుధవలన నిలిచెననిరి. వారి సంకల్పము నట్టిదిగానే దోఁచెడిని.

ధన్వం—నాకును అటులేచెప్పిరి. అయినను వారినోట వెలువడనిదే వారి సంకల్ప మిట్టిదని మనమెట్లు నిర్ధారణ సేయఁగలము ?

ఆత్రే—మునుముందుగా శుచిసుధల సంపూర్ణాభీష్టములు పడసిరయే వారి జనకులకు మన కోరికలు దెలుపుట లెస్స.

ధన్వం—నేఁటి సాయంకాలము ఉద్యానవనమునకుఁ దానును సుధయు పోయెదమని శుచి నాతోఁ జెప్పి పోయెను. మనమును ఏల అటకుఁ బోవ ప్రయత్నింపరాదు ?

ఆత్రే—సుధయు నాతో నట్లే నుడివెను. అదిగో ! వారిటకు వచ్చుచున్నట్లున్నది.

(ఆశ్వినేయుఁడు ప్రవేశించును. ఆత్రేయధన్వంతరులు లేచి నిలిచెదరు.)

ధన్వ—మహాప్రభూ! తమ యుత్తరవు మేరకు నేటికి ఇటకు ఆత్రేయుఁడువచ్చె. తమ ప్రభావమున నేఁడు మేమిరువురము ఒండొరులమొగములు చూచికొనఁ గలిగితిమి.

ఆశ్వినే—మా ప్రభావము అవంతయులేదు. అంతయు శ్రీ శుచిదేవీప్రభావము, దేవి హస్తమందలి సుధా ప్రభావము. తన్నామధేయములు గలుగు మీధాత్రేయి కల ప్రభావమును

ధన్వం—ప్రమదవన విహారార్థమై యిప్పుడే శుచి యిచటనుండి పోయినది.

అశ్వి—అవును ! నేఁడు మిమ్ము ఒంటరిగా విడువవచ్చునని నేను తెలిపినందున ఈ భవనమునకు వెనుకనున్న ఆరామమునకుఁ బోవ నాజ్ఞఁబడసిరి. నేనిచటికి వచ్చుటకుముందే సన్నాహమునకై తరలియుండ వచ్చును. మీరును ఓపినమట్టుకు సాయంకాలములందు వనవాయువులలో వాహ్యాళివెడలుచుండుఁడు.

ఆత్రేయధన్వంతరులు—

మహాప్రసాదము !

(నిష్క్రమింతురు)

అశ్వి—(స్వగతము)

అహా ! ధన్వంతర్యాత్రేయులకు శిరస్నానమయి దాదాఁపుగా పూర్ణారోగ్యము వచ్చినందుకు సంతోషమేగాని విశారదునకు మాత్రము దేహమందలి వ్రణాదులుమాని మచ్చలుకూడ మానిపోవు చున్నను అతని ఉన్మాదావస్థ మాత్రము ఇంకను దొలఁగలేదు. ఎల్లప్పుడు విశారదుఁడు శుచిమత మనియు, శుచితత్త్వమనియు శుచి ఆగమనియు శుచి ఆలయప్రతిష్ఠాపన మనియు తద్విలాపము లలో నున్నవాఁడు. ఇతని దుస్థితి ఆత్రేయధన్వంతరులకుఁ దెలిపినయెడల వారి ఆరోగ్యపునరుద్ధర ణకు భంగము గలుగవచ్చునని వారికి విశారదు నుదంతము దెలుపవలదని శుచి సుధావనపాలికా దులతో కట్టుదిట్టముఁ జేసితిని. వారు సహజారోగ్యవంతులయిన పిదపనే వారికి ఈసమాచారము దెలుపుట లెస్స.సడిజూడ శుచి ధన్వంతరులకును సుధఆత్రేయులకును పరస్పరాను రాగములల్లుకొని నట్లున్నవి. నాయూహ సరియైనయెడల వారికి ఇటనే వివాహ మొనరించుట మంచిది.

అయిన ఈలోన విశారదుని అదారోగ్యముఁగూడఁ జక్కఁబడ శ్రీశుచ్యాలయము సంపూర్తి యుఁ గావలయుఁగదా!

(నిష్క్రమించును.)

దృశ్యము 2.—పూర్ణిమ—సాయంకాలము—అమరావతి—ప్రమదవనము.

(కుసుంభినీ ఫిరంగిణులు ప్రవేశింతురు.)

కుసుం—అక్కా! వసమని కష్టమంతయు శుచిసుధలమూలమున వ్యర్థమైనట్లు పొడకట్టుచున్నది.

ఫిరం—ఆత్రేయ ధన్వంతరులు ఇంచుమించుగ పునరారోగ్యము పొందిరని జనపత్రికయె తెలిపెనుగదా?

కుసుం—అదిచెప్పినట్లు శుచిసుధలు వత్తురన్న కాలము ఆసన్నమయినది.

ఫిరం—శుచి సుధలకు మనము చెలికత్తెలమయి యొంటరిపాటున ఈ తుంటరికత్తెల తంటదీర్చెదము

కుసుం—అదిగో! వారు వచ్చుచున్నారు. ముందు వచ్చుఆమె శుచి. వెనుకటిఆమె చెల్లెలుసుధ కాబోలు.

ఫిరం—చూచితివా! వారి ముఖప్రభలు గాంచిన నాకేమో భయముగా నున్నది. నా పాదములు పరు గెత్తుటకు త్వరపడుచున్నవి. వడికన్ను ఆదరుచున్నది.

కుసుం—నాకును గుండె లదరుచున్నవి. అయినను మనము తొట్రుపడరాదు. వారిని సమీపించి తగు వచనముల మోసపుచ్చెదము.

గీతము.

శుచి—కనుమాసుధా!–వనేందిరమణి– కులుకు–సొలపు–కెం–జిగులన్–తళ్–కలరన్–త్రా–
రకముల్ కదుర్ బులకలరస మొలకెడు కనుమా!

సుధ...రమ్మా–విను కను–కోయిల–గండుల్–ప్రణయము–వినిచెడు గీ–తా–రవముల–మధు
రిమ్–బిబ్బో–కపుగరితల్–సోలువిధము. కనుమా శుచీ.

శుచి...ఈ యరుణపు కళ లుడుగుర్ పడపడవమ్మా! సరసిజలాసన్– ప్రకృతిలలామం –
బడుగిడు ఛాయా నాట్యము గన కనుమా సుధా.

(కుసుంభినీ ఫిరంగిణులు సవినయంబుగా నెదుర్కొందురు.)

కుసుం—అమ్మలారా! పరిచారికా జీవికకై వచ్చితిమి. తమకీర్తి ఈ పురంబున విని మీరు ఇటకు వత్తురని కాచుకొనియుంటిమి. మీకు పనికత్తె లవసరమని వింటిమి.

(జనాంతికము. సుధతో)

శుచి—వీరెవ్వరో లావణ్యవతులుగా నున్నారు. ముఖవికాసము జాణతనమును చాటుచున్నది.

సుధ—(శుచితో) వీరి మంచిచెబ్బర గుర్తెఱిగియే పనికి ప్రవేశపెట్టెదము.

శుచి—సరి! మీరు రేపుదయమున శ్రీ ఆశ్వినేయుల సభామంటపమునకు వచ్చిన వారి అనతి చొప్పున వలసినచో మిమ్ము నియోగింతుము. మీకు సెలవు.

ఫిరం—అయిన ప్రస్తుతము సెలవు గైకొందుము.

(కుసుంభిని ఫిరంగిణులు ముందుపోవుదురు. శుచి సుధలు విహరించుచుందురు.)

కుసుం—అక్కా! యెంతగర్వవతులే వారు? శుచి మన మొగములనుండియే యావద్విషయములఁ జదువునట్లు మిడిగ్రుడ్లతో రెప్పవాల్పక చూచెను.

ఫిరం—సుధ మూతి బిగించుకొనియేమో అశుచి చెవిలో చెప్పి మనవంక చూచిన అపవిత్రత వాటిల్లునోయనునట్లు పెడమొగము పెట్టుకొనెను.

కుసుం—మనమీ దట్టపు పొన్నలచాటున దాఁగి వీరి ఆటలఁ జూచెదము. (అట్లుదాఁగియుండెదరు.)

శుచి—చెల్లెలా! నేఁటికిఁగదా! మనజన్మలు సార్థకములయ్యెను. ధన్వంతరి వచ్చినపుడుండిన స్థితిఁగాంచి నపుడు జనములకు ధైర్యము చాలినదికాదు. వెండియు నిన్న నేఁడు భూమిపై పాదము మోప గలిగినందున నేఁడుమనకు ఇటుల విహరింపఁబోవ ననుజ్ఞ నొసఁగిరి!

సుధ—అక్కా! బొబ్బలరోగమువలన బాధనొందుచుండిన ఆత్రేయుల సంరక్షించుటలో ఈనెల దినములును నేను మీకు వేరైయుండవలసి వచ్చెగదా: నిన్న నేవారికి శిరస్స్నానమాయెను. శ్రీశుచిదేవి కృపాకటాక్షమున వారికి పునరారోగ్యము వచ్చినందువలన నేఁడు ధన్వంతరిగారి యొద్దకు సహాయునితోఁడఁ బోవ సెలవొసంగి జనకులు నీతోడి విహారార్థము నన్నిటకుఁ బంపిరి.

శుచి—కల్యాణపురమందలి జనులందరు గుంపులు గుంపులుగా వచ్చి యిచటనే వసించుచున్నారు. ధన్వంతరి శస్త్రచికిత్సా ప్రతిభయు ఆత్రేయ కాయరక్షావిధానమును శ్రీశుచిమతముచే ఆప్రజలుపొందిన ఆయురారోగ్యైశ్వర్యంబులు వేనోళ్ళ వినుతించుచు అహర్నిశాదులు వీరి ప్రాణరక్షణకయి శ్రీశుచి సంకీర్తనంబులు సలుపుచున్నారు.

సుధ—ఆత్రేయులు వారిరోగులకు ఆచటమునవంటి ధాత్రేయికలు లేరని నుడువుచు, వైద్యునకు సుధవంటి ఔషధమును, రోగికి పథ్యపానాది సపర్యలమర్చి పోషించుటకు సుధవంటి ధాత్రియు వలయునని చమత్కారముగాఁ బలికిరి.

శుచి—అవునమ్మా ఆ ధన్వంతరియు సాభిప్రాయ వీక్షణముల నన్నుఁజూచి, జాణతనపు భాషణములనాదరింపుచుండును.

సుధ—మనజనకులు ఎన్నఁడు చెప్పనిది గృహస్థ ధర్మమే శ్రేష్ఠమనియు మాతృత్వముకంటె మహిళధర్మము స్త్రీజన్మమునకు వేఱె లేదనియు తాను కొమరితలుగాఁ గాంచిన మనల వివాహితలుగాఁజూడ కాంక్ష గలిగె ననియు మొన్న వాకొనిరి.

శుచి—అందుకు నీవేమంటివి?

సుధ—నే నూరకుంటిని.

ధన్వం—నేఁటి సాయంకాలము ఉద్యానవనమునకుఁ దానును సుధయు పోయెదమని శుచి నాతోఁ జెప్పి పోయెను. మనమును ఏల అటకుఁ బోవ బ్రయత్నింపరాదు?

ఆత్రే—సుధయు నాతో నట్లే నుడివెను. అదిగో! వారిటకు వచ్చుచున్నట్లున్నది.

(అశ్వినేయుఁడు ప్రవేశించును. ఆత్రేయధన్వంతరులు లేచి నిలిచెదరు.)

ధన్వ—మహాప్రభూ! తమ యుత్తరవు మేరకు నేటికి ఇటకు ఆత్రేయుఁడువచ్చె. తమ ప్రభావమున నేఁడు మేమిరువురము ఒండొరులమొగములు చూచికొనఁ గలిగితిమి.

అశ్వినే—మా ప్రభావము అవంతయులేదు. అంతయు శ్రీ శుచిదేవీప్రభావము, దేవి హస్తమందలి సుధా ప్రభావము. తన్నామధేయములు గలుగు మీధాత్రేయి కల ప్రభావమును

ధన్వం—ప్రమదవన విహారార్థమై యిప్పుడే శుచి యిచటనుండి పోయినది.

అశ్వి—అవును! నేఁడు మిమ్ము ఒంటరిగా విడువవచ్చునని నేను తెలిపినందున ఈ భవనమునకు వెనుకనున్న ఆరామమునకుఁ బోవ నాజ్ఞఁబడసిరి. నేనిచటికి వచ్చుటకుముందే స్నానమునకై తరలియుండ వచ్చును. మీరును ఓపినమట్టుకు సాయంకాలములందు వనవాయువులలో వాహ్యాళి వెడలుచుండుఁడు.

ఆత్రేయధన్వంతరులు—

మహాప్రసాదము!

(నిష్క్రమింతురు)

అశ్వి—(స్వగతము)

ఆహా! ధన్వంతర్యాత్రేయులకు శిరస్స్నానమయి దాదాఁపుగా పూర్ణారోగ్యము వచ్చినందుకు సంతోషమేగాని విశారదునకు మాత్రము దేహమందలి వ్రణాదులుమాని మచ్చలుకూడ మానిపోవుచున్నను అతని ఉన్మాదావస్థ మాత్రము ఇంకను దొలఁగలేదు. ఎల్లప్పుడు విశారదుఁడు శుచిమతమనియు, శుచితత్త్వమనియు శుచి ఆగమనియు శుచి ఆలయప్రతిష్ఠాపనమనియు తద్విలాపములలో నున్నవాఁడు. ఇతని దుస్థితి ఆత్రేయధన్వంతరులకుఁ దెలిసినయెడల వారి ఆరోగ్యపునరుద్ధరణకు భంగము గలుగవచ్చునని వారికి విశారదు నుదంతము దెలుపవలదని శుచి సుధావనపాలికాదులతో కట్టుదిట్టములుఁ జేసితిని. వారు సమాజారోగ్యవంతులయిన పిదపనే వారికి ఈసమాచారము దెలుపుట లెస్స. సడిజాడ శుచి ధన్వంతరులకును సుధ ఆత్రేయులకును పరస్పరానురాగములల్లుకొని నట్లున్నవి. నాయూహ సరియైనయెడల వారికి ఇటనే వివాహ మొనరించుట మంచిది.

అయిన ఈలోన విశారదుని ఆదారోగ్యముఁగూడఁ జక్కఁబడ శ్రీశుచ్యాలయము సంపూర్తియుఁ గావలయుఁగదా!

(నిష్క్రమించును.)

దృశ్యము 2.—పూర్ణిమ—సాయంకాలము—అమరావతి—ప్రమదవనము.

(కుసుంభిణీ ఫిరంగిణులు ప్రవేశింతురు.)

కుసుం—అక్కా! మనమని కష్టమంతయు శుచిసుధలమూలమున వ్యర్థమైనట్లు పొడకట్టుచున్నది.

ఫిరం—ఆత్రేయ ధన్వంతరులు ఇంచుమించుగ పునరారోగ్యము పొందిరని వనపాలికయె తెలిపెనుగదా?

కుసుం—అది చెప్పినట్లు శుచిసుధలు వత్తురన్న కాలము ఆసన్నమయినది.

ఫిరం—శుచి సుధలకు మనము చెలికత్తెలమయి యొంటరిపాటున ఈ తుంటరికత్తెల తంటు దీర్చెదము.

కుసుం—అదిగో! వారు వచ్చుచున్నారు. ముందు వచ్చు ఆమె శుచి. వెనుకటి ఆమె చెల్లెలు సుధ కాబోలు.

ఫిరం—చూచితివా! వారి ముఖప్రభలు గాంచిన నాకేమో భయముగా నున్నది. నా పాదములు పరుగెత్తుటకు త్వరపడుచున్నవి. కుడికన్ను అదరుచున్నది.

కుసుం—నాకును గుండె లదరుచున్నవి. అయినను మనము తొట్రుపడరాదు. వారిని సమీపించి తగు వచనముల మోసపుచ్చెదము.

గీతము.

శుచి—కనుమా సుధా!-వనేందిరమణి-తులుకు-సొలపు-కెంజిగులన్-తెల్-కలరన్-త్రా.
రకముల్ కదురన్ బులకలరస మొలకెడు కనుమా!

సుధ...రమ్మా-విను కను-కోయిల-గండుల్-ప్రణయము-వినిచెడు గీ-తా-రవముల-మధు
రిమ-బిబ్బో-కపుగరితల్-సోలువిధము. కనుమా శుచీ.

శుచి...ఈ యరుణపు కళ లుడుగున్ పదపదవమ్మా! సరసిజలానన్-ప్రకృతిలలామం-
బడుగిడు ఛాయా నాట్యము గన కనుమా సుధా.

(కుసుంభిణీ ఫిరంగిణులు సవినయంబుగా నెదుర్కొందురు.)

కుసుం—అమ్మలారా! పరిచారికా జీవికకై వచ్చితిమి. తమకీర్తి ఈ పురంబున విని మీరు ఇటకు వత్తురని కాచుకొనియుంటిమి. మీకు పనికత్తె లవసరమని వింటిమి.

(జనాంతికము. సుధతో)

శుచి—వీరెవ్వరో లావణ్యవతులుగా నున్నారు. ముఖవికాసము జాణతనమును చాటుచున్నది.

సుధ—(శుచితో) వీరి మంచిసెబ్బర గుర్తెఱిగియే పనికి ప్రవేశపెట్టెదము.

శుచి—సరి! మీరు రేపుదయమున శ్రీ ఆశ్వినేయుల సభామంటపమునకు వచ్చిన వారి అనతి చొప్పున వలసినచో మిమ్ము నియోగింతుము. మీకు సెలవు.

ఫిరం—అయిన ప్రస్తుతము సెలవు గైకొందుము.

(కుసుంభినీ ఫిరంగిణులు ముందుపోవుదురు. శుచి సుధలు విహరించ జొచ్చుదురు.)

కుసుం—ఆక్కా! యెంతగర్వవతులే వారు! శుచి మన మొగములనుండియే యావద్విషయంబులఁ జదువునట్లు మిడిగ్రుడ్లతో రెప్పవాల్పక చూచెను.

ఫిరం—సుధ మూతి బిగించుకొనియేమో అశుచిచేతులలో చిక్కి మనవంక చూచిన అపవిత్రవాటిల్లునోయనునట్లు పెడమొగము పెట్టుకొనెను.

కుసుం—మనమీ దట్టపు పొన్నలచాటున దాఁగి వీరి యాటలఁ జూచెదము. (అట్లుదాఁగియుండెదరు.)

శుచి—చెల్లెలా! నేఁటికిఁగదా! మనజన్మలు సార్థకములయ్యెను. ధన్వంతరి వచ్చినపుడుండిన స్థితిఁగాంచినపుడు జనములకును ధైర్యము చాలినదికాదు. వెండియు నిన్న నేఁడు భూమిపై పాదము మోప గలిగినందున నేఁడుమనము ఇటుల విహరింపఁబోవ ననుజ్ఞ నొసఁగిరి!

సుధ—అక్కా! బొబ్బలరోగమువలన బాధనొందుచుండిన ఆత్రేయుల సంరక్షించుటలో ఈ నెలదినములును నేను మీకు వేరైయుండవలసి వచ్చెగదా: నిన్న నేవారికి శిరస్నానమాయెను. శ్రీశుచిదేవి కృపాకటాక్షమున వారికి పునరారోగ్యము వచ్చినందువలన నేఁడు ధన్వంతరిగారి యొద్దకు సహాయమునితోడఁ బోవ సెలవొసంగి జనకులు నీతోడి విహారార్థము నన్నిటకుఁ బంపిరి.

శుచి—కల్యాణపురమందలి జనులందరు గుంపులు గుంపులుగా వచ్చి యచటనే వసించుచున్నారు. ధన్వంతరి శస్త్రచికిత్సా ప్రతిభయు ఆత్రేయ కాయరక్షావిధానమును శ్రీశుచిమతముచే అప్రజలుపొందిన ఆయురారోగ్యైశ్వర్యంబులు వేనోళ్ళ వినుతించుచు ఆహర్నిశాదులు వీరిప్రాణరక్షణకయి శ్రీశుచి సంకీర్తనంబులు సలుపుచున్నారు.

సుధ—ఆత్రేయులు వారిరోగులకు ఆచటమనవంటి ధాత్రేయికలు లేరని నుడువుచు, వైద్యునకు సుధవంటి ఔషధమును, రోగికి పథ్యపానాది సపర్యలమర్చి పోషించుటకు సుధవంటి ధాత్రియు వలయునని చమత్కారముగాఁ బలికిరి.

శుచి—అవునమ్మా ఆ ధన్వంతరియు సాభిప్రాయ వీక్షణముల నన్నుఁజూచి, జాణతనపు భాషణములనాదరింపుచుండును.

సుధ—మనజనకులు ఎన్నఁడు జెప్పనిది గృహస్థ ధర్మమే శ్రేష్ఠమనియు మాతృత్వముకంటె మహితధర్మము స్త్రీజన్మమునకు వేఱె లేదనియు తాను కొమరితలుగాఁ గాంచిన మనల వివాహితలుగాఁ జూడ కాంక్ష గలిగ ననియు మొన్న వాకొనిరి.

శుచి—అందుకు నీవేమంటివి?

సుధ—నే నూరకుంటిని.

శుచి—జనపతే మనశ్రేయోనిర్ణేతలు. వారి ఆజ్ఞ దాఁటరాదు.

(శుచిసుధలు గుబురుచెట్లమాటు పుష్పాపచయము సలుపుచుందురు. సహాయులతో ఆత్రేయధన్వంతరులు ప్రవేశింతురు.)

(కుసుంభినీ ఫిరంగిణులు చెట్లమాటునదాఁగియుందురు.)

కుసుం—అక్కా వింటివా అక్కచెల్లెండ్ర సంభాషణము.

ఫిరం—అమ్మాయీలకు మదన మదయమైనది. (తిరస్కారముగా) శుచిమత కర్తలు వచ్చుచున్నారు. వీరినలువురిగోష్ఠి యింకను రసవంతముగా నుండఁగలదు.

కుసుం—వారేమో సంభాషించెదరు విందము.

ధన్వం—ఆత్రేయా కంటివే యీయుద్యానవన రామణీయకము, వెనుకనుండు కొండఝరియల సోయను.

ఆత్రే—కనులపండువుగ నున్నది.

సీసమాలిక.

ధ- ధవళమంజరివిప్పి • తాండవం బాడెడు
పరిమళమల్లికా • వాటిఁగనుమ
ఆ- కెంజాయపులకలఁ • గ్రీఁజూపులను నవ్వ
గన్నేరుగున్నల • కాంతిఁగనుమ
ధ- మనముల నలరించు • మంజులారవములఁ
బక్షులుదయసేయు • భిక్షఁగనుమ
ఆ- ముత్యాలజల్లుల • ముగ్గులఁజిమ్మెడు
తుంపురుబుగ్గల • సొంపుఁగనుమ
ధ- వగమారి పవనుపై • బిగిజూపి హసియించు
నిద్దంపుఁ బొన్నల • నీటుఁగనుమ
ఆ- నడుదార్ల కెలఁకుల • నజరు గొలలఁబూనుఁ
బోకల వనలక్ష్మి • పూజ గనుమ
ధ- ఝురధారలందోఁగి • విరితేనెలం గ్రోలి
మందానిలుఁడుదకాలు • మత్తుఁగనుమ
ఆ- ఫలభారశాఖల • వసుమతీజననికి
విసరిముద్దిడుమావి • వీథఁగనుమ
ధ—గీ॥ పసరుజీబులో చరియల • పజపులందుఁ
జివురు టపరంజి దీవియల్ • జేవురింప

నలరు టల్లిక తరగలం • దందువీవఁ
బ్రబలు గిరిరాజ లావణ్య • వార్ధిఁగనుము॥

ధీర—మీరు నిజముగా కవిరాజులైనారిపుడు.

వసు—అట్లా యిట్లా కూడానా! రోగిష్ఠిరాజులను కాలేదా? రంగరాజులు కాఁబోయెదరు.

ఆత్రే—వారు ఇచట లేరదా? యుందుమని వచించిరి. (పరికించి) ఎవరావచ్చుట?

(వనపాలిక ప్రవేశించును.)

వనపా—అయ్యా! నేను వనపాలికను. శుచి సుధాదేవిగార్లు ఈ నడదారివెంబడి పోకలవ జవల కోనేటి గట్టున పాదరిండ్లయొద్ద నున్నారు. తమరాక పెద్దపెభువుగారు వారికి కబురు చేయించినారు.

ధన్వం—ఎందులకు?

వన—దేవరలు నేడే పడక విడిచి బయటికి అడుగుపెట్టినారు. వంటికి జబ్బురావుండ అమ్మగార్లచూపులో నుంచే మంచిదని చెప్పి వుంటారు.

ఆత్రే—(జనాంతికము)
మీ కెందుకనుకొంటిరి?

ధన్వం—(జనాంతికము)
వారి సంకల్పమే మైన ధ్వనింపనేమోయని.

ఆత్రే—అచ్చటికే బోయెదము. దారిఁ జూపుము.

(ముందు వనపాలికయు వెనుక ఆత్రేయ ధన్వంతరులు వెడలుదురు.)

శుచి—(ముందుకువచ్చి) అయ్యలారా! మీరు నడచి బడలిక చెందియుందురు. ఈ చలువ రాతిన్నెపై ఇంచుక విశ్రమింపుఁడు.

ఆత్రే—అల్లదే! యీ పూచవికెలవ అవలి బృందావన మధ్యంబున చంద్రకాంతవేదికపైఁగూర్చుండెదను.

సుధ—అటులే చేయవచ్చును.

(సుధ ఆత్రేయులు ఇంచుక నడతురు.)
(ధన్వంతరి కూర్చుండును)

(శుచి, పయఁటచే విసరుచు)

శుచి—ప్రకృతి స్వభావ వికాసమును పునరుద్ధరింప నీ సాయంసమందు మెంత యుపచరింపుచున్నది.

శా॥ సోఁకించుఁ మలయానిలాప్తిఁ బవలన్ • స్రుక్కొందు ప్రాణంబులన్
పాఁకించుఁ సమతన్ జలాంబరములన్ • బర్వించి భూమణ్యమున్

లాలించుక సకలాంగకాంతియుతుఁడై ◆ లాలిత్యపుఁ నిద్దురన్
జాలిన్ బ్రాణుల సాకుదాదియగు సం ◆ జనగంటె ధన్వంతరీ॥

ధన్వం—ధాత్రేయికా ప్రతిమ సలిపి నీవు ఎయ్యంకాలమే గాను తలఁచునదంతయు ధాత్రేయీ మయముగా నుండుటలో నేమివింత! అయినను, నిలుకడ లేని యీ సంజనాదా, నీవు సాటిగాఁగలదా?

శుచి—పత్రసౌఖ్య మొసఁగెడు అయోషధీశ్వరుఁడును మీకు సాటిరాఁజాలఁడు. చూచితిరా! ఆపాడమూపు చున్న అపరంజిబింబము, పూర్ణిమాచంద్రుఁడు. విఖ్యాతమైన మీ హస్తవానికి వెలఁగఁది కళంకము. పేర తన ఆపయశస్సును ప్రకటించుకొనుచు వచ్చుచున్నాఁడు.

(శుచి ధన్వంతరులు అవ్వైపునకు నడచుదురు.)

(సుధ, ఆత్రేయునితో)

సుధ—ఈ పూచవికెల లావణ్యము చూడుఁడు.

ఆత్రే—చిత్తరువులకు జీవకళ దిద్దినట్లు ఛాయపసరులఁ గ్రేవుచున్నవి.

సుధ—

గీ॥ ఇంద్రునిధనస్సు చేజాఱి ◆ యిలకుఁ దూఁసి
భవ్యవల్లరీశయ్యల ◆ వ్రాలెననగఁ
ముదురులేఁతలో రంగుల ◆ ముద్దుఁగురిసి
నవనవగుళుచ్ఛముల పిండు ◆ నవ్వుచుండు॥

కుసుం—అమ్మాయీలు కూడా మొదలుపెట్టినారే!

ఫిరం—వీరి వర్ణనాప్రజ్ఞ చూపుకొనక—అతేమా?

ఆత్రే—రంగులతో మురిసియు నీయవి నీ మేనునందు విచిత్ర వస్త్రాభరణాలంకారముల ఛాయలవంటివే యగును. నీ సహజమగు రూపలావణ్యములకు సాటి, గుణములో మేలయిన పాదపజాతము ఇచ్చటే గలదు.

సుధ—అవి ఎయ్యవి.

ఆత్రే—అదిగో తులసీవనముఁ జూచుఁడు (ఇరువురు అటుజనెదరు)

ధన్వం—కాదు, కాదు, ఓషధీశ్వరుఁడు - సంజనాది; ప్రాణులనుసల్పు సపర్యలు పరీక్షింపవచ్చుచున్నాఁడు. నీవుగ నేఁడు వైద్యాలయంబున నన్ను పరీక్షించి అనుమానించితివి.

శుచి—అనుమానించితినా? ఆడించితినా?

ధన్వం—శుచీ! నీవు నన్నెప్పైనను చేయఁగలేవు. ఎక్కరపుల శుక్రాచార్యగాంచి గాఢపు వైద్యత్రి బడయఁ గంటిని. నీవలన నా ప్రాణములు నిలిచె కావున, నీయందే నా ప్రాణములు నిలిచె.

కుసుం—చాలమారము గడచిపోయినదే కథ.

ఫిరం—మ జేమనుకొన్నావు. అక్క చెల్లెండ్రు అట్లా ఉన్నారనుకొన్నావా? పరాణిరాతులు గాదటవే?

ఆత్రె—నాఁడు పరమేశ్వరుఁడు స్వహస్తమున అమృతముతో చేఁడవేయగ సంహరించి శ్రీ మహావిష్ణు వియోగోన్మాదమును బాపిన బృందావనమే నీవు సటి.

గీ॥ దివ్యసుధచేఁ బూర్ణమై • తేజరిల్లు
కశ్రమ బృందా లతావళిఁ • గాంచఁగాంచ
నొక్కటొక్కటియు నీడగు • నుజ్జ్వలంపు
మూర్తికిఁ బ్రతిమూర్తిగ భావ • ముద్రయొసఁగు॥

సుధ—తులసీ క్షారమును శోధనశాలలలో వెలెనే సుధాసారము ప్రమోదవనమున పరిశీలించిప బూసినారే?

కుసుం—నాఁడు వసపుఁడు తులసీక్షారములనే అయ్యగారిని పప్పులో కాలు వేయించినాఁడు.

ఫిరం—మనముకూడ నేఁడు అమ్మగార్లకు ఒకచేయి జూపుదము తులసితోట దగ్గఱనే,

(శుచి కొంచెము ముందుకు నడచుచు)

శుచి—తమ చమత్కార వచనములకేమిగాని, నా ప్రాణపుత్రకుఁ జూచితిరా?

(చేతితో ధన్వంతరిని బిలుచుచు)

(గులాబి గుబురువద్ద నిలిచి)

చివురు మంజరులను తోపుఁగక సదా పూవుటంగిఁదాల్చి నిత్య కల్యాణమూర్తియై మనలఁ బిలుచునట్టి యీ వసంతకుమారు గులాబినూనుని గాంచుఁడు.

ధన్వం—ఏమి యీ గులాబిగుబురు విదల్చు సౌరభ్యము! ఎంతపావనము! ఎంతపరిపూర్ణము! ఎంతఆశాజనకము! ఆహా! యేమి యీ సౌభాగ్యరాశి తారుణ్యలావణ్యము! ఇది జగజ్జనని శ్రీశుచిదేవి వామకరమందలి అమృతకలశమునఁ బొదలు పుష్పాలంకృతిని దలంపుచన్నది.

సీ॥ చెంగావివెన్నెలఁ • జెమరు తెమ్మెరసంజ
విరిపాడివాసనల్ • విసరుచుండ
సాష్టాంగమొనరించి • చల్లనికరములన్
బూర్ణచంద్రుఁడు భక్తి • బూజసేయ
దివిజసీమంతినుల్ • దిన్నఁగాఁ బాడుచు
దవ్వులఁజుక్కల • దివ్వెలెత్త
కలధౌత వస్త్రంబు • గట్టి ప్రాగ్దిక్సతి
యరుణనీరాజనం • బలవరింప

గీ॥ వజలు శ్రీశుచి భగవతి • వామహస్త
కలితభువనరక్షణ సుధా • కలశమందుఁ
బొదలుకై సేత మంజరిఁ • బోలు నీదు
నిలువు పూరాసులగులాబి • యలరుఁగున్న॥

శుచి—ఇపుడు శ్రీశుచిదేవతా పూజావసరమున ఈపుష్పమాలలను సుధాకలశమున అలంకరించుటె జన్మఫలకపుడు పరమప్రీతి.

(ఒక పుష్పము ధన్వంతరి అంగీకి గ్రుచ్చును.)

ధన్వం—శ్రీశుచిదేవతయే నాకును శస్త్రవైద్యముసలుపు ప్రతి భిషగ్వరునకును ఇష్టదేవత. అమ్మా! దేవి యీ భక్తునిపై పరిపూర్ణకృపాకటాక్షములుంచియే తన నామధేయమే గలుగు నిన్ను నా ప్రాణములు గాఁపాడుటకై బుత్తెంచినది.

(శుచి, తలవాంచి నేలను పడికాలు బొటన వ్రేలితో వ్రాయుచుండును.)

వసుం—ఏమి యీ దొంగభక్తి.

ఫిరం—కాదే ప్రణయభక్తి యిదియొక పంథ.

ధన్వం—మిన్నపండుటయే అభయహస్తమని తలంచెద.

(ఆ గులాబి పుష్పముతో శుచి చెక్కిలి తట్టుచున్నాఁడు.)

ఫిరం—అమ్మా! చూచుచున్నావా?

వసుం—చూచుచున్నాను. వినుచునున్నాను. వీరికి జోడీలు కుదిరినట్లున్నది.

ఫిరం—బ్రదికించినదే గాక వీరిని గట్టికొని శుచినుధలు సంసారాలుచేసిన మనము నిగ్గలేము.

వసుం—వసపఁడు ఆ అల్పసంతోషికూడ వలసలదారి బట్టిన అక్కల దగ్గఱ కోతలు గోయఁబోయి నాఁడు గాఁబోలు.

ఫిరం—అయిననేమాయె! మనము విశారదగురువులను మోసగించినది యీ ప్రపంచమున వెల్లడికాలేదు. విశారదునిపిచ్చి ఆత్రేయధన్వంతరులకుఁ జెప్పఁగూడదని అశ్వినేయుల కఠిన శాసనము గదా? మన మీతోఁటవాకిటియొద్ద పెద్దపెట్టున ఏడ్చెదము. ఈ ధ్వని వినినవెంటనే యీ ప్రక్కనున్న యీ యున్మాద చికిత్సశాలకు అతని జూచుటకు తక్షణమేబోఁగలరు. వనపాలిక నేమఱచి వెంటనే యీ టక్కులాఁడులను ప్రక్కకో నేటిలోఁ ద్రోసి మాదమండ కాలికి బుద్ధిచెప్పెదము.

వసుం—అయిన అట్లు పోవుదము.

(వసుంభిణీ ఫిరంగినులు తోఁట ద్వారమువద్దికి నడతురు.)

ఆత్రే—సుధా! సుధకంటె ప్రియతర మగువస్తువు నాకేదిగలదు? సుధా! మా చిన్ని పట్టణమునకు వచ్చుటకు నీవు ఇచ్చవచ్చునా? నేను నుడివెడు పలుకులు నీ కెట్లుదోఁచు. ప్రాణరక్షాపరోపకారములందు మనము సమానాశయులము. కేవలమోహావికారమునఁగాని, లేక నీయసమానాంగ

సౌష్ఠవమునకుఁ జిక్కి గాని, నేని యాశనొందలేదు. ప్రాణుల బాధలు, ధాత్రేయీ సహాయము లేనిదే భిషగ్వర్యుఁడు నివారింపఁజాలఁడు. కావున, నట్టి ధాత్రేయీ వ్రతతత్పరమతివై అతిశయుఁడు విశారదవైన నీ పాణిగ్రహణము వాంఛించితిని.

(నేపథ్యమున ఆర్తధ్వని)

(ఆత్రేయుఁడు చూడ్కి నిగిడ్చి)

ఆత్రే—ఏమీ రోదనము - ఆర్తనాదము.

(ధన్వంతర్యాత్రేయులు త్వరితముగాపోఁబోదురు.)

శుచి-సుధ—మీరు త్వరితముగా నడువరాదు.

ధన్వం—అదేమియో కనుఁగొని వచ్చెదము. మీరిచ్చటనే యుండుఁడు.

(ధన్వంతర్యాత్రేయులు అటువెళ్లుదురు.)

కుసుం—అయ్యో! విశారదగురుతిలకా!

ధీరం—అంత్యమేనా శుచిమతము? అయ్యో!

ధన్వం—ఇదేమి! విశారదుఁడు శుచిమతప్రచారము చక్కఁగఁ సలుపుచున్నాఁడని కదా మనమ వైద్య శాలలో నడిదెలియవచ్చుచుండెను?

(జనాంతికము)

ఆత్రే—వీరినిచూడ అతని శిష్యురాండ్రవలెనున్నారు. ఎవరోతుంటరులు ఈసిలివార్త చెప్పియుండవచ్చును.

(ప్రకాశముగా)

ఆత్రే—ఓ అమ్మలారా! భయపడకుఁడు. వారు శుచిమతబోధకులై, దేశసంచారముచేయుచు నెమ్మదిగ నున్నారు. ఎచ్చటనుండునదియు విచారించి మీకుఁదెలియఁజేసెదము.

కుసుం—ఏమి దేశసంచారమయ్యా! అయ్యున్మాద వైద్యశాలలో నెలనుండి ఉన్నారఁట.

(కంటినీరు తుడిచికొనుచు)

ధీరం—అశ్వినేయులకుఁగూడ పిచ్చికుదుర్చుట అశక్యముగా నున్నదఁట.

ధన్వం—అహా! యెంతమాట. మీ కెట్లు దెలియును?

కుసుం—స్వయముగా నేఁటి సాయంకాలమున మాగురువుల దుస్థితిని ఈ పాపిష్ఠికండ్లతో చూచి వచ్చితిమి.

ఆత్రే—అయ్యో! విశారద! శుచిమతపీఠాభిషిక్తా!

మ॥ అకటా! యెంతటిదుఃఖవార్త వినఁగా • నయ్యో! శుచిశ్రీప్రబో
ధక! శిష్యా! దురవస్థఁ గల్గెఁగద? మే • ధావంతుఁడౌ నీకు నేఁ
టికి నున్మాదవశంబునన్, మతమకుంఠీభావమే పార ర
క్షకులై యుండెడివార లెవ్వ రిఁక వి • జ్ఞానప్రచారంబునన్॥

ధన్వం—శుచిసుధలు కలవరపడకముందే వారికి ఈసమాచారముఁ దెలియఁజేసి మనము పోయి శిష్యుని గాంచి వత్తము.

ఆత్రే—ఇంతమాత్రమునకేల! ఇప్పుడే మరలుదము.

ఫిరం—అయ్యలారా! మీ రెవరో జాలిగొన్నట్లున్నది. మీరు అటకేగి వేగిరమున ఏదో అవసరమయిన కార్యము విరమించుకొనినట్లున్నది. అనుజ్ఞ యీఁదగునదైన యెడల మేము అవనిఁగావించెదము.

ధన్వం—వనపాలికయు దగ్గఱలేదు. వీరిమూలమున శుచిసుధలకు వర్తమాన మంపవచ్చును.

ఆత్రే—అమ్మలారా! ఆత్రేయధన్వంతరులు విశారదుని ఉన్మాదవైద్యశాలలోఁ జూచివచ్చుటకు మీకుఁ దెలుపనిదే పోయినందులకు మన్నింపవలయు నని శుచిసుధలకుఁ దెలుపుఁడు. వారాపోకలకు ఆవలనుండు సరోవరము పొంత నున్నవారు.

కుసుంభిణీ ఫిరంగిణులు—(సాగిలఁబడి మ్రొక్కుచు) గురువుల గురువర్యులకు నమస్కరించెదము. తమ సాన్నిధ్యమువనే శుచిమాగ రహస్యమెఱిఁగి తమ యానతి వలననే సన్యసించిరని వాడుక. వారికి ఆ మతముపయి నెంతయాదరణము! దానియందెంత విశ్వాసము! వారి కెప్పుడదియే పరమార్థము.

ఆత్రే—అయ్యో! అతని పిచ్చికిదియే కారణముగాఁబోలును.

ఫిరం—శుచిమత సంబంధమయిన ఆటలు పాటలు మాటలు దప్ప నితర ప్రసక్తి వారికి లేదు.

ధన్వం—మేము వేగిరపడవలయు. మీరుపొండు.

(ధన్వంతర్యాత్రేయులు నిష్క్రమింతురు.)

ఫిరం—వారిరాక ఆలస్యమైనందున అమ్మాయిలకు విరహవేదన హెచ్చెఁగాఁబోలు, వనపాలిక నిటుకు బంపినారు.

(వనపాలిక ప్రవేశించును.)

కుసుం—అమ్మా! వనపాలికా! విశారదులకు పిచ్చిపట్టినదఁట. వారినిజూచుటకు ధన్వంతర్యాత్రేయులు పోయిరి.

వన—ఏమీ! మీరు చెప్పితిరా ఆమాట.

ఫిరం—రామరామ! మేమేమియు నెఱుఁగము. ఎవరో కల్యాణపురమఁట. ఏడ్చుచుఁబోవుచుండ వారును వారివెంటఁ బోయిరి.

వన—ఇఁక మాకందరికి ముప్పుతప్పదు. అశ్వినేయులు చెండకాసనులు. యీతప్పిదము యీ వనములోనే కలగాలెనా? నే పరిగెత్తి ఆ చిన్న పెళువుల కాళ్లమీద పడ్తా. బతిమాలుకొని పిచ్చాయన్ను నూడనియ్యకుండ మళ్ళించుకొని వస్తా.

మీ మొకాలె చెప్రతాయిలే మంచిబెల్లపు పాగాలె మాటలుచెప్పి మొదటనాకే మోసము దెచ్చినారు.

వసుం—(జనాంతికము) దీనితో మనకేమి వాదము.

(ప్రకాశముగా)

అమ్మా! నీవు తిట్టిన మాయొకలు తూట్లుపడవు. ఎందుకు నిష్కారణముగా కోపముగలుగజేసికొని నోటికి వచ్చినట్లు అఱచి అలసి చెమటలు పుట్టించుకొనెదవు.

వనపాలిక—(మూఱుమూఱుమాది) ఎందుకే అంత బోళ్ళుబాటు. నీకండ్లల్లోనుండి కాంచెను నేవులోనే చమురు దీస్తాను.

(పరువునఁ బోవును.)

వసుం—ఎవరికి దీయునది కొన్ని విషయములలోనే దెలియును.

ఫిరం—మనమేమెలుపాటునఁబోయి దట్టపు పొన్నలనుండి తప్పించిదుమికి వారల కోనేటిలోఁద్రోసి పైమార్గమున పాఱిపోయెదము.

(వసుంధిణీ ఫిరంగిణులు కొంతనడచి పొంచి యుందురు.)

శుచి—అమ్మా! వాసవెళ్ళి చాలఆలస్యమైనది. వేసవియైనను రాత్రులు చలిగాలిలో నూతన ఆరోగ్యవంతులు గ్రుమ్మర రాదుకదా?

సుధ—త్వరలో వనపాలిక, వారిని పిల్చుకొని రాఁగలదు.

ఫిరం—శస్త్రవైద్యునికొఱకు మురియుచున్నావా? చూడీ ఫిరంగిణీ వ్రేటు.

(శుచిని దరిసి కోనేటిలో త్రోయును.)

వసుం—వైద్యశాస్త్రవిశారదుఁడు నీకు మగఁడుగావలయునా? జలశయ్యమీఁద పరుండఁబెట్టెదను. ఆయన నీకు పెద్దకలలో కాన్పించును.

(సుధను దరిసి జలములఁద్రోయును.)

ఫిరం—ఇంకనిచ్చటనుండిన ప్రాణములు దక్కవు. శుచిమత ప్రచారదేశమునకు అవలనున్న మనవారలను తెల్లవాఱులోపలనే అడ్డత్రోవలఁ బోయికలసికొనవలయు.

(శుచియొకసారి మునిఁగి గుటకవేసి పైకిలేచి)

శుచి—అయ్యో! ధన్వంతరీ! చచ్చితి.

(సుధ అటులే గుటకవేసి పైకిలేచి)

సుధ—ఆత్రేయా? కోనేటిలోఁ ద్రోసిరి.

ధన్వంతరి ఆత్రేయులు పరువునవచ్చి అటునిటుఁ జూతురు.

ధన్వ—(స్వ)

మేము యుస్మాద వైద్యశాలా ప్రాంగణమునకుఁ బోవు సరికి వనపాలిక రొప్పుచు పాదములపై వ్రాలిమరలుఁడు అని ప్రార్థించునంతలో శుచి సుధన దీనాలాపములు గద్గదికముగా వినఁబడినందున అపాయము శంకించి పరువిడి వచ్చితిమి.

ఆత్రే—ఇదియేకదా? బృందావన పరిసరభూమి. అదియే నేను విశ్రమించిన వేదిక.

ధన్వం—ఇచటనే శుచియుండెను. ఏమి అతిరుగుడు ధ్వని సరోవరమునందు ?

(ఆత్రేయధన్వంతరులు కోనేటిలోనికి దిగి శుచి సుధలవెదకియెత్తుకొనివచ్చి తమ యుత్తరీయములు వారి యుదరములపై ఒత్తుగా నుంచి శ్వాసోద్ధరణ మొనరించుచుండ యవనికపడును.)

(ధన్వంతరి యీవలికివచ్చి స్వగతముగ)

సీ॥ తలక్రిందుగాఁజేసి ♦ జలమును గ్రక్కంగ
నుదరంబుగట్టిగాఁ ♦ నదుముచునపుడు
పొట్టకునొత్తుగాఁ ♦ బుట్టంబుగుదిరించి
బోరగిలఁ జేర్చి ♦ బాదుపునపుడు
ఇప్పుడప్పుడునాల్క ♦ నించుకించుకలాగి
శ్వాసజనింపంగఁ ♦ జేయునపుడు
నాపదంబులురెండు ♦ నాతికక్షులనిల్పి
ప్రక్కబొమ్మలనొక్కి ♦ వదలునపుడు
గీ॥ ప్రతినిమేషము పండ్రెండు ♦ శ్వాసలాదవ
శ్వాస పునరుద్ధరణమును ♦ సలుపునపుడు
పదినిమిషములు సంశయ ♦ పడినయప్పు
డెట్టు లాక్రియ సాగెనో ♦ యెఱుక లేదు॥

(ఆత్రేయుఁడును సుధను దేర్చును.)

శ్వాసపునరుద్ధరణ ప్రక్రియ యెంతప్రయోజన కారిణి! పోయినఆశయూవర్యముల, మాయొప్పుల కుప్పల, మాప్రాణముల ప్రాణముల, మరల మాకు తెచ్చియిచ్చినది.

(నిష్క్రమించును)

---




# పంచమాంకము.

రంగము 1. అమరావతి, ఉన్మాద వైద్యశాలాలిందము, ధన్వంతరి ఆత్రేయులు ప్రవేశింతురు.

ధన్వం—మిత్త్రమా! యిచటనేగదా నిన్నటిరాత్రి వనపాలిక మన పాదములపయిఁబడి వేడఁగా శుచి సుధల ఆర్తనాదముల వలన మరలిపోతిమి.

ఆత్రే—అవును వారిప్రాణములను రక్షించి ప్రత్యుపకరించినందున మన కృతజ్ఞత కొంతదీర్చుకొనఁగలిగితిమి.

ధన్వ—శుచి శుధల ప్రాణహంతల విషయమయి ఆశ్వినేయు లింకఁగొంతసేపటికిగదా? వలయు విచారణ గావించెదరు.

ఆత్రే—తత్పూర్వమే మనము మతశిష్యునిదుస్థితిఁ గాంచి రావలయు. అదిగో ప్రభావుఁడు తనశిష్యులతో వచ్చుచున్నాఁడు.

(ప్రభావుఁడు ప్రవేశించి నమస్కరించును.)

ధన్వ—కుశలమా? ప్రభావా? యెన్ని దినములాయె నిన్నుఁజూచి?

ఆత్రే—ఎటకుండిరాక? ఏమి యాగొప్ప పుస్తకమాలందు? శుచి మత ప్రచారము చక్కఁగా జరుగుచున్నదా?

ప్రభా—మహాశయులారా! కల్యాణపురి కెల్లవైపులను నూటయిరువది మైళ్ళ పర్యంతము శుచి మతము సంపూర్ణముగా వ్యాపించి అతివైభవముగా శోభిల్లుచున్నది.

ఇంతలో దురదృష్టమున గురువర్యులకు ఉన్మాదము సంభవించుట విని ముందుపల్లెలందు పని చేయుచుండిన మేమిటకు మరలితిమి. దేవరవారు పునరారోగ్యము వడయుట విని ఎంతయో సంతసమయ్యెను. కాని, మా దేశికులకు ఉన్మాదము తిరుగు మఱుఁగయినట్లు కొంచమైనసూచనలేనందునఁ బొక్కుచున్నాము. ఇచ్చటకు వచ్చినది మొదలు ఆజ్ఞానుసారముగ శిష్యులము వంతులప్రకారము, రేయింబవళ్లు గాచియుండి విశారదుల ఆటలు పాటలు సర్వచేష్టితములు వ్రాసితిమి. ఈగ్రంథసంపుటములు రెండును ఆ వ్రాఁతలతో నిండినవి. నేఁటికి వంతుల నిర్ణీతకాలముదీరెను. ఈపాత్రములను ఆశ్వినేయుల కప్పగింపఁ బోవుచున్నాము.

గీ॥ భక్తిధోరణి వారెట్లు ♦ పలికిరట్లు
శ్రీ శుచీశ్వరి కోవెల ♦ చిత్ర శిల్ప
మండితముగఁ జేసి గురు ను ♦ న్మాద హేతు
భూతమగు కాంక్షఁ దీర్పంగఁ ♦ బూనినారు॥

అత్రే—ఎవ్విధముననైన ఆయనదేహము పునరారోగ్యము వడయుఁగాత.

ప్రభా—ఆ కార్యభారము వలనను మిమ్ముఁ జూడఁగూడదను అశ్వుల కఠిన శాసనమువలనను మీపాద దర్శనము లభించినది కాదు. నేఁటి యుదయమున తమ సందర్శన సేవలు మాకుఁ గలుగుట పరమభాగ్యము.

ధన్వం—మీరు కదలుఁడు. మేమశ్వినేయుల సభామంటపమునఁ గొంత కాలములోనే మిమ్ముఁ గలిసికొనెదను.

(ప్రభావుఁడు శిష్యులతో నిష్క్రమించును.)

అత్రే—విశారదునకు వైన మగుపడఁ గూడదనిగదా? అశ్వినేయులు విధించిరి.

ధన్వం—ఉన్మాదవైద్యశాలా రక్షకులు గాఁబోలు వచ్చుచున్నారు.
(ఉన్మాదవైద్యశాల కాపరి, భటుఁడు ప్రవేశింతురు.)

ఉన్మాదవైద్యశాలకాపరి—అబ్బా! నూఱడాట్ట. అడవిపందిలాగా, వాడిబాణమువలె, యెట్లా పరుగెత్తుతుందో ఆ పిచ్చిబాలెంత! ప్రక్కకొదుగుదాం.

(చేతులు లేని గోనెచొక్కాను వేసికొని అఱచుచు ఒక పిచ్చిది పరుగిడును.)

అత్రే—కః యున్మత్త! ప్రసూతిఁ జూడ భారతదేశములో మంత్రసాను లొనర్చుదుండగములు నాకుస్మరించుచున్నవి.

సీ॥ గోళ్ళనుదీయక ♦ వ్రేళ్ళను గడుగక
ప్రసవసంధులుగూర్చు ♦ పాపమతులు
కాన్పుకాలములందె ♦ కడుపడి నడిపించి
కాళ్ళవాపులుదెచ్చు ♦ ఘాతుకలును
మావినాడినిబట్టి ♦ మఱి మఱి లాగుచు
నెత్తురుపఱదగార్చు ♦ నీచురాండ్రు.
గాలివెలుతురులేని ♦ గదులలో బంధించి
మతిపోవఁజేసెడు ♦ మందబుద్ధు
గీ॥ లిట్టి మంత్రసానులు మొంకి ♦ కట్టెలు, శుచి
తత్త్వమెఱుంగక చేసెడు ♦ తంత్రబాధ

ప్రగ్గికూలు బాలెంతలు • మరణసంఖ్య
లేదు భువియందు నెందేని • లేదులేదు.

భటు—(జనాం)ఓహో! చూడు తాగుఁబోతు పిచ్చికాడిని! వీడితో రాత్రితెల్లవార్లు నిద్దుర లేదు! వాఁడే చేలబడి కలవరం! కత్తులని అరుస్తూ వాట్లతో పోట్లాడడం! నళ్ళంతా శీమలఁ యేద్వడం! తాగడానికి తెమ్మని యెనురు మేళం! అబద్ధ ప్రవట్లు! మరప్రలు. వీడి నాలిక, పెదుము, చేతులు, వేళ్లు వాళ్లంతా ఆ నిరిమేట గ్రాపుబొమ్మవలె ఆడడం! దగ్గరకొస్తున్నాడు. తొలగదాము. చూడు తాగడానికి తెమ్మంటాను.

ధన్యం—సురాపానమున గలుగు చెడుగు యీ యొక్కటేకాదు.

సీ॥ కాలఖండముఁ గట్టి కనలించి ప్రేవుల
నుదయింపఁ జేయు జ • లోదరముల
హృదయంబునకుఁ జేర్చి • పదరును గళింపించి
మెండుగా వడకించుఁ • గండరముల
నరముల వాపించి • సారగులఁ గళింపించి
సర్వాంగకంబుల • శక్తిఁ జంపు
మెదటి నెత్తుటినాడు • లుదుటుఁ నఁ బగులెత్తఁ
బక్షవాతంబుఁ • బ్రబలజేయు
గీ॥ ఎంత శ్రీమంతునైనను • హీనమతిని
నన్యుల ధనంబు దొంగిలు • నట్లుసేయుఁ
బరువు గుట్టును లేకుండ భంగపఱుచుఁ
గలదె మద్యపానముకంటెఁ • గలుషమిలను.

(విశారదుఁడు ప్రవేశించును.)

విశా—నేను శ్రీశుచిమహారాజ్య పట్టాభిషిక్తుఁడ నౌ సార్వభౌముఁడను. ఇదిగో నా కిరీటము.
(ఒక పూలగుత్తిఁ జూపుచు.)
ఇవిగో నా గురులు. ఇదిగో నాయాజ్ఞాదండము. సకల విషజీవమారక దండము. ఇదిగో అమృత కలశము. ఇదిగో మృత్యుపరివారమును తఱుముచున్నాను.

మృత్యుపరివారము పలాయితము! ఇహిహీ! ఇదిగో త్రోవలో ముండ్లు వీనిని తీసివైచెదను.
(అటులుచేయును.)

భటుఁడు—(నవ్వుతో) ఏమయ్యా మా రాజు నంటివే ముండ్లుతీసేపదా మా రాజుది?

విశార—ఓరి! ఊరకుండవేమి? మహారాజు పుణ్యముగట్టికోఁగూడదా? నోరుమూసికొను మృత్యువా నీవు వీనిలో ప్రవేశించి నన్ను బెదరింపఁ జూచెదవా? నిన్ను డింకఁ గొట్టించెదచూడు.
రెండుచేతులెత్తి కొట్టును. భటుఁడు పరుగెత్తుచుండ విశారదుఁడు వెన్నంటును.

ధన్వంత—ఏమి? మృత్యువుపై చలము!

ఆత్రే—మరలవచ్చుచున్నాఁడు, ధన్వంతరీ. ఉన్మాదావస్థయందును ముఖమున కళలు తగ్గలేదు.

విశా—ఓహో! మృత్యుపరిచారకులారా! మీదొంగతనపు చేష్టలు మాకుఁ జక్కఁగాఁ దెలియును. మీ పొంచులు సాగఁగలవా? ఓరీ! ఉన్మాదవైద్యశాలరక్షకా! నీవీ శుచిదేవి మంత్రము చెప్పకో! లేదు శుచి తప్ప పరమదైవము. లేదు శుచి తప్ప మృత్యువుఁ బనిగొను దేవత! లేదు శుచితప్ప మృత్యు భయము దీర్చు దేవత. తక్కిన దేవతలన్నిటిని చావు భీతివలన సర్వరోగములను గొలిచినారు. చావు భీతివలన నోరులేని జంతువులను ఈ మారులకు బలియిచ్చినారు. మహాశాంతిగల భూదేవిని మలిన పఱిచినారు. ఊఁ! కొలువుము శుచిని. నీకు సరియైనజ్ఞానము వచ్చును. ఈమారులు నీయొద్దకు రావు.

ఉన్మాదవైద్యశాలకాఁపరి—చిత్తము దేవరా.

విశా—శరీర మకాలమృత్యువువాతఁ గొట్టుపడక నిలిపికొనుటకై వివిధావయవస్థితి, చేష్టిత, వ్యాధి, పరిజ్ఞాన, నిరోధ, చికిత్సలను ప్రకృతిగాఁగలుగు బిషక్కులచేఁగొలువబడు నో భగవతీ శుచిదేవత నిన్ను గొలుచుచున్నాను. ఆహా శుచిశక్తి శుచిశక్తి.

(అని మ్రొక్కుచుఁ గూరుచుండి తప మొనర్చును.)

ఉ॥వై॥కా— (ధన్వంతర్యాత్రేయులతో)

ప్రభువులారా నేనిక్కడ కాఁపరిని, దండములు. మీదొరలు యీగదిలో మిమ్ము కూర్చోబెట్టి యీపిచ్చాయన్ను జూపమన్నారు.

(ఉభయులుఁ గదిలో ప్రవేశింతురు. విశారదున కగపడరు.)

విశా—సర్వవిషజీవ వృక్ష రస పాషాణాది దేవతా పరివేష్టితా! జోహారు!

విషజీవిగ్రస్త శుష్కీభూతదేహ పునరుద్ధారక లోహ కనక ముష్టి మూలికాది దేవతారాధ్యా! నమస్కృతులు!

సకల విషజీవ జ్వాలావిర్భూత మహాతాపాపనోద శీతలపానీయ దేవతా జ్ఞాపకదేవీ! వందనములు!

సకల విషజీవ జనిత మహా వికారానిద్రితా భంజన వ్యంజన సత్తైలదేవతా పరిఖా! దండములు!

పండి పక్వమై నేల వ్రాలఁదగు అదనున నే మృత్యువునకు ప్రాణికోటి సమీపింప ననుజ్ఞ యిచ్చెదవు. నీ అమృతకంపు జల్లుల నుపాసకులపయిఁ బెల్లుఁ గురియించెదవు.

సకల విషజీవ ధ్వంసినీ! విషజీవుల దంచి, ధ్వంసముచేసి, అరసమునుండియే తన్నాశక ప్రతీకార వస్తిదేఁతను బుట్టించి మడి భుజముగా ధరించునో దేవీ! ప్రణామములు.

దుర్గంధ విషవాయువులను విష విమోచనములుగాఁ జేయు తులసి, వేప, మొదలైన వృక్షములనీడల వసించు జగద్రక్షిణీ! వందనములు.

సకలమాలిన్య దుర్గంధ నిర్వాపక ప్రాణవాయు జనక దివ్య ఖనిజవర్గాయుధపాణీ! ఓ విష భంజని వందనములు.

క్షయేత్యాది గృహనివాసక రోగ సూక్ష్మజీవుల సుధాగంధక హోమాదులచేఁ బాఱఁదోలు నో తీక్ష్ణశాసని! వందనములు.

ఆహా తల్లీ! యేల నీ ప్రసన్నవదనముఁ జూపవు? నీ తూష్ణీంభావము నేలమానవు? నీవు దూరస్థుల మయి మేమీదుర్గతులమఁ బాలయితిమి.

తల్లీ! నా ప్రార్థన మంగీకరించి నీ సాన్నిధ్య మొసఁగుము. ఆహా తల్లీ! నీ యాజ్ఞ యిదే శిర సావహించెద. ఒక్క క్షణములో నీ యాజ్ఞ నేరవేర నీ సాన్నిధ్యమునకు వచ్చుచున్నాను.

సీ॥ నీసేవలేనిదే • నిమ్నమై గడుఁదగాలు
భారతప్రజలెట్లు • బ్రదుకఁగలరు
నీపూజలేనిదే • యీఘోరరుజాతుల
సంఘుసేవనమెట్లు • జరుగఁగలదు
నీచింతలేనిదే • నిఖిలరోగము లార్చు
ప్రక్రియాతతులెట్లు • వఱలఁగలవు
నీభక్తిలేనిదే • నిసుఁగుబాలెంతల
రక్షణవిధులెట్లు • బ్రబలఁగలవు
గీ॥ నీదు పీయూషవర్షంబు • నేఁడు గురియు
నీదు మాతృవాత్సల్యము • నేఁడు నెఱపు
నీదు శోధన సత్త్వంబు • నేఁడు గూర్పు
నీదు స్థితి మనీషను నేఁడు • నేర్పు తల్లి॥

ధన్వం—ఆహా! శుచిదేవతా ప్రభావము! తదేక నిశ్చలశిచే నవర్గళముగా ఈ ధన్వఁడెట్లు పొగడుచున్నాఁడు. తీవ్రోన్మాదమునను ఇతనిచే దేవి ప్రతిభయెంత చక్కఁగా వర్ణింపఁబడినది.

విశా—రారా! రసయోధా! నీవీదిక్కునఁ గావలియుండుము. పాషాణవీరా! నీవీవైపున రక్షచేయుము. మూలికా భటకా! నీవీచక్కటి పారాయుండుము. లోహసేనానీ! నీవిచ్చట నిలిచికాఁపుండుము. ఊఁ! ఊఁ ఇఁక సాగును లే! నీయాటలు! పోవుచున్నది హీ! హీ! హే! అని పండ్లిగిలించుచు ఆ మృత్యువు పలాయనమై! మృత్యువా! నిన్ను నేను విడుతునా? వెంబడించి నాశన మొనరింతును. (పరుగిడుచు హఠాత్తుగ నిలిచి) ఎవ్వరావచ్చునది మూఁపున, చేతులను, బుదుతలను మోసికొని? (దుఃఖముతో) అయ్యో! ఆబిడ్డలు తలలు నిలుపలేకున్నారేమి? భారతియా! భారతియా! అయ్యో! దుఃఖించి దుఃఖించి నీ మొగమెంత కందినది. ఏమనెదవు? నీవర్ణనా ప్రజ్ఞ నిలుపుమనియా? అలస్యమగు నౌషధ మిప్పింపుమనియా? అమ్మా! ఇదిగో సుధారసాయనము. బిడ్డ బిడ్డకొక బిందువు ప్రమాణము.

సీ॥ ఈ పంచమశనిధా • టీ పంథవిడిచియునే
శ్రీశుచి జపములు • నేయకున్న

ఈచిత్తశోష వా • టిచక్ర మిడియునే
శ్రీశుచిహోమముల్ • వ్రేల్చుకున్న
ఈక్రూరరోగ చే • టీక్రీడ లుడుగునే
శ్రీశుచిమంత్రముల్ • సెప్పుకున్న
ఈదేహకార్శ్య శా • టీదాస్యమడఁగునే
శ్రీశుచితంత్రముల్ • జిమ్మకున్న
ఆ॥ సర్వమంగళకరి • శాశ్వతసుఖదాత్రి
సర్వరోగహంత్రి • శాంతమూర్తి
శుచియె; శుచినె కొలువు • సులభమాఁ గుశలంబు
భద్ర చింతన మతి! • భరతమాత॥

(కూర్చుండును)

ఆత్రే—ఏమీ శ్రీశుచి భక్తి పరాయణత్వము! ఏమి యీ మృత్యు నిరాకరణ బుద్ధిబలము! అనివార్యమగు మృత్యువునె యీ భక్తుఁడు సహియింప సమకట్టియున్నాఁడు. ఉన్మాదముననున్నను పూర్వ విజ్ఞానవాసన యీతని యుపదేశములలో నెంత స్ఫుటీకరించుచున్నది.

భటు—యింక మూన్నాళ్లు యీయనకి మాటలురావు. నీళ్లుకూడా నోట్లో పొయ్యాలి. వీరికి జ్ఞానపు పిచ్చిగా ఉండది.

ధన్వం—ఈయవస్థఁ జూచి నాకెంతయు జాలిగలిగెడిని.

ఆత్రే—అశ్వినేయు లీయనవాక్యము లాధారముగా శుచిదేవ్యాలయములందుఁ జిత్రములు నిర్మాణము చేయఁ బూనుచున్నగడ మంచిదిగాఁ దోఁచుచున్నది.

ధన్వం—వారి సమావేశకాల మాసన్నమయినది.

(నిష్క్రమింతురు.)

రంగము:—2. అమరావతి - అశ్వినేయుల సభామంటపము.

(అశ్వినేయులు, ఆత్రేయుఁడు, ధన్వంతరి, శుచి, సుధ, ప్రభావుఁడు ఉచితాసనములపై కూర్చుండియుందురు, వనపాలిక నిలువఁబడియుండును.)

అశ్వి—పుత్త్రులారా! సందేహమువలదు. విశారదుఁడు శుచ్యాలయప్రవేశమునఁ దప్పక యున్మాద విమోచనము పొందఁగలఁడు.

॥ ఆత్రే—మహాప్రసాదము !

అశ్వి—ప్రకృత సూత్రయంతయుఁ గడు హృద్యముగ నున్నది. అయ్యా! ధన్వంతరీ! నీ కీవిషయమున ఏమి తెలియునో యింకొకతూరి తెలుపుము.

ధన్వం—మహాశయా! వసువఁడను మహానిపుణుఁడగు బంటొకఁడు నాయొద్ద నుండెను. కల్యాణపురమున నాకుఁ గలిగినవిపత్తు సమూలముగాఁ దమతో నివేదించికొంటిని. ఇందుకుఁ గారణము వాఁడు చేసిన పన్నుగడయని నమ్మకము పుట్టునట్లు పైకప్రయోక్త చక్కఁగా విచారించి తెలిపెను. నాఁటగోలె వసువుని జాడఁ దెలియదు.

ఆత్రే—వసువుఁడు నాయొద్దకుఁ బరుగిడివచ్చి ధన్వంతరి అవస్థ సంభ్రమ కారుణ్యాతిశయములతోఁ దెల్ప తులసీక్షారశోధన జాగరణమునొందిన నేను మనస్సుగొందలంబంది మహామారిసూక్ష్మక్రిములను ముంజేతి టీకాలక్షతముల తోనికించుకొని బొబ్బలవ్యాధి పీడితుఁడనైతిని.

అశ్వి—వీఁడె మీయిరువుర అపాయస్థితి విశారదునకుఁ జెప్పినవెంటనే యీతనికి ఉన్మాదమువచ్చెనని అతని శిష్యులు చెప్పిరి.
శుచిసుధలారా! మీ ప్రాణహాంతలవిషయమై మీకేమి దెలియును?

శుచి—ప్రమదవనమునకు నిన్నటిసాయంకాలము ధన్వంతర్యాత్రేయులు విచ్చేయుటకు పూర్వమె మా దగ్గఱకి ఇరువురుపాలతులువచ్చి మీచెంత మేము దాస్యమునకు కుదిరెదమనిరి. తమసెలవులేనిదే నియమింపఁగూడదని, మఱునటియుదయము తమసభకు రానవుజ్ఞ యిచ్చిపంపితిమి. పిదప ధన్వంతర్యాత్రేయు లార్తధ్వని విని వనద్వారమునకుఁ బోయిన కొలఁది నిమిషములలోనే అకస్మికముగా మాపయి కప్పించిదుమికి చూడుఁ డీఫిరంగిణి ప్రేటనియు, జలశయ్యఁ బరుండుమనియు గర్జించి మమ్ముఁ గోనేటిలోఁద్రోసి పరుగిడిపోయిరి. ఒక్కమారు మునిఁగి కేకవైచితిమి. ధన్వంతర్యాత్రేయులవలన పునరుజ్జీవింపఁబడితిమి.

అశ్వి—ఈ నామములు గలవారె విశారదునకు శిష్యరాండ్రుగానుండి శిశుప్రసూతి పోషణవిషయములు లోకమున ప్రబోధించు వారనియు, విశారదునకు ఉన్మాదము రాకపూర్వమే మఠమునుండి అదృశ్యలైరనియు వారి శిష్యులు చెప్పిరి.

ప్రభా—ఈ మాయావినులె విశారదు దుస్థితికి కారణభూతము లయినట్లు లీసంపుటముల వలనఁ దెలియుచున్నది.

అశ్వి—వనపాలికా! యీ వసుంభిణీ ఫిరంగిణుల విషయమై నీకేమి దెలియునో నిజముదాఁపక చెప్పుము.

వనపా—అయ్యా? నేను సత్తెము చెప్తా. ఆనాడు సాయంత్రం యిద్దరు వద్రయివచ్చి నన్ను జూచి నావు వాళ్ళ అమ్మల పోలికలు వున్నాయి అని కళ్ళనీళ్లు పెట్టుకుంటూ నాను ముసలిదానిని కట్టుకోమని ఒక కోకయిచ్చి, యీ యిద్దరు దొరలు పిచ్చాయిన సంగతంతా అడిగినారు. నేను యేం పాపాన్నపోతానో చెప్పిన దాన్ని దాపెట్టుకోను అయనకు పిచ్చని యీ దొరలకున్ను యెవరికి చెప్పకూడదని మీరుచేసిన ఆగ్గెలుకూడ (చెంపలు వేసికొని) మీరి చెప్పినా. నన్ను రచ్చించాలపెబువులు.

కాని నేటొద్ద గుభిల్లుశబ్దం అమ్మోళ్ళ యేడుపులు విని పరుగుపరుగున వచ్చేతల్కి తళతళమనే యీ బాకులు దొరకినవి. వాటిని యేలినవోరి పాదాలకాడ పెడ్తుండా.

ఆశ్వి—(బాకులు చేతికిఁ దీసికొని) ఏమియీ స్ఫుటాక్షరములు. (మసుంభిణి ఫిరంగియని చదువును.) ప్రభావా! నీవేమి యూరకున్నావు? ఈ విషయమై నీకేమి తెలియును?

ప్రభా—ఇరువురు యువతులు విశారదుని శిష్యురాండ్ర మని కన్నీరు మున్నీరుగా వగనుచు వారముదినములనుండి యుస్మాదవైద్యశాలకు అప్పుడప్పుడు వచ్చి రక్షకునితో వారికుశలము అడిగి పోవుచుండిరి.

ఆశ్వి—ఇందువలన మసుంభిణీ ఫిరంగిణీ వనితల ద్రోహచింతనములు స్పష్ట మయ్యెడిని.

ధన్వం—మసుంభిణీ ఫిరంగిణీ వనితలను బట్టితెచ్చుటకు మాయొద్ద బాలభట శిష్యవర్గము తమ యాజ్ఞకై వేచియున్నారు. వారినిబట్టి తెచ్చుటకును వ్యాధుల పుట్టుపెట్టుటకును తమయనుజ్ఞ వేఁడుచున్నారు.

ఆత్రే—అజ్ఞఅయినచో ప్రభావుని వారికి నాయకుఁడుగా నియమించి మేమును వారిరక్షకై పోయి వచ్చెదము.

ఆశ్వి—మీకు నిన్న నేఁడు పునరారోగ్యము గలిగెను. మీ సత్సంకల్పమునకు విఘ్నము పలికినందులకు చింతిల్లెదను. పరికర పథ్యసామగ్రులతో శుచిసుధలు వారముదినములలో వచ్చి వీరిని గలిసికొనెదరు.

ధన్వంతరి. ఆత్రేయుఁడు. ప్రభావుఁడు. శుచిసుధలు

చిత్రము:—మహాప్రసాదము.

(జవనిక జారును.)

రంగము:— 8 అమరావతి, వీధి.

బాలభటవర్గము, ప్రభావుఁడు

(ప్రవేశింతురు.)

అందఱు

గేయము.

దేహపటుత్వదాయకీ, రక్తశుభ్రతాదాయకీ
అఖండ సుఖదాయకీ శుచి॥
ప్రాణులరక్షింప, వెడలంగ,నుప్పొంగు, లంఘించు, హృదయము, వెడలుదము
బ్రదిమికి ఫలమును గందము॥
నీటఁబడ్డవారల, వెలికిఁదెచ్చి, యూపిరియిచ్చి, ప్రోతము॥

కాలేకాలే, యిండ్లలో, ప్రాఁకెదత్కాఁకి కాఁచెనము
విసపురుగు రోగముల పసదత్కాల్చి ప్రోతము॥

ప్రభా—అయ్యాలారా? బాలవీరులారా? మీయుత్సాహము అనర్ఘళము. కర్ణ, శిబి, దధీచి, జీమూతవాహన మహామహులను స్మరణకుఁ దెచ్చుచున్నవి మీచేష్టితములు. ప్రపంచమునందు ప్రతిదినమును ప్రాణిసంకట నివారణార్థము స్వదేహ సౌఖ్య చాపల్యము పాటింపని నిష్కామ కర్మధురీణులరు మీరు. ముగ్ధులరగు మీరిట్టి సౌజన్యము నిట్లు సారించుట దేశభావికాల ఫలాభివృద్ధి సూచకము. మీసంతతియు శౌర్యధైర్య స్థైర్య శమదమ సత్యశౌచాది దయాశీలములందు మీచేఁదీర్పఁబడి మిమ్ము మించునట్టి పురుషులుగాఁగలరు.

అయ్యాలారా! వ్యాధులపయి దండయాత్ర సలుపునపుడు మన దేహములను వ్యాధులకు విఱుగుడు కవచములను ధరించుటమేలు. ఇందులకై సర్వవ్యాధి ప్రతీకార చికిత్సచేసికొనుటె లెస్స.

భటుఁడు—అయ్యా! నా కీదేహమున మంచి దార్ఢ్యము గలదు. అనవసర ప్రతీకారప్రయోగము చేసికొనుట నాకిష్టము లేదు.

ప్రభావు—నీవు చెప్పినది వాస్తవము. జాగ్రతగా శుద్ధము చేయఁబడి పరిశీలింపఁబడిన జగద్విఖ్యాతములగు ఈమహామారి, స్ఫోటక, విషజ్వర, విషూచ్యాది వ్యాధులను నివారించు విఱుగుడు మందులవలన నీకు చెఱుపులేదు.

2. భటు—స్ఫోటక నివారక చికిత్సలు చేసికొనిన వారికి అనేకులకు స్ఫోటకము వచ్చుట చూచితిని.

ప్రభా—అయ్యా దానివిఱుగుడు దేహమందు ఆఱు ఏడు సంవత్సరములుమాత్రము ఉండును. ఆఱు ఏడు సంవత్సరముల కొకసారియైన టీకాలవేయించుకొనుటకుఁ దప్పినయెడల మశూచిపోఁకుటకు ఎడము గలదు.

2.భటు—అయ్యా స్ఫోటకపు టీకాలువేయించుకొనిన పిదప కొందఱు పిల్లలకుటీకాలు అమ్మవారువచ్చుట చూచియున్నాను. ఈబాధవలననేగదా కొన్ని దేశములలో అంతరాత్మ ప్రమాణముగా టీకాలకు ఒప్పుకొనని జనంజనములకు టీకాలశాసనము బాధింపదు. కొన్ని స్థలములలో టీకాలువేయించుకొనవనియెడల అపరాధములు విధించెదరే?

ప్రభా—మన దేశముయొక్క ప్రస్తుత స్థితి విచారకరము. ఇతరదేశములకును మనకును సామ్యమ్యము లేదు. పలువిధములైన సోఁకుడు వ్యాధులకు నివాసస్థానమయి మనదేశము పీడింపఁబడుచున్నది. సాంఘికారోగ్యపద్ధతులను జక్కఁగ వెలయింపఁ బ్రయత్నించుచున్నారము. అంతవఱకు మనము స్ఫోటకనివారక చికిత్స పాటించుటయే యుత్తమును, కర్తవ్యమును. చూచితిరా? ప్రస్తుతము స్ఫోటకముచే విశేషించి చనిపోవువారు పూర్వకాలమువలె శిశువులుగారు. శిశువులు ఆఱు నెలల లోపునే శాసనము మేరకు టీకాలు వేయించుకొని సుఖపడుచున్నారు.

టీకాల విఱుగుడు దేహమందు ఆఱుసంవత్సరములకు మించియుండదు. అట్లు ఆఱుసంవత్సరములకు ఒకసారి టీకాలు వేయించుకొనని వారే స్ఫోటకముచేఁజిక్కి గతించుట స్వప్రమాణానుభవము. వింటిరికదా? నాగరకతాగ్రగణ్యములగు రాష్ట్రములలో ప్రతి శిశువునకు టీకాలు నిరాటంకముగా వేయించవలసినట్లు శాసనము గలదు. టీకాలు వలదనువారి వెఱ్ఱి ప్రలాపములకు చెవియొగ్గకుఁడు.

సీ॥ సర్వజీవనదాత • సౌఖ్యదసూర్యుండు
వడబెట్టియొక్కచోఁ • వాడ్చుఁగాదె
సర్వసస్యప్రోషి • జలమిచ్చు మేఘుండు
పిడుగుచే నొక్కచోఁ • బ్రేల్చుఁగాదె
సర్వలోకహితుఁడు • చల్లనివాయువు
సుడిద్రిప్పి యొక్కచోఁ • నడఁచుగాదె
సర్వభూతజనని • శమదమఖనిభూమి
కంపించి యొక్కచోఁ • గూల్చుఁగాదె
ఆ॥ ఈశు సృష్టిలోనె • యిట్టి తప్పులు గల్ల
దొరల దొరకు దొసఁగు • నరుల యెడల
నెన్ని కనులజూపు • లెసఁగిన నొక్కచోఁ
గ్రిముల విఱుపుఁ జొనుపుఁ • గ్రియలయందు।

భటు—అయ్యా, సమస్తవ్యాధులకు టీకాలుగలవా?

ప్రభా—అంటురోగములన్నిటికిఁ గలవు.

భటులు—అటులైన టీకాలు వేయించుకొనెదము.

ప్రభా— ముందీకర్తవ్యము ముగించి అటువెనుక మారణభూతముల పని బట్టించెదము.

(నిష్క్రమింతురు.)

---



# షష్ఠాంకము.

— సత్తుకార్మికశాలా పరిసరనదీతీరము, బాలభట శిబిరము. —

(వసక వసుంభిణీ ఫిరంగిణు లందుఁదురు.)

ఫిరం—పలువైపుల మనల ముట్టడించిరి. పరుగిడి పరుగిడి కాళ్ళలివపోయె.

వసుం— (భయముతో) మరూచి పాటిపోయెను. అయ్యో! ప్రాణాధారపరికరములు గోలుపోయి తక్కినవారందఱు సమసిపోయిరికదా. వసకా యేమి తెరవు?

వస— (తెగువతో) అక్కలారా మనవారిని పోఁగొట్టుకొన్న దుఃఖము వెలిబుచ్చుకొనుటకు ఒకక్షణము గూడ అవకాశము లేదు. మీరు ఇటునటుఁ దొలఁగక తీవ్రముగాఁ పరువిడి యీనదిగట్టుకు రండు. నేనిశిబిరముఁ దగుల్పఁబెట్టి యీసత్తుకార్మికశాల సౌధము మీఁదుగా నదిలో దుమికి మిమ్ము నావలి గట్టుకు దాఁటించెదను. నేనడ్డు తిరిగినయెడ వెంటనే నన్నుఁ బట్టవత్తురు. మీరీసందడిలోఁ పాఱి పోవచ్చును.

(వసుంభిణీ ఫిరంగిణులు పోదురు. వసముఁడు పరువిడి బాలభట శిబిరముచుట్టు మంటజల్లి జానకి త్రాళ్లువదలును.)

ఉ॥ శిబిరము బాలురుం గనలి • చేరెద రిప్పుడె మృత్యుసన్నిధిన్
సబలతఁ బ్రాఁకెదన్ వడిగ • సత్తుపరిశ్రమశాలమీఁదికిన్
గబగబ పల్లటీల్ దుమికి • గాంచెద మార్గము వాఁక నీఁదుచున్
సొబగుజతన్ ఫిరంగిణి కుసుంభిణిఁ బడ్వనుగట్టుఁ జేర్చెదన్.

(పరుగిడిపోయి మూలనుండు కట్టడముపైకిఁ బ్రాఁకి జానకి త్రాడువిడుచును.)

(ప్రభావ, బాలభటులు, ప్రవేశించి హా హా ధ్వానములుచేయుదురు.)

ప్ర)భా—బాలభటులారా! వాఁడు అతిగమనమేధావి, జిత్తులమారి, సాహసికుఁడు. అయిన వాఁడా మూలనుండి కార్మికశాలవైపు తప్పించికొనుటకు త్రోవలేదు. మీరావైపునరండు. నే నచ్చటికి వచ్చి వానిని బట్టెదను. పొండు.

వస—మునుముందీ మందుపత్తి అంటించి ఆవల నదిలోనికి దుమికెదను. వీరందఱు ధ్వంసముగాని. (మంటలు)

పరిభా—మంచిది! అగ్ని నిరోధక వాయువులను ప్రయోగించెద. (అటులొనర్చుచు లోనికిబోవును. బాలభటులనుసరించిరి.)

వగ—ఆహా? పొలమొలమాడుచున్నారు.

(సంతోషముతో)

ఆ. వండు పఱపు వఱద • వడివడి దుమికెడు
నురుగు టలల మొరయు • ఝురియిదార!
అడ్డు పడవ నడపఁ • తెడ్డు నెఱుఁగు చేయి
నసకుఁ డొకఁడె చాలు • బంటుమగఁడు॥

(ఒకవైపుఁజూచి)

యిదేమి. ఈ సత్తుసౌధము నిప్పంటికొనెను. ఈ సత్తుకాలిన పొగలు నాకు సరిపడవు.

(లంఘింపయత్నించి)

కాళ్లురావిదేమి! ఏమి యీదుర్గతి!

(వగచుచు)

ఆహా! నేనెంతటి దౌర్భాగ్యుఁడను. నాపాదములు రెండును దుముకుప్రయత్నములో ఈకప్పలోని గూఢరంధ్రములలో నిఱికికొనెను.

(చేతులతో కాళ్లుదీయ ప్రయత్నించుచు)

అయ్యో! ప్రయత్నించు కొలఁదిని పాదములు లోపలికిఁ బోవుచున్నవి. ఆ! పిక్కలవఱకుఁ బోయెను. (ఎగురఁబోవును)

అయ్యో! నాకెట్టి దుర్గతి పట్టెను! నాగిరికలు పటపటలాడుచున్నవి. కీళ్లు తొలఁగినవి. ఈ సత్తుపొగ మంటలు ప్రబలినవి. ఈ అంతరిక్షమున కన్నులు తిరుగుచున్నవి. అదిగో! శుచిసుధలు వసుంభిణీఫిరంగిణులఁబట్టి కంచుకములను ఒలిచిరి. ఱెక్కలఁగట్టి తీసికొని పోవుచున్నారు.

(వగపుతో)

మా వారందఱుఁ బోయిరి. అయ్యో! ఒడలుపైకి మంటలుప్రాఁకినవి. నాదేహము బొబ్బలెత్తిపోవుచున్నది. పరులచావుకై పన్నినవలలో నేనేఁ జిక్కుకొంటిని. మృత్యుమహారాజ్ఞీ నీయాజ్ఞ నేనెట్లు చెల్లించితినో నీవే సాక్షివి.

(బింకముతో)

నాకేల యీ వగపు! నేనెప్పుడు జంకి యెఱుంగను. దేహము కాలనున్ననేమి! ప్రాణములు పోవనున్ననేమి? ఉత్సాహము, మగటిమి, కార్యదీక్షలను మానెదనా? లంఘించెదఁగాక.

(లంఘింపఁ బ్రయత్నించుచు దగ్ధుఁడగును.)

మృత్యువు (ప్రవేశించి)

శుచివ్రతోపాసకులకు అకాలమరణభయము లేనట్లు నే వరమిచ్చుచున్నాను. వ్యాధుల సత్యతత్త్వము శుచివ్రతము మూలమున ప్రపంచ మెఱిఁగెను. కారణజనితములగు నీవ్యాధులు సమసినందుకు నాకు వగపులేదు. (అంతర్ధానమగును.)



# శుచి

—:o:—

## సప్తమాంకము.

అమరావతి. శ్రీశుచ్యాలయము.

విజయలాంఛనములగు మృత్యుపరివార ప్రాణాధార పరికర హారాదుల తోరణములతో కోఁటలు బాల భటులందుందురు.

ప్రభా— (ప్రవేశించుచు) అయ్యలారా! మానవుఁ దీరినట్లె ప్రకృతికిని కష్టమీడేరినది. పంటపండినది. భూములపై నెల్లెడ బంగారు నిలువులు వ్రాలినవి. ఈబాలసూర్యుఁడును పసిఁడి కరములతోఁ ప్రకృతితో నాటలాడుకొనుచున్నాఁడు. ఏమి యీ ఆలయప్రాంగణమునందలి చేమంతిబారుల అపరంజిపుట్టువు.

గీ. బాలసూర్యులు దోఁగాడు • ప్రభలు వెలయు
మంచు రత్నాలతోడఁ జే • మంతిలతలు
పసిఁడిరాల్పఁగఁ గ్రొవ్విరి • బంతు లొఱయ
స్వస్తిఁ బల్కుచున్నవి జయా • క్షతలు చల్లి॥

(పరికించుచు) కన్నులఁగలఫలము నిప్పుడనుభవించుచున్నాను. అహా! రేమి యీ కళ్యాణమూర్తుల తేజము; మహదానంద వైఖరి.

(ప్రక్కన నిలుచుచున్నాఁడు.)

(ఆశ్వినేయులు ధన్వంతరాత్రేయ విశారదులమ్రోల, బాలభటులు మసుంభిణీ ఫిరంగినుల కెక్కులు గట్టి ప్రవేశింతురు.)

ఆశ్వినేయులు— మనముఁదు వీరిద్దఱను గొనిపోయి పాషాణశైల కుహరంబునందు అజన్మాంతము బంధితులఁ జేయుఁడు.

(బాలభటు లట్లొనర్తురు.)

ప్రభా— వసువుఁడు కార్మికులను దగులఁబెట్టి ఆ మంటలోనే వాఁడును దగ్ధుఁడయ్యెను.

ఆశ్వినే— వాని దుండగమే వాని శిక్షించినది. విశారదా! యిటురమ్ము నీ హృదయసంకల్పము సిద్ధించినది. ఈ దేవాలయమున శ్రీశుచిదేవతాసాన్నిధ్యమే నిన్ను పునరుద్ధరించె.

(కమండలువులోని జలముఁ జల్లును.)

సీ॥ పథ్యంబుగాదది • పరమపూజ్యులు నన్నుఁ
దనియించు పంచామృ • తంబుగాని
స్నానంబుగాదది • సత్పురుషులునన్ను
బ్రోక్షించు తీర్థంపుఁ • బ్రోదిగాని
మంచంబుగాదది • మాననీయులునన్ను
లాలించు పసిఁడి యు • య్యాలగాని
వస్త్రంబుగాదది • పాపహారులునన్ను
వెలయించు హారాంబట్టు • వలువగాని
గీ॥ రోగిసేవగా నేరదా • రోగ్యవిధుల
భక్తులనుసరించెడి నా ప్ర • వృత్తిగాని
అదియ నిజమైన నాపూజ • యద్దియొసఁగు
నాదు సాయుజ్య సామ్రాజ్య • నవ్యపదవి॥

కావున ఈశుచి ఆలయమును వైద్యాలయముఁ గావింపవలయు. నాకై నిర్మించిన యీ సప్త ప్రాకార పరివేష్టితాలయమందు నాప్రీతిగా రోగి సమార్చనము వెలయింపవలయు. ప్రాకారములందలి భవనములను స్వాస్థ్యశాలా పరిశోధనలకై వినియోగింపవలయు.

అశ్వినే—తమ యుదల నాదల ధరించుచున్నాను.

శ్రీశుచి—అశ్వినేయా! నీవుధన్యుఁడవు.

గీ॥ శస్త్రకృషికి శుచిత్వంబు • జంటఁగూర్చి
కాయ రక్షకు నమృతంబుఁ గనికరించి
నిల్పితి విలచికిత్సాఖ్య • కల్పతరువు
జనము లారోగ్య ఫలముల చవులెఱుంగ॥

అశ్వి—అంతయు తమ అనుగ్రహాధీనమే.

శ్రీశుచి—ఇంకను మీకేమయిన వాంఛితములు గలవా?

అశ్వి—తల్లీ! మీదర్శన మాత్రమున మేమెల్లరము తమ సాయుజ్యమును శాశ్వతముగాఁ జూఱగొంటిమి. మాకింకేమి కోరికలు గలవు. అయినను భగవతి అమోఘరక్షచేత ఎల్లకాలము లందునునిట్లగుఁగాక.

చం॥ తొలఁగుత వ్యాధిబాధలు, వి • ధూతము లౌతసమస్తకష్టముల్
జెలఁగుత శీలశౌచములు • శ్రేయము

సీ॥ పథ్యంబుగాదది • పరమపూజ్యులు నన్నుఁ
దనియించు పంచామృ • తంబుగాని
స్నానంబుగాదది • సత్పురుషులునన్ను
ప్రోక్షించు తీర్థంపుఁ • బ్రోదిగాని
మంచంబుగాదది • మాననీయులునన్ను
లాలించు పసిఁడి యు • య్యాలగాని
వస్త్రంబుగాదది • పాపహారులునన్ను
వెలయించు హొంబట్టు • వలువగాని
గీ॥ రోగిసేవగానేరదా • రోగ్యవిధుల
భక్తు లనుసరించెడి నా ప్ర • ప్రత్తిగాని
అదియ నిజమైన నాపూజ • యద్దియొసఁగు
నాదు సాయుజ్య సామ్రాజ్య • నవ్యపదవి॥

కావున ఈశుచి ఆలయమును వైద్యాలయముఁ గావింపవలయు. నాకై నిర్మించిన యీ సప్త ప్రాకార పరివేష్టితాలయమందు నాప్రతిగా రోగి సమార్చనము వెలయింపవలయు. ప్రాకార ములందలి భవనములను స్వాస్థ్యశాలా పరిశోధనలకై వినియోగింపవలయు.

అశ్వినే—తమ ముదల నాదల ధరించుచున్నాను.

శ్రీశుచి—అశ్వినేయా! నీవుధన్యుఁడవు.

గీ॥ శస్త్రకృషికి శుచిత్వంబు • జంటఁగూర్చి
కాయ రక్షకు నమృతంబుఁ గనికరించి
నిర్వృతి విలచికిత్సాఖ్య • కల్పతరువు
జనము లారోగ్య ఫలముల చవులెఱుంగ॥

అశ్వి—అంతయు తమ అనుగ్రహాధీనమే.

శ్రీశుచి—ఇంకను మీకేమయిన వాంఛితములు గలవా?

అశ్వి—తల్లీ! మీదర్శన మాత్రమున మేమెల్లరము తమ సాయుజ్యమును శాశ్వతముగాఁ జూఱగొంటిమి. మాకింకేమి కోరికలు గలవు. అయినను భగవతి అమోఘరక్షచేత ఎల్లకాలము లందునునిట్లగుఁగాక—

చం॥ తొలఁగుత వ్యాధిబాధలు, వి • ధూతము లౌతసమస్తకష్టముల్
వెలఁగుత శీలశౌచములు • శ్రేయము సౌఖ్యముఁగూర్చు చెప్పుడున్

వెలయుత జ్ఞానశక్తి, యువి • వేకము దూలుత, సత్త్వసంపదన్
బలయుత పుత్త్రకుల్ భరత • మాతకుఁ బూజ్యతఁ గూర్పఁగల్గుతన్॥

గేయము.

శ్రీ వాణుల భగవతికిన్ సకల శుభనిధికి భవ్య మంగళము ॥శ్రీ॥
శుభమంగళము త్రిభువన సుఖజననికి మంగళముఃలు పరాశక్తికిన్
వరసుధాకలశంబు కరముఃనఁగల శుచికిన్ ॥శ్రీ॥
జయమంగళము ఖలవిప్రక్రియిదమనకు క్షేమయోగద శ్రీకిన్
సురేంద్ర నుతకీర్తికి జయమంగళము ॥శ్రీ॥

శ్రీశుచినాటకము
సమాప్తము.

---